# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ అప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గ్రామ దేవతలు

ప్రత్యేక పరిశోధనాత్మక వ్యాస సంకలనము

పర్యవేక్షకులు :
జాతీయాచార్య యస్వీ. జోగారావుగారు
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, విశాఖపట్టణం.



కోటి భ్రమరాంబదేవి

## .... విషయ సూచిక ....





# గ్రామ దేవతలు

"మదర్ గాడ్‌సెస్" అను ఆంగ్ల పదమునకు సమానార్థక ముగా తెలుగునందు గ్రామదేవతలు అని పిలుచుచున్నారు. దేవత అనే పదము మతమునకు, సంఘమునకు సంబంధించినది- మతము, ఆచారము సాంప్రదాయము సంఘమునకు, సంఘమునందలి మనుష్యు లకు వర్తించేవి అని అర్థము. సంఘము అంటే ప్రజలయందలి ఐక మత్యమునకు ప్రతీక. దేవత సంఘమునకు సంబంధించినది అయితే ఆ సంఘమునందలి ఐకమత్యమును సాధించుటకు కనిపించని దేవతను ఆలంబనముగ చేసుకొని తమ తమ జాతి ఎడల అభివృద్ధిని సాధించే మానవ ప్రయత్నములో ఒక భాగమే గ్రామ దేవత ఆవిర్భావము. దేవతల ఉత్సవములను ఆడంబరముగా చేసుకుంటూ తమలో ఐక్య మత్యమును సాధించుకొని, తద్వారా విదేశీయుల దండయాత్రలను త్రిప్పికొట్టిన సంఘటనలు చరిత్ర పుటలలో కోకొల్లలు.

అతి ప్రాచీనకాలమునుండి గ్రామదేవతలు మనకున్నట్లుగా పురాణములు చెప్పుచున్నవి. పురాణములయందు కవులు దేవతను. శక్తిస్వరూపిణిగా భయంకరముగా వర్ణించియున్నారు. గ్రామదేవత శక్తిస్వరూపమును గురించి ఆమెయొక్క విగ్రహమును వర్ణించు ఘట్టములు మార్కండేయ పురాణమునందు గాననగును.

"విచిత్ర ఖట్వాజధరా నరమాలా విభూషణా
ద్వీపిచర్మ పరీదానా శుష్క మాసాంతిభైరవా
అతివిస్తారవదనా జిహ్వాలలన భీషణా
నిమగ్న రక్తనయనా నాదా పూరితాదిజ్మఖా"

[మార్కండేయ పురాణము, 7వ అధ్యాయం, శ్లోకం 7, 8]

ఆ వర్ణన మన కలకత్తా కాళీమాతకు బాగుగా సరిపోవు చున్నది. అట్లే గ్రామదేవతలకు గూడా ఆ వర్ణన పట్టుచున్నది. గ్రామదేవత జనపదమున మిక్కిలి శక్తివంతమై, అందరి హృదయము లందును భక్తిభావముతో నిండియున్నది. అదియును గాక జానపదులు దేవతను భక్తి అనేకంటే భయమువలన మాత్రమే ఆమెను ఆరాధించుచున్నారు. జానపదులు ఆ దేవత తన్ను, తన గ్రామమును రక్షించుచున్నదని తమందరు ఆమె రక్షణలోనున్నట్లు భావించుచు, ఆమెయే గ్రామరక్షణ దైవమని ఆరాధించుచున్నారు.

గ్రామదేవత ఆవిర్భావము సరిగ్గా ఎపుడు జరిగినది మనము చెప్పలేముగాని జానపదులు తమ భుక్తికోసము కాయకష్టము చేసు కొనే వయస్సులో అంతర్గతముగా తమ్ము రక్షించుచున్నదని భావించి తాము పండించిన ఫల తృణ ధాన్యములను ఒకచోటుగ పోసి నమస్క రించిన నాటినుండి గ్రామదేవత ఆవిర్భావము చెందినదని తెలియు చున్నది. గ్రామదేవత ఆదికాలమున కేవలము ఒక వృక్షము, గట్టున నున్న రాయి లేదా మృగము. కాలక్రమేణా మానవుడు నాగరికత నేర్చిననాటినుండి పురాణములయందు శక్తిస్వరూపిణిగ వర్ణించిన నాటినుండి ఆ భావన ఆధారముగా కవుల కల్పన ఫలితముగ నిర్దిష్ట మగు విగ్రహముగ ఆవిర్భవించి, ఆరాధనా విధానాము ఏర్పడినది. హిందూ దైవములైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు భిన్నమైన ఆరాధనా విధానము ఈ దేవతలకు ఏర్పడినది.

ఆదికాలమున కుటుంబమునకు ప్రధాన అధికారిణి స్త్రీ. ఆర్యుల నాగరికతనాటి విషయము మనకు తెలుసు. కుటుంబమునకు కావలసిన సేద్యము, కుటుంబ రక్షణ, బాధ్యత స్త్రీదయితే పురుషులు యుద్ధ కార్యములయందు నిమగ్నులై యుండేవారు. అందువలననే గ్రామ దేవతలుగా స్త్రీలే తప్ప పురుషులు ఉండుట లేదు. పురుష దేవాలయ

ములుగ కొన్నిచోట్ల పోతురాజు, అడవిరాజు ఆలయములున్నను, అవి జన వ్యవహారమున చెప్పబడుతున్న 101 దేవతలకు సోదరుడుగా, లేదా సరంతుకుడిగా ఉంటూ, తామూ వారితోబాటు పూజలందు కొనుచున్నారు. ఆద్యుల నాగరికత కాలమునుండి స్త్రీ దేవతగా పూజింపబడుచూ గ్రామదేవతలుగా ఆవిర్భవించిరి.

జానపదులు పౌరాణిక దేవతలకంటే స్త్రీ దేవతలైన గ్రామ దేవతలకు అధిక ప్రాముఖ్యత నొసంగి ఆ ఉత్సవములను జరుపుదురు. తత్సంబంధమైన దేవతల ప్రాచీన గాథలను జనులు పరంపరగా చెప్పు కొందురు. ప్రపంచ పర్యాప్తముగా స్త్రీ దేవతలను సస్యదేవతలుగా పరిగణించుచున్నారు. మెక్సికో, గ్రీకు, రోమను, ఆసియా, ఈజిప్టు దేశములయందు స్త్రీమూర్తియే దేవత.

గ్రామ దేవతలను గురించి అనేకమంది పాశ్చాత్యులు, మన దేశీయులు అనేక విధములుగ నిర్వచనములు యిచ్చియున్నారు. హెన్రీ వైట్‌హెడ్ గ్రామ దేవతను గురించి తెలియ జెప్పుచు "Probably these village deities came into being yet the period when the pupil began to settle down Agricultural communities". డా॥ పుష్పేంద్రకుమార్ వారు "The term sakhti represents female divinity in general and stands for the energing power of some divinity in particular. ఇక నాయని కృష్ణకుమారిగారు "మనుష్యులను పీడించు ప్రేతాత్మలనుండి రక్షణకై ఆ మనుష్యుడే భగవద్రూపము కల్పించుకొని తనకు సంర క్షకుడిగా నిలబెట్టుకొనెను. ఆ సంరక్షకురాలే దేవత". అని చెప్పారు. అది అంత హేతుబద్ధముగా లేదు. అందువల్లన అందరి గ్రామదేవ తలకు, అన్ని ప్రాంతములవారికి వర్తించునట్లుగా "చరాచర సృష్టి జగత్తునకు మూలకారకుడగు పరమేశ్వరుని సృష్టించిన శక్తే గ్రామ దేవతగా ఆవిర్భవించినదని చక్కని నిర్వచనముగా చెప్పుకోవచ్చును.

భగవదనుగ్రహము కొరకు, కోరికలు తీరుటకు, ఉత్సవ సమయములయందును జానపద సాహిత్యమున గ్రామ దేవతలను గురించి వెలువడిన వెలువడుచున్న కథలు కోకొల్లలు. మన సాహిత్యమున శ్రీనాథుడు రచించిన హరవిలాసమున, క్రీడాభిరామమున గ్రామ దేవతల కథలు ఆచార వ్యవహారములు మనకు తెలియుచున్నవి. అట్లా ఏర్పడిన గ్రామ దేవతలు నేడు ప్రతీ గ్రామమున పల్లె పల్లెయందును గ్రామ దేవతల ఆలయములు ఏర్పడడమేగాదు, వాటికి ఉత్సవములు, ఆ ఉత్సవముల సందర్భమున ఆలయములనందు వ్యవహరించు ఆచార వ్యవహారములు, సంప్రదాయములు మనకు తెలియుచున్నవి.

ప్రస్తుతము ఈ వ్యాసపరిధి తూర్పు గోదావరి జిల్లాకు పరిమితము చేసుకొనుట జరిగినది. సువిశాలమైన ఈ జిల్లా యందు ఎంతోమంది గ్రామ దేవతలు గలరు. అనేకమైనటువంటి, విభిన్నమైనటువంటి ఆచార వ్యవహారములు, నమ్మకములు, మూఢ విశ్వాసములును జనపదమున నున్నవి.

జన వ్యవహారమున గ్రామ దేవతలు 101 మంది. వీరికి రక్షకుడు పోతురాజు అందురు ఈ గ్రామ దేవతలు ఆయా ప్రాంతములనుబట్టి అచ్చటి సంప్రదాయములనుబట్టి మనుష్యుల భౌగోళిక నైసర్గిక స్వభావము ననుసరించి గ్రామ దేవతలుగ ఆవిర్భవించిరి. తూర్పు గోదావరి జిల్లానందున్నటువంటి గ్రామ దేవతల పేర్లను ఈ దిగువున ఉదహరించుచున్నాము.

| | | |
|---|---|---|
| మరిడమ్మ | పసుపులమ్మ | మాచలమ్మ |
| నూకాలమ్మ | గంగాలమ్మ | రూపులమ్మ |
| పల్లాలమ్మ | వేగులమ్మ | మావుళ్లమ్మ |
| దోసాలమ్మ | ములగాలమ్మ | బూసుగులమ్మ |

| | | |
|---|---|---|
| గజ్జాలమ్మ | కడియాలమ్మ | భూలోకశక్తి |
| గొంపమ్మ | సుంకులమ్మ | కాగితమ్మ |
| బంగారుపాప | మొండిజగ్గప్ప | సత్యమ్మ |
| నేరేళ్ళమ్మ | గండాలమ్మ | గంటెమ్మ |
| గుబ్బాలమ్మ | సీతమ్మ | చిన్నెలమ్మ |
| కొత్తమ్మ | తల్లెమ్మ | పోలేరమ్మ |
| రావులమ్మ | వట్టిగడ్డాలమ్మ | పరదేశమ్మ |
| కోటమ్మ | పోచమ్మ | అంకమ్మ |
| చిన్నింటమ్మ | ఎల్లమ్మ | ఘంటాలమ్మ |
| తలుపులమ్మ | నక్కాళ్లమ్మ | చెఱువులమ్మ |
| నీలమ్మ | మారెమ్మ | పైడితల్లి |
| కొర్లమ్మ | దుర్గమ్మ | సోమాలమ్మ |
| చింతాలమ్మ | జమ్మాలమ్మ | వేపాలమ్మ |
| మైశమ్మ | మశానమ్మ | ఓడలమ్మ |
| బాపనమ్మ | గడిబాపనమ్మ | బంగారమ్మ |
| అడివమ్మ | తోటలమ్మ | పెద్దింటమ్మ |
| సిరిపల్లెమ్మ | లొల్లాలమ్మ | మహాలక్ష్మమ్మ |
| ఉండ్రాళ్లమ్మ | వాక్కులమ్మ | కాసులమ్మ |
| తాళ్లమ్మ | మాలకొండమ్మ | శింగరమ్మ |
| వసంతాలమ్మ | పాదాలమ్మ | బలుసులమ్మ |
| ఎనుములమ్మ | డొక్కాలమ్మ | మాలమ్మ |
| కామమ్మ | మసులమ్మ | మహంకాళి |
| పెద్దమ్మ | చౌడమ్మ | కల్లులమ్మ |
| ఆటలమ్మ | కట్టమ్మ | అసికితల్లెమ్మ |

వీళ్లేగాక ఇంకను ఎంతోమంది గ్రామ దేవతలున్నట్లుగ తెలియుచున్నది. స్థూలముగ గ్రామదేవతలను ఒక పర్యాయము పరి

శీలిస్తే, అందులో కొందరు వృక్షవాచకములుగ, జంతువాచకములుగ, ఆహారవాచకములుగ, వస్త్ర, ఆభరణ, నామపరముగ నున్నట్లు మనకు తెలియుచున్నది. కొన్ని ప్రాంతములయందు గ్రామ దేవతలు గాకుండా వీరితో సమానముగ పేరంటాండ్రు, కులదైవములు ఉండి ప్రజలచేత జానపదులచేత పూజలందుకొంటున్నారు. కాలక్రమమున పేరంటాండ్రు కులదైవముల ఆలయములు కాలక్రమేణా అభివృద్ధి చెంది గ్రామదేవతలుగా మారుచున్నవి. అందుకు నిదర్శనముగ అకాల మృత్యువు చెంది భర్తతో గూడ సహగమనము చేసిన కామమ్మ [సామర్లకోట] పాపమ్మ [మండపేట]. మొదట్లో వారివారి కుటుంబములవారిచే పూజలందుకొనెడివారు. తరువాత గ్రామ ప్రజలందరి చేత పూజలందుకుంటూ, గుళ్ళు, గోపురములు వెలసి చివరకు ఏటేటా ఉత్సవములు, తిరునాళ్లు జరుపుకొనుచున్నారు.

## లక్షణములు :

భయంకర స్వరూపిణిగ అవతరించిన గ్రామదేవతలకు కొన్ని నిర్దిష్టమైన లక్షణములను జానపద పరిశోధకులు సూచించినారు. గాని ఈ లక్షణములు అన్ని గ్రామదేవతలకు వర్తించక పోవచ్చును. ఎందువలెనంటే ప్రాంతీయతా బేధమునుబట్టి దేవత ఆకారములో మార్పు యుండును. గాని చాలా దేవతల విషయములో ఈ లక్షణములు వర్తించును. కావున వీటిని గ్రామదేవతల లక్షణములుగ పరిగణించుచున్నారు.

1. గుళ్ళు గోపురములు వెలసియున్న గ్రామ దేవతల ఆలయములనందు నల్లని రాతితో చెక్కబడిన విగ్రహముండును. (ఆదియే మూలవిరాట్టు అందురు) అదియనుగాక గర్భగుడి నిండు నట్లుగా అమ్మవారిని భయంకరమైన శక్తిగా విగ్రహము నుండును.

2. నాగరికత వాసనా సంపర్కము అంతగా నొందని గ్రామ దేవత ఆలయమునందు దేవత కేవలము చిన్న రాయిగనో, కొమ్మ చెక్కనో, బొర్లించిన కుండనో పెట్టి పసుపు, కుంకుమలతో ఆరాధన జరుగుచుండును.

3. గ్రామదేవతల ఆలయములు ఊరి పొలిమేర్లయందును చెరువుగట్లుయందును, చెట్లక్రిందను, వ్యవసాయ భూములయందును నిర్మించెదరు. వాటికి ఆర్భాటముగ పెద్ద పెద్ద గుడులుండవు. కాని కాలక్రమేణా మానవుడు నాగరికత అభివృద్ధి చెందిన తరువాత పెద్ద పెద్ద ఆలయములు నిర్మించి ఊరు పెరిగినందువల్లన ఊరి మధ్యన ఉండుట జరుగుచున్నది. పెద్దాపురం మరిడమ్మ, కాండ్రకోట నూకాలమ్మ వీరి ఆలయమును పెద్దగోపురములతో ఊరి మధ్యన నున్నవి.

4. గ్రామదేవతల ఆలయములనందు వైధవ్యమును పొందిన నడివయసు స్త్రీలుగాని, బ్రాహ్మణేతరులుగాని గాని పూజారులుగ నుందురు. బ్రాహ్మణులు పూజారులుగా నుండరు. ఎందువలెనంటే ప్రతీ అమ్మవారి ఆలయములందును బలియిచ్చే సంప్రదాయము నున్నందువలన పూజారిణులు గూడ బ్రాహ్మణేతరు లుందురు.

5. నైవేద్యములో భాగముగ బలినియిచ్చే సంప్రదాయము తప్పకుండాయుంటుంది. ఇంతకుపూర్వము ఎనుబోతును బలిని యిచ్చే వారు. అంతేగాక భక్తులు తమ తమ ఈప్సితములు నెరవేరుటకు మొక్కులు మొక్కుకొని పశువులను, జంతువులను బలులుగ సమర్పించెదరు.

6. భయంకరమైన స్వరూపము గలిగియుండును. చేతియందు శూలము, లేదా ఖడ్గము, గదను ధరించి, దంతములను కోరలను బయటకు కనిపించునట్లుగ తన నాలుకను చూపించి పెద్దపెద్ద కన్నులతో

చూచుటతోనే భయమును పొందేటట్లుగా రూపమును కలిగియుండును.

7. బలిని గ్రహించుట, రక్తపానము, గ్రామములయందు అంటువ్యాధులు వ్యాపించునపుడు మొక్కులు తీర్చుకొనేటపుడు, ఉత్సవ సమయములయందును దున్నపోతులను, గొర్రెలను, మేకలను, పక్షులను బలిగా దేవతలకు సమర్పించెదరు.

8. కొన్నిచోట్ల వృక్షములకు పసుపు, కుంకుమలను అద్ది, నాగ ప్రతిమలను రంగులతో అలంకరించియున్న కుండలను, త్రికోణముగ రాయినో, రప్పనో, పాతిపెట్టిన పొడవాటి కర్రను గాని గ్రామ దేవతగ పరిగణించి పూజ చేయుదురు. కొన్ని ప్రాంతములయందు గుండ్రని రాగి చెంబునకు పసుపు కుంకుమలను అద్ది వాటిచుట్టూ గన్నేలను అమర్చి పూజింతురు.

ఈ లక్షణములన్నియును అన్ని దేవతలకు వర్తించకపోవచ్చును. ప్రధాన లక్షణములు అన్నింటికి వర్తించును. గావున వీటిని గ్రామ దేవతల లక్షణములుగా అంగీకరించక తప్పదు.

## పోతురాజు :

గ్రామదేవతల రక్షకుడిగా, సోదరుడుగా వివిధ కథలయందు చిత్రింపబడినవాడు పోతురాజు. గాని ఈతని గురించి ప్రత్యేకమైన కథలుగాని, స్థల పురాణములుగాని ప్రత్యేకముగా ఎక్కడను లేవు. గుడులు, సంబరములు జాతరలును లేవు. గాని నెల్లూరు జిల్లాయందు ఆదిలాబాదునందు, తూర్పుగోదావరి జిల్లా మామిడికుదురు (?) నందు పోతురాజు పండుగ జేయుచున్నట్లు మనకు తెలియుచున్నవి.

పోతురాజుది కొయ్యతో చెయ్యబడిన విగ్రహముగాని, లేదా 2-3 అడుగుల రాతితో చేసిన విగ్రహముండును. ఈ విగ్రహము ప్రతీ గ్రామదేవత ఆలయమందును ఉండును. విగ్రహమునందు ఒక

చేతిలో కత్తి, మరొక చేతిలో నిమ్మకాయ ఉండును. చేతిలో ఉన్న కత్తినకు గాజులుండును. పాదములవద్ద కోడిపుంజు బొమ్మలుండును. కొన్ని కొన్ని ఆలయములనందు విగ్రహమునకు బదులుగ సన్నటి పొడవైన కర్రను పాతుదురు. అదియే పోతురాజు అందురు. అమ్మవార్ల ఉత్సవమునందు ముందు పోతురాజు విగ్రహమే ముందుగా బయలుదేరును.

పోతురాజు గురించి జానపద పురాణములయందు చిత్ర, విచిత్రమైన కథలున్నవి. పోలేరమ్మ, పోచమ్మ, ఎల్లమ్మ, మరిడమ్మ నూకాలమ్మ, రేణుక, అంకమ్మ మొదలగు కథలయందు పోతురాజు వారికి సోదరుడుగ, సహాయకునిగ వ్యవహరింపబడు చున్నాడు. మరి యొక జానపద పురాణమునందు పార్వతీదేవినకు వరుసగా నూటొక్క మంది కుమార్తెలు జన్మించగ, చివరగ మగ సంతానము కొరకు ఆమె పరమేశ్వరుని ప్రార్థించెను: అంత ఆతడు ప్రసన్నుడై ఆమెకు మగసంతానమును ప్రసాదించెనట, అతడే పోతురాజు అని తెలియ జేయుచున్నారు. మరొక్క కథయందు పాండవులు అరణ్యవాసము చేయుచున్నప్పుడు తమ కోటలను రక్షించుటకు ఒక మనిషి కావలసి వచ్చెను. అంత అతడు కొండ అంతటి అన్నపురాశిని, తాటిచెట్టంత పోతును కోరెను. పాండవులు అరణ్యవాసము పూర్తియైన తరువాత అన్నపురాశిని, తాటిచెట్టంత పోతును యిచ్చిరి. పోతును, రాశిని పొందినవాడు గావున పోతురాజుగ పిలిచిరి.

నెల్లూరు నగరమున ధర్మరాజునకు, ద్రౌపదికిని గుళ్లు కలవు. ఆ గుడిని పంచములు ఆరాధించెదరు. ఆ గుడియందు పోతురాజు విగ్రహము కలదు. ఆ విగ్రహము ఒక చేతిలో కత్తిని ధరించి, మరొక చేతిలో ఖడించిన స్త్రీ శిరస్సు జుత్తును పట్టుకొని వ్రేలాడదీస్తూ యుండును. దీనికి ప్రత్యేకమైన గాథ కలదు. అవన్నియును మనకు

అప్రస్తుతము. మొత్తముమీద గ్రామ దేవతలతోబాటు అతడు గూడ ఉంటూ. వారితో సమానముగా పూజలందుకొనుచున్నాడు పోతురాజు.

వివిధ గ్రామములయందు వివిధ విధములైన గ్రామ దేవతల ఆలయములున్నవి ఆ గ్రామ దేవతల విగ్రహములుగూడ ఒకేవిధముగా చిత్రించియుండవు. భిన్న భిన్న ధర్మములను అనుసరించియుండును. కొన్ని ఆలయములను బ్రాహ్మణేతరులు పూజిస్తే మరికొన్ని ఆలయములను బ్రాహ్మణులు పూజించెదరు. మరికొన్ని ఆలయములను పంచములను, పంబలివాళ్లు ఆరాధించుచున్నారు. అంకమ్మ, అంకాలమ్మ, అంజమ్మ, అక్కమ్మగా పిలువబడుచున్న దేవతల ఉత్సవముల యందు అంకమ్మ విగ్రహము రాతితో గాని, కర్రతోగాని, చేయబడియుండును. చతుర్భుజియైన అంకమ్మ చేతులలో పాము డమరకము, పుర్రె, కొరడా, యుండి విగ్రహము భయంకరముగా నుండును. ఉత్సవములయందు ఆసాదులు, గొల్లలు, పూజారులుగా నుందురు. వీరు పంబజోళ్ళను వాయించుచు, అంకమ్మ వీరగాధలను కథలుగా ఉత్సవములయందు చెబుదురు. పశువులమ్మ, పల్లెప్రజలను, రోగములనుండి రక్షించెడి దేవతగా అంకమ్మను పల్లీయులందరు పూజింతురు.

తెలుగుదేశమున ప్రతి గ్రామమునందును పూజలందుకొంటున్న ప్రతీ గ్రామ దేవతనకు ఒక ప్రత్యేకమైన పురాణము, స్థలగాధలు అసంఖ్యాకముగా కలవు. అన్ని కథలయందును ఆమె ఒక శక్తి స్వరూపిణిగ, జానపదులను గాచి రక్షించు దేవతగానో చిత్రించిరి.

## పేరంటాండ్రు - కుల దేవతలు :

గ్రామ దేవతలతోబాటు పేరంటాండ్రకు కూడా ఘనమైన ఉత్సవములను జరుపుచున్నారు. కులదేవతలు ఆయా కులములకే పరిమితము కాగా, పేరంటాండ్రు ఆయా కుటుంబముల వారికే పరి

మితము. గాని ఉత్సవములయందు గ్రామ ప్రజలందరును ఉత్సాహముతో, భక్తి ప్రపత్తులతో పాల్గొనెదరు. ఉత్సవ సమయమున ఆయా కులములు, కుటుంబములవారే ముందుగా పాల్గొందురు. వైశ్యులకు కన్యకా పరమేశ్వరి, దేవాంగులకు చౌడేశ్వరిదేవి, బీరప్ప మల్లన్నలు కురుమ, గొల్ల, కాపులకు, గంగాదేవి పల్లెయులకు కుల దైవముగ పరిగణించుచున్నారు. కులదైవములకు పూజా విధానము అంతా సాత్వికమే. ఆమెకు చీర, జాకెట్టు, చలిమిడి, వడపప్పు, బూరెలు, అన్నము, పాలు, పిండివంటలు ఉపాహారముగ నైవేద్య మును చెల్లింతురు. ఇందు బలి నిషిద్ధము. మాంసాహారమును ముట్టరు. పూజారిగా కుల పెద్దలు ఉందురు.

పురాణములయందు పతివ్రతలు తమ మానసిక అతీత శక్తులచే దేవతలను, రాక్షసులను, మానవులనుగూడా పరాజితులను గావించిరి అనసూయ, అరుంధతి ఈ కోవకు చెందినవారు. జానపద సాహిత్య మునందు పేరంటాండ్రు పురాణ పతివ్రతలతో బాటు సమానమైన ప్రతిపత్తిని గలిగి తమ జీవితకాలములోనే తమ పాతివ్రత్య మహాత్మ్య మును ప్రదర్శించి పురాణస్థాయినకు ఎదిగారు. వీరు తమ మరణము నకు కారణభూతులైన వారిని సర్వనాశనము గావించి దేవతలుగ వెలసి ప్రజలచేత పూజింపబడుచున్నారు. అత్తల ఆరళ్ళను భరించలేని వారు, తోడికోడళ్ళ ఈర్ష్యాసూయలకు బలి అయినవారు, భర్తలచే సహగమనము చేసినవారు, కాముకులచేత బలాత్కరింపబడినవారు వారి మరణానంతరము పేరంటాండ్రుగ వెలసినవారు. మరణానంత రము వీరి విగ్రహములు శిలలుగా, వృక్షములుగా, ఫల పుష్పము లుగా భూమిపైన నిలిచిపోయినట్లు కథలయందు వర్ణింపబడినారు.

మరణానంతరము పేరంటాండ్రు తమ కత్యంత సన్నిహితులైన వారి స్వప్నములో కనబడి గుడులు కావలయునని, పూజలు జరిపించు

మని ఆదేశించెదరు. కొందరు పేరంటాండ్రు మరణానంతరము నకు పూర్వము, అనంతరము నిస్సంతులకు సంతు కలుగునట్లుగా ఆశీర్వదించెదరు. వారి ఆశీర్వాద ప్రభావముచేత సంతానము కలిగిన ఎడల తమ బిడ్డలకు పేరంటాండ్రు పేర్లనే పెట్టుకొందురు. పేరంటాండ్రు అభిమతము కూడా అదే.

గ్రామ దేవతలవలే పేరంటాండ్రు కూడా శక్తి స్వరూపిణులు వీరు ఆగ్రహించినచో పశునాశనము, ప్రాణనష్టమును సంభవించునను భీతిచేత అత్యంత భక్తి శ్రద్ధలతో వీరికి ఉత్సవములను జరిపించెదరు మండపేటనందున్న పాపమ్మ పేరంటాల ఉత్సవము, నాయకరావుపేట నందున్న పేరంటాలమ్మ ఉత్సవములు ఈ కోవకు చెందినవి.

మానవునకు మరణము సహజము అయినప్పటికిని కొంతమంది ప్రత్యేక వస్తులే దేవతలుగా. పేరంటాండ్రుగా వెలయుటకు పరిస్థితులే కారణము. వీరు మరణించగనే పశు నష్టము, ప్రాణనష్టము అద్భుత సంఘటనలు గాని సంభవించిన, అవి మరణించినవారి ఆగ్రహము. అనుగ్రహము వల్లనే సంభవించినవి అని నమ్మి వారికి పూజలు చేయుదురు.

1. పరుల దౌర్జన్యమునకు, ఈర్ష్యాసూయలకు మరణించిన పేరంట్రాండ్రు వారి కథలు మనకు గలవు. బీరమ్మ, బతుకమ్మ, తిరుపతమ్మ మొదలగువారు.

2. పర పురుషులచేత బలాత్కరించబడి మరణించిన వారు. -బయ్యమ్మ

3. భర్తల సంశయ స్వభావముచేతను, సాటి స్త్రీల అసూయ వలనను, లోకులచేత నిందించబడి, శీలమును శంకించబడుట వలనను మరణించి, మరణానంతరము పేరంటాండ్రుగా పూజలందుకొనినవారు

ఉదా: నాగమ్మ, లక్ష్మమ్మ, రాములమ్మ.

4. మరణించిన భర్తతో సహగమనము చేసినవారు — కామమ్మ, పాపమ్మ.

5. బలిగా నొసంగబడినవారు, సంఘసంక్షేమమునకు ఆత్మార్పణము చేసుకొన్నవారు నాంచారమ్మ, ముసలమ్మ, నలజారమ్మ.

పేరంటాండ్రు లేదా కులదేవత లందరికి తలోక ప్రత్యేకమైన ఇతివృత్తముతో గూడిన కథలు గలవు. ఇవి ఎంతవరకు వాస్తవము అన్నది మనకు ఇక్కడ ముఖ్యముగాదు. ఒకవేళ పరిశోధించి ఇది అంతా అభూతకల్పన అన్నా మనలను జానపదులు నమ్మరు సరిగదా తగురీతిలో దేహశుద్ధి గూడ చేయవచ్చును. ఆయా ఇతివృత్తములు ఆయా ప్రాంతములనుబట్టి మారుచుండును గాని మౌలికమైన ఆశయములు మాత్రము ఒక్కటే.

## గ్రామదేవతల పండుగలు ఆచారములు :

ప్రతీ జాతికిని, దేశమునకును అనూచానముగా వచ్చు కొన్ని ప్రత్యేక ఆచారములు, సంప్రదాయములు కలవు. అవి ఆయా ప్రజల దృక్పథముల ననుసరించి, వారి వారి జీవిత పరిధిల ననుసరించి ఆచారములుగా రూపొందును. అన్ని దేశములయందును అన్నింట ఒక్కలాగా ఉండవు. ఒక్కొక్క ప్రాంతమున ఆయా ప్రాంత భేదములను అనుసరించియుండును. తెలుగు వారిలోనే జానపదుల ఆచారములు నాగరికుల ఆచారములకంటే భిన్నమై తమ ప్రత్యేకతను ఆదినుండి నిలబెట్టుకొనుచున్నవి. అగ్రవర్ణముల చేత క్షుద్రదేవతలుగా పరిగణింపబడి నిరాదరించబడినను, ఆపదలు కలిగినపుడు, అంటువ్యాధులు ప్రబలినపుడు వారు గూడా ఆ గ్రామ దేవతలకు మ్రొక్కులను మ్రొక్కుచున్నారు తీర్చుచున్నారు.

గ్రామ దేవతల పండుగలు, ఉత్సవములు, జాతరలలో అగ్రి వర్ణములవారు అగ్రిస్థానము వహించకపోయినను, ధన, దాన్య సహాయము చేయుదురు. వారుగూడా ఆ ఉత్సవమందు పాల్గొనెదరు. శైవ, వైష్ణవ, జైన, బౌద్ధమత ప్రిభావము మన దేశమున ప్రిబలి నప్పటికినీ అనేక వేల సంవత్సరముల నాటి గ్రామదేవతలమీాద భక్తి, వాటి ఆరాధనా విధానముమీాద మాత్రము తమ తమ ప్రభావము లను చూపలేకపోయినవి.

గ్రామ దేవతల పండుగలు, సంబరములు నిర్ణిత దినమున జరుగవలెనని నియమములేదు. ప్రతీ సంవత్సరమును జరుపుదురు. కొన్ని దేవతల ఉత్సవము 2, 3 సంవత్సరముల కొక పర్యాయము జరుపుదురు. మఱికొన్ని గ్రామ దేవతలకు ప్రితిసంవత్సరము ఉత్సవములు గ్రామస్థులు తమ తీరిక వేళలయందు జరుపుదురు. మరికొన్ని గ్రామ దేవతలకు ప్రతీ సంవత్సరమున నిర్ణిత కాలమున ఉత్సవములు జరుపుదురు. ప్రితీ సంవత్సరము నిర్ణిత దినమున జరిగే ఉత్సవముల యందు అన్ని ఆచారములు, సంప్రిదాయములు పాటించుచు జరుపుదురు. ఆషాఢమాసమున అమావాస్యరోజున మరిడమ్మ (పెద్దాపురం జాతరను నెలరోజులు, చైత్రిమాసి అమావాస్యరోజున నూకాలమ్మ (కాంద్రకోట) జాతరను నెలరోజులు జరుపుదురు.

సాధారణముగా గ్రామస్థులు తనుపంటలు పండినపుడు తర్వాత విశ్రాంతి సమయములో వర్షాకాలమందును ఉత్సవములు జరుపుదురు. పశువులకు అంటు రోగములు, వ్యాధులు ప్రిబలినపుడు, కరువు కాటకము లేర్పడినపుడును గ్రామ దేవతలకు ఆగ్రిహము కలిగినదని భీతి చెంది జానపదులు దేవతలకు బలి నొసంగి, పండుగలు గావించెదరు. జాతర, జాగారము, ఉత్సవము, తిరునాళ్ళు, సంబరములు మొదలగునవి గావించెదరు.

గ్రామ దేవతల ఆలయమున జాతరన ప్రధానముగా సంప్రదాయము బలి. బలి విధానమున దున్నపోతును గాని, మేకను గాని, గొఱ్ఱె, కోడి ఇతర పక్షులను సమర్పించెదరు. బలులకు ఏయేవాటిని బలిని యివ్వాలో శ్రీనాథుడు తన భీమ ఖండనము తెలిపినాడు.

బలిని యిచ్చే నిషేధము ఉన్నప్పటికిని జానపదులు బలిని యిచ్చుచునే యున్నారు. బలిని యిచ్చుట యిష్టములేనివారు కొబ్బరి కాయను గుమ్మడికాయను గుడిముందు బ్రద్దలు గొట్టెదరు. దున్నపోతును బలిని యిచ్చే ఆచారమునకు పూర్వదశ నరబలిని దేవతకు సమర్పించేవారు.

దేవతలకు బలిని యిచ్చే ఆచారము నేడు కాదు గదా ఎప్పటి నుండి పుట్టబడినదో మనకు తెలియదు. గాని ఆధారములు సింధు నాగరికతనుండి మనకు తెలుయుచున్నవి. శిథిలయములందు లభించిన ఫలకమునందు ఒక పురుషుడు కత్తిని ధరించియుండగ, స్త్రీ వంగి తన చేతులను పైకి చూపుతున్నట్లుగ ఉన్న చిత్రమును మనము ఆధారముగా గ్రహించవచ్చును భాగవతమునందు శునశ్శేఫుడు అంబరీషుని యాగ పశువుగా తండ్రిచేత అమ్మబడెను. యాగ పశువుగ యూప స్తంభమునకు కట్టివేయబడిన శునశ్శేపుడు అశ్వినీదేవతలను మెప్పించి విముక్తుడయ్యెను. దేవతల అనుగ్రహామును పొందుటను విజయమును పొందుటకు యాగఫలమునకు నరబలి నొసంగే సంప్రదాయము మనకు గనబడుచున్నది. మహాభారత యుద్ధమునకు కురు పాండవులలో ఎవరు ముందుగ బ్రహ్మచారిని. అమిత నిష్టాపరుని కురుక్షేత్రమునకు బలి యిచ్చెదరో వారే విజయమును పొందుదురు అని సహదేవుడు ముహూర్తమను నిర్ణయించెను. అంత పాండవులు శ్రీకృష్ణుని సలహా మీాద "ఇలావంతుని" కురుక్షేత్రమునకు బలి యిచ్చినారు. "ఇలావంతుడు' అర్జునునకు, ఉలూచికి జన్మించినాడు. కురుక్షేత్రయుద్ధము

చూడవలయునన్న కోరికను శ్రీకృష్ణుడు అతనికి తీర్చినాడు. కురుక్షేత్ర రణరంగమున ఖండించబడిన శిరస్సును యూపస్తంభమున వ్రేలాడదీయగా ఆ శిరస్సు రణరంగమున కన్నులు విప్పి అంతయును చూచెను. చివరగా గదా యుద్ధమున భీముడు దుర్యోధనుని చంపినపుడు తృప్తిగా కన్నులు మూసెను. ఖురానునందు గూడ నరబలి ప్రసక్తి కలదు. ఆత్మ నివేదనము వలన భగవంతుని అనుగ్రహమును పొందెదమన్న విశ్వాసము ప్రబలియుండెను. కాలక్రమేణా తనకు తాను భగవంతుని అర్పించుటకు మారుగా మరియొక ప్రాణిని బలిగా నిచ్చిన కోరికలు నెరవేరునను భావము మానవునకు కలుగగా, ముందుగా జంతువులను, పక్షులను, తరువాత తృణ ధాన్యములను అర్పించేవారు, బైబిలునందు గూడ మానవునికి బదులుగ ఈ గొర్రె ప్రాణమును నీకు సమర్పించు చున్నాను. అని కలదు.

బలిని గురించి పాశ్చాత్యులు గూడా అంగీకరించిరి. ప్రాజ్ఞనపుడు చనిపోయినవారి సమాధుల ముందు నీరు ఆహారమును పెట్టెడి ఆచారము దేవతలకు బలి యివ్వడమను ఆచారముగా రూపొందినదని భావించెరి.

బలికి యివ్వబడే జంతువు గణదేవతకు ప్రతీకగా ఎంచబడుచుండెడిదను అంశమును బలపరచుచున్నది. బలికి ముందు జంతువును పసుపు, కుంకుమలతో అలంకరించుదురు. ఊరేగించుదురు. ఊరేగించునపుడు ప్రతీ యింటిముందు దాని కాళ్ళపైన నీళ్ళు పోయుదురు. జంతువును బలి యిచ్చిన తరువాత బలిగా దేవతకు సమర్పించు సమయమున రక్తమును నైవేద్యపు టన్నములోనికి పట్టి దానిలో వేపాకు పసుపు కలిపి, ఆ రక్త మిశ్రమమును ఇళ్ళపైన, పొలములలోను జల్లుదురు. ఈ నైవేద్యపు అన్నమును రైతులు, గొల్లలు, తమ సంపద పైన, గొర్రెల మందలపైనను, వ్యవసాయ భూములపైనను జల్లు

దురు. రక్తమును జల్లు సమయమున నోటిలో బలియైన జంతువు యొక్క కాలేయమును, నిమ్మకాయను పెట్టుకొని ఊరేగించుదురు. గుండె, మెదడు, కాలేయము, మొదలగువానిలో ఆత్మ ఉందన్న భావనయే బలిపశువు చంపబడినపుడు ఆ అంగములే ప్రత్యేకముగా దేవతకు ఆహారము అగుటకు కారణము అగుచున్నది. బలి జంతువు యొక్క రక్తములో మిశ్రితమైన అన్నమును బలి అన్నము అని అందురు. దీనిని ఇళ్లపైన, పొలములపైన జల్లినచో దేవత వానిని రక్షించునని గ్రామస్థుల విశ్వాసము. గణదేవతకు ప్రతీకగా భావించబడు జంతువు శక్తి కాలేయము ద్వారా తమకు సంక్రమించునను భావన జానపదులయందు గలదు. కాలేయమును నూనెలో వేయించుట, ఆ ముక్కను ప్రసాదముగా నిచ్చెదరు. దీనినే రస్సుఅందురు.

ఉత్సవములయందు కల్లును దేవతముందు సాకగాపోయుట ఒక ఆచారము. గృహసంబంధి, మతసంబధి ఆచారములో కల్లును త్రాగుట, దేవతకు సమర్పించుట జానపదులకు సామాన్యమైన విషయము.

ఉత్సవ సమయములందును, దేవతకు బలినొసంగు జంతువుల పైనను కల్లును వాటిమీద పోయుదురు. అన్నవరము గ్రామము దగ్గర తమ్మయ్యపేటనందు కల్లులమ్మ ఆలయము కలదు. ఆ అమ్మవారి చుట్టుప్రక్కల ప్రాంతములయందు కార్మికులు తాటిచెట్లనుండి కల్లును తీసుకొని, ఆ తొలికల్లును అమ్మవారునకు నైవేద్యముగా చెల్లించెదరు అమ్మవారి ఉత్సవమునందు జంతులవుమీద కల్లుతో తడిపి బలినిచ్చెదరు. బహుశః అందులకేనేమో ఆ తల్లిని కల్లులమ్మ అని పిలుచుచున్నారు.

గ్రామదేవతల పండుగలలో బోనాలను చెల్లించెదరు. రంగులతో

అలంకృతమైన కుండనందు అన్నము నుంచెదరు. దీనిని "కడుముంత' అందురు. కడుముంత మీద చిన్ని మూకుడును మూతగపెట్టి అందులో నూనెపోసి, వత్తిచేసి, జ్యోతిని వెలిగించెదరు. దీనినే "కంచుడు" అని అందురు. స్త్రీలు ఈ దొంతిని పదిలముగా నెత్తిపైన నిలుపుకొని గుడి కడకు వెడలి గుడిచుట్టూ ప్రదక్షిణము చేసి ఆ బోనములను దేవికి నివేదించుదురు. ఉత్సవమునకు రెండురోజులుముందు అమ్మవారి ప్రతిమగల ఘటమును ఊరియందు ఊరేగించి ఉత్సవానంతరము దానిని నీటిలో వదలివేయుదురు. పండుగకు ముందు కలశ స్థాపన చేయుదురు.

దేవతకు బలి నొసంగబడిన పిదప "రంగ మెక్కుట" అను కార్యక్రమము గ్రామ దేవతల ఉత్సవములలో కనబడును. కుమ్మరి ఆవములో కాలని పచ్చి కుండను మెడవరకు భూమిలో పాతిపెట్టి మీద కొత్తచేటను పెట్టి దానిమీద ఎక్కి పూనకము పొందిన వేల్పు లోడు జనుల భవిష్యత్తును, ఊరి బాగోగులను వివరించును. దీనినే "శివమెక్కుట" అని అందురు.

గ్రామదేవతల ఉత్సవ, ఊరేగింపులలో వేప కొమ్మలను పట్టుకొని ఊరేగుదురు. పందిళ్లకు వేప తోరణములు ఉపయోగించు దురు. శాస్త్రరీత్యా వేపగాలి చలువను, ఆరోగ్యమును నొసంగును. దీని వాడకము ఆచారముగా గానగును. ఉత్సవ సమయములలో దేవతలు శక్తిరూపమున పురుషులను స్త్రీలను ఆవేశించుదురనియు విశ్వసించుదురు. దీనినే "పూనకము" అందురు. శక్తి ఆవహించిన వారికి "శివశక్తులు" అని అందురు. ఆ శక్తి ఆవహించుట ఎక్కువగా స్త్రీలలో కనబడును.

గ్రామ దేవతల ఉత్సవములో మరికొందరు భక్తులు అగ్నిగుండమునందున నడుచుదురు. ఒక గజము లోతులో వెడల్పుగానున్న

గోతిని త్రవ్వి అందు రెండు, మూడు బళ్ళ కట్టెలను వేసి అయిదారు గంటలు వాటిని ఎర్రగా కాల్చుదురు. కణకణమనుచున్న నిప్పులపై ప్రధాన అర్చకుడు, ఇతర భక్తులు నడుచుదురు. ఈ కార్యక్రమము అంతా చాలా ఉద్రేకముగా జరుగును.

గ్రామ దేవతల ఉత్సవ సమయములందు మొక్కు చెల్లించుకొనేవారు ఉదయమునుండి ఉపవాసముతో మంగళ హారతులను పట్టుకొని నైవేద్యములతో ప్రతిమలతో డప్పులను వాయించుచు గుడికి వెళ్ళెదరు. గుడికి పోవునపుడు మార్గమున తెల్లని దుస్తులను పరచి దానిపైన నడచునట్లు పోవుదురు.

గుడి ముందు బోనపు దొంతరల దించిన తరువాత ఆవు పేడతో అలికి పసుపు, పిండితో ముగ్గులనువేసి తాము తీసుకొని వచ్చిన విగ్రహములను పసుపుపచ్చని బట్టలను లేదా తెల్లటి బట్టలను ధరింపజేసెదరు. ప్రతిమలను పసుపు, కుంకుమలతో అలంకరించెదరు. వెండి, బంగారముతో చేసిన కన్నులను వీటికిపెట్టెదరు: విగ్రహములయందు కుమ్మరింటినుండి తెచ్చిన కుండపట్లు పెట్టి అందు గుగ్గిలము వేయుదురు. గుడివెలుపల బలికొరకు తెచ్చిన తల్లి గొర్రె, పిల్లగొర్రెలపై పసుపు కుంకుమలను జల్లి, వాటికి గుగ్గిలముపొగ చూపెట్టెదరు. వాటికి వీపుపైన, ముక్కులోను, చెవులలో నీరుపోయుదురు. డప్పులను ఎక్కువ వేగముతో వాయించి, బలి పశువులను వణుకునట్లుగా చేయుదురు. ఈ కార్యక్రమమును వారు "జడిపించుట" అందురు. ఒకవేళ జంతువులు వణకనిచో మా తప్పులను క్షమించమని దండములను పెట్టుదురు బలి పశువులు వణికిన పిదప వానిని నేలపై పడుకొండబెట్టెదరు. బోనపు కుండలయందలి అన్నము బలి పశువుల తలపై నైవేద్యముగ తీర్చిపెడుదురు. చాకలి బలి పశువుల తలలను ఖండించిన పిదప ముందు కాలు నరికి బలిజంతువు నోటిలో పెట్టుదురు. రక్తముతో కూడిన

అన్నమును గుడివెలుపల నాలుగువైపులా జల్లుదురు. బలి జరిగిన తరువాత మొక్కుకున్నవారి పుట్టు వెంట్రుకలను గుడి ఆవరణ నందున్న వేపచెట్టు క్రిందగాని, రేగిచెట్టు క్రిందగాని తీయుదురు. ఈ కార్యక్రమము అంతయును ముగిసిన పిదప పండుగ చేసినవారు బలి పశువుల చర్మమును తలను చాకలికిచ్చి మిగిలినదానిని ఇంటికి తీసుకొని పోయెదరు.

"ఊరడిపండుగ" అని మరొక సంప్రదాయము కలదు. ఆ గ్రామ దేవత పండుగ సమయమున బలి పశువైన దున్నపోతును ఎనిమిది రోజులవరకు మేతవేయక దానిని శక్తిహీనముగా ఉంచుదురు మాలవాడు పండుగనాటి సాయంత్రము దున్నపోతుపై బండారిని చల్లి డప్పు చప్పుళ్ళచేత దానిని వణికించును. గ్రామ కరణము తన చేతికి దున్నపోతు తోకను కట్టుకొనును. దున్నపోతు పారిపోకుండుటకై నాలుగువైపుల త్రాళ్ళతో దానిని పట్టుకొనెదరు. కరణము చేతినుండి బలిపసువుతోక జారిపోయినచో అతనికి శిరచ్ఛేదనము జరుగును. గుడిని సమీపించువరకు కరణమునకు మనస్సునందు భయము కలుగుచునే యుండును. కనుకనే దున్నపోతు శక్తిహీనమగుటకు మేత వేయకుండా ఊరేగింపు సమయమున పరిగెత్తకుండా త్రాళ్ళచేత బంధించెదరు. ఒకవేళ దున్నపోతు పారిపోవుటకు ప్రయత్నించిన కరణము దాని తోకను నరికివేయును, బలిపశువుతో ఊరిపెద్దలు ప్రజలు ఊరేగింపుతో అమ్మవారి గుడికి పోవుదురు. దున్నపోతు కదలనిచో భూతము పట్టెన దని దానిముందు కోడి గుడ్లు పగలుగొట్టి, కోడిపిల్లలను గొంతు నులిమి చంపుదురు. ఊరేగింపు సమయమున మాదిగవాడు కోడి గ్రుడ్లను చిదిమివేయును. కోడిపిల్లలను నులిమివేయును ఊరేగింపు గుడిని సమీపించిన తరువాత రెండు కిలోల జొన్నలతో కుంభమును పోయుదురు. ఆ కుంభముమీద జ్యోతిని పెట్టెదరు. దున్నపోతు తోకను కరణము చేతినుండి విడదీయుదురు మాలవాడు దున్నపోతును





నేలపై పరుండబెట్టి గొడ్డలితో తలను నరికివేయును. తరువాత పల్లి వారు గ్రామమున మాలవాడు చిన్నమేకను గావుపట్టి గుడి చుట్టూ 7, 8, 9 సార్లు ప్రదక్షిణ చేయును. గావు అనగా జంతువును బలి యిచ్చిన తరువాత ఆ జంతువు తాలూకు కాలేయము, ఊపిరితిత్తులు మొదలగునవి శరీరమునుండి వేరుచేసి ఆ భాగములను నోటియందు పట్టుకొని, వానితోబాటు నిమ్మకాయను పళ్ళయందు బిగించి, ఊరంతయు తిరుగును. దీనినే గావు పట్టుట అందురు. ఊరివారందరు మేకను వండి అచ్చటనే భోజనము చేసి ఇంటికి వెళ్ళిపోవుదురు. ప్రసాదము గ్రామపెద్ద తీసుకొనిపోవును. మాదిగ దున్నపోతును తీసుకొనును. ఈ విధానమును ఊరడిపండుగ అందురు. ఈ బలి విధానము ఇంతకు పూర్వము ఎక్కువగా వుండేదిగాని ఇప్పుడు మాత్రము తెరమరుగ యినది. కాని తుని తలుపులమ్మ లోవ నందు మాత్రము ఈ ఆచారము ఇంకను జీవించియున్నదని తెలియుచున్నది.

మరొక ప్రాంతమున మరొక సంప్రదాయము గలదు. పెద్ద అన్నపురాశిని కుంభముగ దేవతకు నైవేద్యము పెట్టుదురు. దున్నపోతును బలిగా యిచ్చెదరు. బలిగా యిచ్చిన జంతువు రక్తమును అన్నముతో మిశ్రమముచేసి దానిని చేటలలో పెట్టుకొని గ్రామము చుట్టూ జల్లుదురు. ఆ సమయమున పొరుగూరి వ్యక్తులను ఎవ్వరినీ అచ్చట ఉండనీయరు. పొరుగూరు వారు ఆ మిశ్రమమును తీసుకొని పోయినచో ఆ ఉత్సవపు ఫలమంతయు వారికే సంక్రమించుననుు విశ్వాసము వారికి కలదు. కనుకనే బలి అన్నమును నెత్తిన పెట్టుకొన్న వ్యక్తి అందరినీ జాగ్రత్తగా గమనించుచుండును. ఇతరులు అతని తలపైన కత్తులను ఆడించుదురు. మొక్కులను తీర్చుటకు జంతువులను, కోళ్ళను బలులుగా యిచ్చెదరు. కొన్ని గ్రామ దేవతల ఆలయములందు దున్నపోతును బలిని యిచ్చెదరు. బలి యిచ్చిన తరువాత బలి నుండి వచ్చిన రక్తమును మూకుళ్ళనందు పట్టి ఆ రక్తములో నవ

ధాన్యములను జల్లెదరు. వాటిని ఆలయమునందుంచి తలుపులను మూయుదురు. 3 రోజుల అనంతరము తలుపులు తీసిన తరువాత మూకుళ్ళనందు ఉంచబడిన విత్తనములలో ఏ విత్తనము బాగుగా మొలకెత్తునో ఆ రకముపంటలు బాగుగా పండునను విశ్వాసముకలదు తరువాత ఆలయమును శుభ్రపరచెదరు.

గుడిముందు ప్రధాన ద్వారము గడపకు ముందర చిన్నపిల్లలు దాటుటకు ముందుగా వారి కాళ్ళదగ్గర ముమ్మారుసార్లు కల్లును దారపోయుదురు. కొన్ని ఆలయములందు ధాన్యపు కుంచెలను భక్తులు సమర్పించెదరు. కావిడి కోళ్ళను, గండదీపమును సమర్పించెదరు. కావిడికోళ్లు అనగా ఒక పొడవాటి కర్రకు రెండువైపులా రెండు కోళ్లను కట్టుదురు. అంత ఆ కర్రను కావిడికర్రగా భుజముమీద నుంచుకొని మొక్కుకొన్న భక్తుడు గుడిచుట్టూ ముమ్మారు సార్లు తిరిగి ఆ కావిడిని గుడినందు అమ్మవారికి యిచ్చెదరు. గండదీపము అనగా ఒక కొత్త మూకుడును తీసుకొని దానినిండా నూనెను పోయుదురు ఆ నూనెయందు వత్తిని వెలిగించి ఆ దీపమును నెత్తిమీద పెట్టుకొని గుడిచుట్టూ ముమ్మారుసార్లు తిరిగి ఆ దీపమును అమ్మవారి కిచ్చెదరు, అమ్మవారి ఉత్సవమునకు ముందుగ గరగలను నెత్తిమీద పెట్టుకొని ఊరంతయు తిరుగుదురు. అంత జానపదులు గరగలు నెత్తిన పెట్టికొని నృత్యము చేయుచున్న వ్యక్తి తమ యింటి గుమ్మం ముందునకు వచ్చినపుడు దేవత వచ్చినట్లుగా భావించి కాళ్ళమీద నీళ్ళుపోసి గరగనకు పసుపును అద్దెదరు. అంత నృత్యము చేయువాడు ఆ పసుపునుండి కొంత భాగమును, వేపాకులను ప్రసాదములుగా యిచ్చును. అవి దైవప్రసాదములుగా భావించి స్వీకరించుదురు. దీనినే గరగలు తీయుట అందురు.

భగవదనుగ్రహము కొరకు, కోరికలు తీరుటకు ఉత్సవ సమ

యములలో బలు లొసంగుట, తనకు తానే ఆత్మార్పణము గావించు కొనుట యించుమించు ప్రపంచమందలి అన్ని దేశములయందును, అన్ని జాతులయందును బలినియిచ్చు సాంప్రదాయము ఆచారముగా కలదు. ఇట్లా అనేక ఆచారములు మూఢ విశ్వాసములు జానపదులలో గ్రామ దేవతల (అమ్మవార్ల) విషయములలో గలవు. ప్రతీ ఆచారమునకు ఒక ప్రత్యేకత కలిగియుండును.

ఈ ఆచారములు, పుట్టుపూర్వోత్తరములు వాటి అంతరార్థము జానపదునికి అవగతము గాకపోయినను, తమ పూర్వీకులచేత జరుపబడిన ఈ ఆచారములను ఆక్షేపించిన, ఉపేక్షించిన అరిష్టములు ప్రాప్తించునని ప్రగాఢ విశ్వాసము. కొన్నివేల సంవత్సరములనాటి మానవుల నమ్మకములను, తమ ఆచారములలో, గాథలలో ప్రతిపాదించిన జానపదులు ప్రాచీన మానవుని మత విశ్వాసపు నిధులు. గాథలు ఖిలము గాకమునుపే గతకాలపు మతవిశ్వాసములకు నిదర్శనములుగా వాటిని అక్షర రూపములో పదిలపరచుట పరిశోధకుల తక్షణ కర్తవ్యము.



# గ్రామ నామములు

సాహితీ రంగంలో పరిశోధన నేడు రెండు విధాలుగా జరుగుతున్నది. ఒకటి భాషా చరిత్ర పరంగాను, మరొకటి కావ్యపరంగాను. గడచిన కాలంలో కావ్యపరంగా పరిశోధన ముమ్మరంగా జరిగినది. కారణం ఆనాటి సాహిత్యవేత్తలు ద్రష్టలై, దర్శిలై ఎంతగానో ఆదరించారు. అంతటి ఆదరణ భాషా శాస్త్రం మీద లేకపోవడంవల్ల ఆ శాస్త్రం అభివృద్ధి చెందలేదు. సాహిత్యానికి శాస్త్రానికి అవినాభావ సంబంధమున్నది. సాహిత్యంలో శాస్త్రం నిగూఢంగా దాగి ఉంది. సాహిత్యవేత్త కావ్యాన్ని సాహిత్యపరంగా పరిశీలిస్తే విమర్శ, సాహితీ సంపద లభిస్తాయి. గాని అదే కావ్యాన్ని భాషా చరిత్ర దృష్టితో పరిశీలిస్తే ఆ కావ్య కథా కాలంనాటి భాషాసరళి, నాటి ప్రజల వ్యవహార సరళి, ఆ కావ్య పటిష్ఠత, కావ్యంలోని పూర్తి హంగులు తెలియజేయడానికి అవకాశమిస్తుంది.

భాషా చరిత్ర శాస్త్ర పరిశోధనలో నేడు కేవలం భాషమీద పరిశోధన మాత్రమే గాక, స్థలనామములు, వ్యక్తినామముల మీద కూడా పరిశోధన జరుగుతున్నది. వ్యక్తుల నామముల గురించి చేసే పరిశోధనను "ఆంత్రోపోనిమి" అనీ, స్థలనామములు లేదా గ్రామ నామముల గురించి చేసే పరిశోధనను "టోపోనిమి" అనీ అందురు.

ఒక వ్యక్తిని గుర్తించడానికి పేరు ఎలా అవసరమో, అదే విధంగా ఒక గ్రామాన్ని గుర్తించడానికి కూడా పేరు అవసరం. పుట్టినప్పుడు ఏ వ్యక్తి కూడా పేరుతో పుట్టడు. ఆ పుట్టిన వ్యక్తి నామకరణానికి అతడు నివసించే ప్రదేశం భౌగోళిక పరిస్థితి, తిథి, నక్షత్రం, జాతకం ఎలా అవసరమగుతున్నాయో, అదే విధంగా గ్రామానికి పేరును సూచించడానికి కూడ కుటుంబనామములు, వంశనామములు,

రాజవంశము, గ్రామదేవతల పేర్లు దోహదమవుతున్నాయి. అక్కడి చారిత్రిక పురుషుల, ఆయా ప్రాంతాలలోని సాంఘిక, మత రాజకీయ పరిస్థితులు, కూడా పరిగణన లోనికి తీసుకోబడి, గ్రామాలకు నామకరణ జరుగుతున్నది.

"ఒక పరిమితమైన ప్రాంతంలో నివసిస్తున్న ప్రజా సమూహం వారు నివసిస్తున్న ప్రదేశాన్ని గ్రామం లేదా పల్లె అందురు. వారి జీవనావసరాలు, జీవనాధారాలు,సాంఘికాచారాలు ఆనాడు గ్రామానికే పరిమితం. అయితే అన్ని గ్రామాలూ స్వయంపోషకములు కావు ఒకదానికొకటి పరస్పర సహకారం కావలసిఉండేది. మొదట్లో అన్నీ కూడ గ్రామాలే. జీవన పరిస్థితుల కనుగుణంగాఉన్న భౌగోళిక ప్రదేశాలలో మాత్రమే ప్రజాసమూహం పెరిగి పెరిగి అవియే నేటి పట్టణాలవుతున్నవి.

మానవ శాస్త్రజ్ఞులకు స్థలనామ పరిశోధన అత్యంత ప్రయోజనకారి. ప్రజలలోని విభిన్న వర్గాల సాంస్కృతిక వర్ణవ్యవస్థ, వలసల సాంద్రత, భాషాగత సరిహద్దులు మాత్రమేగాక తత్సంబంధాలను గురించి కూడా తెలియచేస్తున్నాయి. అంతేగాదు ఏయే ప్రదేశాలను ఏయే వంశాలవారు పరిపాలించారో, ఎవ్వరు దిగ్విజయయాత్రలు చేసి తమ సామ్రాజ్యపు ఎల్లలను పెంచారో ఈ పరిశోధన వల్ల తెలుస్తుంది.

గ్రామనామాలు జీవద్భాషా సామగ్రి. అవి భాషారూపాలు ఒక భాషా సమాజంలోని గ్రామనామాల చరిత్ర ఆ భాషాచరిత్రలో అంతర్భాగం కాబట్టి గ్రామనామాల శాస్త్రీయ పరిశీలనకు వర్ణనాత్మక, చారిత్రాత్మక, తులనాత్మక పద్ధతులు అవసరం. తప్పనిసరికూడా.

గ్రామనామ నిర్మాణ పరిశీలన వర్ణనాత్మక భాషా పరిశీలనకు చెందుతుంది. గ్రామనామాల ఉత్పత్తి పరిణామాలను. అవసరమైన చారిత్రిక రూపాలతో పోల్చిచూడవలసి వచ్చినపుడు. చారిత్రక పరిశీలనా పద్ధతి తప్పదు. ఒక భాషా ప్రాంతంలోని గ్రామనామాలలో కన్పించే మాండలిక భేదాలను సజాతీయ విజాతీయ రూపాలలోని లక్షణాలను పోల్చి చూడవలసి వచ్చినపుడు, తులనాత్మక పరిశీలనా విధానం అవసరమౌతున్నది. కాబట్టి గ్రామనామ పరిశీలన, సేకరణ వర్గీకరణ విధానం భాషా విజ్ఞానానికి చెందుతుంది.

స్థలనామ పరిశోధనకుగల బహుముఖ ప్రయోజనాన్ని భాషా శాస్త్రవేత్తలు, చరిత్రకారులు, పురాతత్వ శాస్త్రవేత్తలు మానవ శాస్త్రజ్ఞులు గుర్తించారు.

## విశేషాంశాలుగల గ్రామనామాలు

అచ్సంధులు కల గ్రామనామాలు :

| | | | | |
|---|---|---|---|---|
| అ + అ | = | దీప + అర్తి | = | దీపర్తి |
| అ + ఆ | = | తోక + ఆడ | = | తోకాడ |
| అ + ఆ | = | గాదర + ఆడ | = | గాదరాడ |
| అ + ఇ | = | కోర + ఇంగి | = | కోరంగి |
| ఇ + ఇ | = | చీడి + ఇగ | = | చీడిగ |
| ఉ + ఎ | = | ఆరు + ఏళ్లదార | = | ఆరేళ్లదార |
| ఉ + ఊ | = | చేపు + ఊరు | = | చేపూరు |
| ఆ + ఎ | = | అటికెవ + ఏణిపాలెము | = | అటికెవేణిపాలెము |

ద్విత్వలోపం కల పేర్లు :

అచ్చ + అమ్మ + పేట = అచ్చమ్మపేట, అచమపేట
అచ్చంపేట ఎల్లవరం తాలూకా

సుబ్బ + అమ్మ + పేట = సుబ్బమపేట
సుబ్బమ్మపేట పిఠాపురం తాలూకా
సుబ్బంపేట

బుచ్చ + అమ్మ + పేట = బుచ్చమపేట
బుచ్చమ్మపేట రాజమండ్రి తాలూకా
బుచ్చంపేట

ఏకవచనం :

శేఖ (వాని) పాలెము — తుని తాలూకా
సిద్ధ (వాని) పాలెం — ప్రత్తిపాడు తాలూకా

బహువచనం :

పాండవు (ల) పాలెము = పెద్దాపురం తాలూకా
సిద్ధ (వారి) పాలెము = పెద్దాపురం తాలూకా

ద్విత్వాక్షరం

హల్లు కింద అదే హల్లు ద్విత్వంగా ఉంటే దాన్ని ద్విత్వాక్షర మంటారు. ఇది బ్రాకెట్టుల మధ్యన చూపబడింది.

దామనప (ల్లె) క్రొ(త్త) వీధులు
గి(న్నె)ల ప(ల్లి) క(చ్చె)లవాడ రంప తాలూకా

ఔపవిభక్తికాలు :

ఇ.టి తి. అనే ప్రత్యయాలు చివర ఉన్న పదాలు ఔపవిభక్తికములు.

- ఇ - వేళంగి-దివిలి-మల్లేపల్లి-ర్యాలి
- టి - తాటిపర్తి - పుల్లేటికుర్రు
- తి - తిరుపతి - గుండ్రాతి

విభక్తి ప్రత్యయాలు : ప్రథమా విభక్తికి ప్రత్యేకమైన ప్రత్యయాలు లేవు. సాధరణంగా ద్వితియాదులకు మాత్రమే విభక్తి ప్రత్యయాలుంటాయి:

| | | |
|---|---|---|
| ప్రథమ | - డు - | మేడపాడు |
| | - ము - | పెద్దాపురము |
| | - వు - | దివాన్ చెఱువు |
| | - లు - | చేబ్రోలు |

ద్వితీయాదులు అంతగా కానరావు.

ద్రుతం : ద్రుతం చివర ఉండే పదాలు ద్రుతప్రకృతికములు.

పై (న) — కాకినాడ తాలూకా

ఎఱ్ఱదిక్లో (న) — అమలాపురం తాలూకా

టుగాగమం : కొన్ని గ్రామనామాలో టుగాగమం కనిపిస్తుంది.

బొద్దుటూరు

నేలటూరు

కుగాగమం : కొన్ని గ్రామనామాల్లో క్వాచిత్కంగా కుగాగము కనిపిస్తుంది

చెఱుకూరు — కందుకూరు

ఇందుకూరు — వేటికూరు

కురుకూరు

"-పు" ఆదేశం ; కొన్ని గ్రామనామాల్లో ముపర్ణానికి 'పు" ఆదేశంగా కనిపిస్తుంది.

భీమవరము + కోట = బీమవరపుకోట

రామరావము + పాడు = రామరావప్పాడు

కరము + గొండి = కరపుగొండి

పెద్దాపురము + పాడు — పెద్దాపురప్పాడు

వర్ణసమీకరణం : భిన్న హల్లులు ఒకదానికొకటి సమీకరణం పొందటం వర్ణ సమీకరణం. హల్లు కింద సజాతి హల్లు గాని, విజాతి హల్లు గాని ఉండవచ్చును.

భో(ర్న)గూడెము (భో(డ్ల)ంక

అ(గ్జు)వలోవ (దేవ(ర్తి)గూడెం

క్రియాజన్య విశేష్యాలు : నిత్య వ్యవహారంలో మనం చేసే పని క్రియ అంటాము. అటువంటు క్రియ అంతముందుగల పదములు క్రియా జనం విశేష్యాలు.

వంపు = వంచుట, వంకర అనే అర్థంలో
నందివంపు ... తుని తాలూకా

పారు = ప్రవహించుట
పారుపాక ... కాకినాడ తాలూకా

కుదురు = స్థిమితం - నిశ్చలము

కడకుదురు పెనుగుదురు

మొగలికుదురు కరకుదురు

మామిడికుదురు

అన్యదేశ్యాలు ; ద్రావిడ భాషా కుటంబానికి చెందిన తెలుగును. చారిత్రకంగా పరిశీలిస్తే ప్రాచీన దశలో తత్సమ తద్భవ పదజాలం ఎక్కువగా చేరినట్లు తెలుస్తున్నది. మహమ్మదీయుల పరిపాలన కాలంలో ఉర్దూ, అరబిక్, పర్షియన్ పదాలు, పోర్చుగీసు వారి కాలం పోర్చుగీసు పదాలు ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో ఆగ్లేయ పదాలు వాడుకలోనికి వచ్చాయి. ఆ ప్రభావం గ్రామనామాల మీద కూడా పడింది.

| | | |
|---|---|---|
| ఫకురుద్దీన్ పాలెము | ... | పిఠాపురం తాలూకా |
| నవాబుపేట | ... | ఆలమూరు తాలూకా |
| హాసనబాద | ... | రామచంద్రపురం తాలూకా |
| హుకుంపేట | ... | రాజమండ్రి తాలూకా |

| | | | |
|---|---|---|---|
| ఫోక్స్ పేట | ... | రంపచోడవరం | తాలూకా |
| నార్కోడ్ మిల్లి | .... | కొత్తపేట | ,, |

విశేషణాలు : విశేషాలకు ముందు మాత్రమే వచ్చే అస్వతంత్రి ప్రాథమిక విశేషణాలు. పరిమాణం, క్రియ, సంఖ్యావర్ణములు కూడా వీనిలో చేరతాయి.

| | | | | |
|---|---|---|---|---|
| నవ | — | నవఖండవాడ | పిఠాపురం | తాలూకా |
| పాత | — | పాతతుంగపాడు | రాజమండ్రి | ,, |
| నల్ల | — | నల్లగొండ | రాజమండ్రి | ,, |
| ఉప్పు | — | ఉప్పాడ | పిఠాపురం | ,, |
| బురద | ... | బురదకోట | ప్రత్తిపాడు | ,, |
| తాడి | ... | తాడితోట | ఎల్లవరం | ,, |

సంఖ్యావాచక విశేషణాలు : విశేష్యాలకు ముందు వచ్చే సంఖ్యా పూర్వకమైనవి.

| | | | | |
|---|---|---|---|---|
| ఒండు | - ఒండు + రేగుల | = ఒండ్రేగుల | ప్రత్తిపాడు | తాలూకా |
| మూండు | - మూండు + కొల్లు | = ముక్కొల్లు | పెద్దా॥ | ,, |
| మూండు | - మూండు + గుళ్ళ | = ముగ్గుళ్ళ | రాజ | ,, |
| ఆఱు | - ఆఱు + పేళ్ళదార | = ఆరేళ్ళదార | అమ॥ | ,, |
| నూఱు | - నూఱు + వ్రాడి | = నూఱ్వాడి | రంప॥ | ,, |
| కోటి | - కోటి + పల్లె | = కోటిపల్లె | రామ॥ | ,, |

వర్ణసూచకాలు : (వర్ణ విశేషణాలను తెలిపేవి)

| | | | | |
|---|---|---|---|---|
| ఎఱ్ఱ | - | ఎఱ్ఱమెట్లు | రంప॥ | తాలూకా |
| ఎఱ్ఱ | - | ఎఱ్ఱముసాలెము | రంప॥ | ,, |
| ఎఱ్ఱ | - | ఎఱ్ఱటికోన | రంప॥ | ,, |
| నల్ల | - | నల్లమిల్లి | పెద్దా॥ | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| నల్ల | - | నల్లగొండ | పెద్దా॥ | ,, |
| ఎల్ల | - | ఎల్లమిల్లి | పెద్దా॥ | ,, |

పరిణామ సూచకాలు :

| | | | | |
|---|---|---|---|---|
| పెద | - | పెదభీమపల్లె | రంప॥ | తాలూకా |
| పెద | - | పెదబ్రహ్మదేవము | కాకి॥ | ,, |
| పెద | - | పెదగెద్దాడ | రంప॥ | ,, |
| పెను | - | పెనుపల్లె | కాకి॥ | ,, |
| చిన | - | చినబ్రహ్మదేవము | కాకి॥ | ,, |
| చిన | - | చిన జగ్గంపేట | పెద్దా॥ | ,, |
| మెఱక | - | మెఱక చేమవరం | పత్తి॥ | ,, |

దిక్సూచకాలు : (దిక్కులను సూచించేవి)

తూర్పు - తిరుపతి రాజపాలెం (తూర్పు)
పడమర - తిరుపతి రాజుపాలెం (పడమర)
ఉత్తర - ఉత్తర కంచి
దిగువ - దిగువదారపల్లె
దిగువ - దిగువశిడ
ఎగువ - ఎగువదారపల్లె
నడవ - నడవపల్లె
వాలు - వాలుతిమ్మాపురం

భూమియొక్క స్వభావాన్ని, స్వరూపాన్ని తెలియజేసేవి కొన్ని.

ఇసుక - ఇసుకపాడు
రాళ్ళు - రాళ్ళఖండ్రిగ
ఉప్పు - ఉప్పాడ
దీవి - గుత్తెన దీవి

అనంతమైన జగత్తునంతా ప్రకృతి ఆవరించి ఉంది. ప్రకృతి తన రమణీయత్వం చేత మరింత శోభాయమానమవుతుంది. ప్రకృతి అంటే కేవలం రాళ్ళు రప్పలు మాత్రమే కాదు పశుపక్ష్యాదులు, వృక్ష జాలం, శీతోష్ణస్థితి, గాలి, నీరు, అన్నీ గూడ ప్రకృతిలో మిళితమయి ఉంటాయి.

వృక్షసూచకాలు : మానవ పరిసర ప్రాంతంలో ఒక రకపు వృక్ష జాలం ఒక ప్రాంతంలో అమితంగా పెరిగిఉండి ఉంటే, ఆ ప్రాంతంలో జనులు నివశిస్తున్నప్పుడు ఆ ప్రదేశానికి సంకేతంగా ఆ వృక్షజాల శబ్దం ఉపయోగించేవారు. ఆ తదుపరి కాలంలో ఆ వృక్షసంపద నశించిపోయినప్పటికినీ, ఆ పేరుతో పిలువబడుతూ ఉంటుంది.

| | | |
|---|---|---|
| బూరుగు | - | బూరుగుపాలెము |
| తుమ్మ | - | తుమ్మలపల్లె |
| చింత | - | చింతలగూడెము |
| మఱ్ఱి | - | మఱ్ఱివాడ |
| శృంగ | - | శృంగవృక్షము |
| తాటి | - | తాటిపర్తి |
| తోటకూర | - | తోటకూర పాలెము |

ఈ మండలంలో ముఖ్యంగా మన్య ప్రాంతంలో మామిడిపంట ప్రధానమైనది. రకరకాలైన మామిడులు ఆయా ప్రాంతాలలో పండించటం వలన ప్రసిద్ధి చెందిన మామిడి తోటల ప్రదేశాలకు చెందిన ప్రాంతాలను ఆయా మామిడితోనే పిలవడం వాడుక అయింది దీనిని బట్టి విశ్లేషణ చేస్తే ఆనాడు ఎన్ని రకముల మామిడి పండ్లున్నాయో తెలియుచున్నది.

బఱ్ఱె మామిడి, ఆకు మామిడి, బంద మామిడి, మంజు మామిడి, పంచిరి మామిడి, తూరు మామిడి, పీర్ల మామిడి.

జంతుసూచకాలు : జంతువుల నివాసం, అవి పెరిగిన తీరును బట్టి కూడా గ్రామనామాలు ఏర్పడ్డం జరిగింది.

డేగల కోట, నక్కలపాడు, గుర్రంపాలెం. చిలకవీధి, ఏనుగుపల్లె, కాకినాడ, మొసలపల్లె, నాగవరము, సర్పవరము, తొండవరము హంసవరము, పులిమేరు, పాముగండి, గొర్రిపూడి.

ఆహారసూచకాలు : పండించే పంటల విస్తీర్ణాన్నిబట్టి కూడా గ్రామనామాలు ఏర్పడ్డాయి.

ధాన్యముపాలెము, పనసలపాలెము, తోటకూరపాలెము, బెండపూడి, కాకరపల్లె, దోసకాయలపల్లె, ఉల్లిగోగుల, పాలగడ్డ, కందులపాలెము, నిమ్మలపాలెము, ద్రాక్షారామ, వంగలపూడి, జొన్నాడ.

జలసూచకాలు : నీటి వాలునుబట్టి ఆవుంటున్న స్వభావమును బట్టి ఏర్పడిన గ్రామాలు :

ఆరేళ్ళదార బాపనదార, శృంగదార, ఏలేరు, గుమ్మిలేరు, చింతబాయి, ఈలకొలను, ఏరుపల్లె, చెరువుపాలెము.

ఈ మండలంలో గోదావరి వివిధ పాయలుగా చీలి ప్రవహించటం చేత ఆ నీటిపాయల మధ్య ఉన్న భూమి సారవంతమయింది. నదీ పరీవాహక ప్రాంతం వలన కొంత ప్రదేశంలో చుట్టూ నీరు ప్రవహిస్తూ ఉంటుంది. ఇటువంటి ప్రదేశాన్ని లంక లేదా దీవి అందురు. ఇటువంటి లంకలు ఈ మండలంలో చాలా ఉన్నాయి. వాటికి వ్యక్తిపరంగా, దైవపరంగా పశుపక్ష్యాదుల పరంగా పేర్లు ఏర్పడ్డాయి.

అప్పన్నరాముని లంక, రామరాజులంక, గుడిమెల్లంక, బతుకుదురులంక, మొండెపులంక, పసర్లపూడి లంక, కేశనకుర్రు లంక, కొత్తలంక, పుతర్లంక, ఎదుర్లంక. రాజోలంక.

**ఆభరణ సూచకాలు :** ( నిత్యకృత్యాలలో ధరించే ఆభరణాలను సూచించే పేర్లు ).

బిళ్ళనందూరు, రాళ్ళకండ్రిగ, కడియము, నాగవరము, వజ్రకుటం.

**కులవృత్తి సూచకాలు :** అనాదిగా వస్తున్న కులవ్యవస్థ ఆధారంగా గ్రామనామాలు సూచించడం జరిగింది. ఎక్కువ ప్రజలు ఒకే వృత్తి చేస్తూ ఉంటే, వారు అంతా ఒకే-చోట నివశిస్తున్నట్లయితే వారు చేస్తున్న వృత్తిపరంగా ఆ గ్రామానికి పేరు సూచన చేసేవారు.

| | | |
|---|---|---|
| గొల్ల - | గొల్లప్రోలు | పిఠా ॥ తాలుకా |
| గొల్ల - | గొల్లలగుంట | పెద్దా ॥ తాలుకా |
| ఉప్పర - | ఉప్పరపాడు | పెద్దా ॥ తాలుకా |
| ఉప్పర - | ఉప్పరపాలెం | పెద్దా ॥ తాలుకా |
| గొల్ల - | గొల్లపాలెం | పెద్దా ॥ తాలుకా |
| దేవాంగ - | దేవాంగవీధి | పెద్దా ॥ తాలుకా |

**వ్యక్తినామ సూచకాలు :** అనాది నుండి మనదేశంలో వర్ణవ్యవస్థ బాగా వేళ్లూనికొని ఉంది. ఆ వర్ణవ్యవస్థవల్ల బలవంతుడయిన. అధికారంలో ఉన్నవ్యక్తి పేరన ఆ గ్రామనామాలు ఏర్పడటానికి అవకాశం ఏర్పడింది. అంతేగాదు మహారాజులు గాని, జమిందారులు గాని దానాలు చేసినపుడు ఆ దాత / గృహీతల పేరన గూడా కొన్ని గ్రామనామాలు ఏర్పడ్డాయి.

| | | |
|---|---|---|
| బలరాంపురం | - రాయభూపాలపట్నము | పెద్దా॥ తాలుకా |
| వేంకటరాయపురం | - మాధవపట్నము | కాకి ॥ తాలుకా |
| భూపతిపాలెము | - కేశవదాసుపాలెము | కాకి ॥ తాలుకా |

బుచ్చమ్మపేట - దామిరెడ్డిపాలెము కాకి॥ తాలుకా
ఫకురుద్దీన్‌పాలెము - కోటివారి పల్లి పిఠా॥ తాలుకా

కుటుంబనామ సూచకాలు : వర్ణవ్యవస్థ పరంగానే కాకుండా బలవంతమయిన కుటుంబనామాల పరంగాను గ్రామనామాలు ఏర్పడినాయి ప్రత్తిపాడు తాలూకాలో - సిద్ధివారిపాలెము, తుమ్మలపల్లె, చింతలగూడెము, జగన్నాయకుల పాలెము, వేముఃపాలెము, గొల్లలగుంట, పిఠాపురం తాలూకాలోని కోటివారిపల్లి.

వంశనామ సూచకాలు : ఈ మండలంలో ప్రఖ్యాతిగాంచిన రాజవంశీయులు - పెద్దాపురంలో ఉన్న వత్సవాయి వంశంవారు పిఠాపురం మహారాజులు "రావు" వంశీయులు. ఈ వంశీయులలో ప్రముఖ వ్యక్తుల దాతృత్వం మీద కొన్ని గ్రామాలు వెలిశాయి. అలాగ వెలసిన గ్రామాలు ఆయా వంశీయుల వ్యక్తుల పేర్లమీద ఏర్పడ్డాయి.
వత్సవాయి బలభద్రజగపతి పేరన : బలభద్రపురం, పెద్దాపురం తాలుకా.

వత్సవాయి రాయజగపతి పేరన : పెద్దాపురం తాలూకాలోని రాయభూపాలపట్నం, భూపాలపట్నము, భూపతిపాలెము.

వత్సవాయి చతుర్భుజ తిమ్మజగపతి పేరన: పెద్దాపురం తాలుకాలోని తిరుపతిరాజుపేట, తిమ్మరాజుచెరువు.

అంతేగాక ఆ రాజుల పట్టమహిషులు కొందరు, మహారాజుల తర్వాత రాజ్యపాలన చేసినారు. ఆయా పట్టమహిషుల పేర్లన గ్రామలు వెలసినవి.

వత్సవాయరాయజగపతి పట్టమహిషి బుచ్చిసీతయ్యమ్మ పేరన పెద్దాపురం తాలూకాలోని సీతమ్మపేట, బుచ్చిసీతయ్యమ్మసత్రము.

ద్వితీయ భార్య లక్ష్మీనరసాంబ పేరన పెద్దాపురం తాలూకా లోని లక్ష్మీనరసాపురం.

దైవ సూచకాలు : మతపరంగానే గాకండా, దైవముల మీద అపారమైన శక్తి ఉన్నందువల్ల కూడా గ్రామనామములు వెలసినవి.

శైవమతసూచకాలు : విశ్వేశ్వరాయపురం, శివకోడు, శంకరగుప్తము సర్వవరము, రామేశ్వరము, నాగవరము.

వైష్ణవమతసూచకాలు : రామకృష్ణపురం, వెంకటకృష్ణరాయపురము, కృష్ణపురము, జగన్నాథపురము, సీతానగరము, కేశవరము.

సాధారణముగా ఒక ప్రాంతంలో స్థిరపడిన ప్రజాసమూహానికి జీవన పరిస్థితులు అనుకూలంగా ఉండే అ ప్రాంతంలో మరింత ప్రజా-సమూహం స్థిరనివాసం కోసం ప్రయత్నిస్తుంటారు. ఆ ప్రయత్నంలో, ఆ గ్రామం విస్తరించటంగాని, శివార్లలో మరికొ్రత్త గ్రామం ఏర్పడటంగాని జరుగుతుంది. ఈ విధంగా వెలసిన గ్రామాలను దిక్కులపరంగా గాని, లేదా పాత, కొత్త అనే మాటలు చేర్చినగాని పిలవటం జరుగుతుంది.

పెద్దాపురం, పాతపెద్దాపురం, ఎగువదారపల్లె, దిగువదారపల్లె, లక్ష్మీపురం, తూర్పులక్ష్మీపురం (పెద్దాపురం తాలూకా).

సాధారణంగా ఒక ప్రాంతంలో ఉన్నటువంటి గ్రామనామం మరొక ప్రాంతంలో కూడ అదే నామంతో కనిపిస్తుంది ఇది అదే తాలూకాలోను, లేదా అదే జిల్లాలోను ఉండవచ్చు. ఇలాగ కేవలం ఒక్కటేకాదు అనేకములుండవచ్చును. లేదా చిన్న చిన్న మార్పుల తో కూడా ఉండవచ్చు. దీనినే "స్థలనామ సమాన రూపము" లేదా "సరూపనామాలు" అంటారు. దీనినే ఇంగ్లీషులో డూప్లికేషన్ ఆఫ్

ప్లేస్ నేమ్స్ అంటారు. ఇట్టి స్వరూపనామాలు గోదావరి మండలంలో అనేకం కనిపిస్తాయి.

భీమవరము - ఎల్ల ॥ తాలుకా, కాకినాడు తాలుకా.
భలభద్రపురం - రామ ॥ తాలుకా, పెద్దా ॥ తాలుకా, కాకి॥ తాలుకా
సీతానగరం - రాజ ॥ తాలుకా పెద్దా ॥ తాలుకా, పిఠా ॥ తాలుకా
కేశవరము - ఎల్ల ॥ తాలుకా, రాజ ॥ తాలుకా.
కందులపాలెము - కాకి॥ తాలుకా, రామ॥ తాలుకా పెద్దా తాలుకా.

అధికారంగా ఒక స్థలానికి ఒక పేరున్నప్పటికీ జనవ్యవహారంలో గాని, వాడుకలోగాని, దానికి మరోపేరు వ్యవహరించ బడుతుంది. దీనికి కారణం ఆదికాలంలో ఉంచబడినపేరు నవీన కాలంలో దాని అర్థంలో అర్థచ్యుతి కలిగి అపహాస్యంగా ఉండడంగానీ లేదా, సాంఘిక రాజకీయోద్యమాల ప్రభావంగానీ అయియుండవచ్చు.

ఉదాహరణకి రంపచోడవరం తాలుకాలోని లంజవాడ అన్న గ్రామాన్ని 'గాంధీనగరము' అని పిలుస్తున్నారు. ఆదికాలంలో 'లంజ' పదానికి లక్ష్మీ, శుభప్రదమైన స్త్రీలు నివశించే చోటు అనే అర్థం స్ఫురించింది. దీనికి మహాకవుల ప్రయోగాలు కూడ ఉన్నవి. ఆ పదం అర్థం అర్థచ్యుతి చెంది నిందాపూర్వకమైన పదంగా మారినందున నేడు రాజకీయోద్యమ ప్రభావంతో దానిని గాంధీనగరం అని పిలుస్తున్నారు.

అలాగే ఆలమూరు తాలూకాలోని వేములపల్లె 'సీతయ్యపాలెం' గా నేడు జనవ్యవహారంలో ఉంది.

గ్రామనామ సముదాయం రెండు లేక అంతకంటె ఎక్కువ పదాల కూడికగా ఉంటుంది. అట్లాగ కూడిఉన్న పదాల అర్థ లేక

భావ గాంభీర్యం కలిసి గ్రామనామం ఏర్పడుతున్నది. అందులో తొలిపదాన్ని పూర్వభాగం PREFIX అనీ, మలి పదాన్ని ఉత్తర భాగం SUFFIX అనీ అంటారు.

ఉదా : పెద్దాపురం. ఇందులో పూర్వభాగం 'పెద్ద' ఉత్తర భాగం 'పురం'. పురము అంటే పట్టణం. అధిక జనాభా గలిగియున్న ప్రదేశం లేదా వైశాల్యంలో పెద్దగాయున్న ప్రదేశం. దీనికి పూర్వ భాగం పెద్ద. పెద్ద అంటే పెద్దది అని అర్థం. అంటే అంతకంటె పూర్వం చిన్నదిగా ఉండి తదుపరి ఎక్కువ పరిమాణం కలిగి ఉన్నదానిని పెద్ద అని అందురు అప్పుడు పెద్ద అన్నపదానికి పురము అన్నపదం చేర్చి పెద్దాపురం ఏర్పడింది. అంతకంటే పూర్వం ఉన్న చిన్నాపురమును మించి ఉన్న గ్రామం కాబట్టి తదుపరి ఏర్పడిన గ్రామానికి పెద్దాపురం అని నామమేర్పడింది. ఇందు పెద్ద పురము. అంతేగాదు పెద్దాపురము పట్టణం ఏర్పడటానికి రాజవంశంవారు ఒకకారణంగా, పెద్దాపాత్రుడు అనే వ్యక్తి ఒక కారణంగా చెప్పుతున్నారు. అది పరిశోధన చేయ వలసిన అంశం.

గ్రామనామాలలో పూర్వ, ఉత్తర భాగాలు కేవలం నీటివన రులు, పర్వతములు, ప్రదేశములు, మతము, ఆధారంగా కూడా, ఏర్పడినాయి. వాటిని సంగ్రహంగా ఈ దిగువన ఉదహరిస్తున్నాను.

నీటివనరులు : చెలమ, చెఱువు, అంబుధి, సముద్రము, తటాకము దోన, ఏఱు. గడ్డి, గుంట, కాల్వ, కొలను. నూయి, మడుగు, రేవు, ఊట, వాగు ఇత్యాదులు జలవనరులకు సంబంధించినవి. ఈ పదములు ఉత్తరభాగములోగల పదములు. నామములు గ్రామనామములుగా మనకు కనబడుతున్నవి.

ఆయా నీటివసరులు ఆయా ప్రదేశము లందున్నందువలన, ఆయా గ్రామములకు పేర్లు ఏర్పడినాయి. ఇవి చారిత్రిక సత్యములు గూడాను.

చెలమ - కొండచెలమ చెఱువు - తిమ్మరాచెరువు. అంబుధి-పద్మాంబుధి, నాగాంబుధి. సముద్రము-కెన్న సముద్రము. తటాకము-చెన్నాటకము, దోన - కోనదొన, ఏరు-దంగేఱు, పేకేఱు, కొల్లేరు. కాలేరు, పాములేఱు, పులిమేరు, గడ్డ-కమిలిగడ్డ, అల్లూరిగడ్డ, భీములిగడ్డ, బారుగడ్డ, జాజిగడ్డ, రొల్లిగడ్డ. గుంట-గొల్లగుంట దొడ్డిగుంట, తేటగుంట. కాల్వ-శివకోడుకాల్వ. కొలను-ఇళ్ళకొలను. నూయి-తాడునూయి, మడుగు-తుంగమాడుగులు, వంగలమడుగు. వాగు-దొంతవాగు, దార-ఆరేళ్ళదార, బాపన్నదార, శృంగదార, రేవు- అటికరేవుల.

ఇతరాలు : అవని-అవగాని, గుడి-జగన్నాథగుడి ఖండి-ఖండిగ్రి రాళ్ళఖండిక, నవఖండ్రవాడ, పశ్చిమఖండిగ్రి, కుదురు-కరకుదురు, పెనుగుదురు, కొంకుదురు, నాడు-జనాడు, పర్రు-మల్లంపర్రు, పెంట-పాచిపెంట, పెంటకోట, పురము-పెద్దాపురము, సిరిపురము, బలభద్రపురము. పిఠాపురము, పీష్టపురము. వాడ-వేములవాడ నవఖండ్రవాడ, గుడివాడ, కానివాడ, సిరివాడ. వీధి-దేవాంగవీధి, పందిరివీధి వెలగవీధి, చిలకవీధి (ఇవి గ్రామములపేర్లు). ఊరు-వడ్లమూరు, కట్టమూరు, ఆనూరు, బంద-వెలుగుబంద. గిరి-జన్నాథగిరి కొమరగిరి, అనంతగిరి, వేమగిరి. గుండ్ల-గుండ్లకమ్మ, కొనరి - పశ్చిమకొనరి, కొండ-తంటికొండ, సూదికొండ కోరుకొండ, దారకొండ. మెట్ట-సిడసనమెట్ట, రాయి-లాగరాయి, తాడురాయి, డొంకరాయి, బాపరాయి. తిప్ప-వాకతిప్ప, దీవి-గుత్తినదీవి. పాక-లంకపాకలు, తూర్పు

పాకలు, పందలపాక, భీముడుపాకలు, కొత్తపాకలు. లంక-లంకపాకలు. రామరాజులంక, గుడిలంక, తుమ్మలంక. ఆరామము-ద్రాక్షారామము, భావారామము. నగరము-రాజానగరము, సీతానగరము. పట్టణము-రాయభూపాలపట్టణము, సంత-పశువుల సంత (గ్రామము పేరు). చేడు-కారంచేడు, పాడు-బల్లిపాడు. విన్నపాడు, గుమ్మి-పాలగుమ్మి.

ఇతరాలు : వర్గీకరణంగా ఉన్నటువంటి పదాలు (SUFFIX) గ్రామ నామాలు కూడా ఈ దిగువన ఇవ్వబడ్డాయి.

ఆరామము : ద్రాక్షారామము, భావారము జెడ్, భావారము జి.

కొండ : పెదకొండ, బాలకొండ, వేములకొండ, నెల్లికొండ, కోరుకొండ, తంటికొండ, సూదికొండ.

కోన : తాడికోన, పెంటికోన, కొన.

కుదురు ; మామిడికుదురు, కపకుదురు, పెనుగుదురు, మొగలికుదురు, కొంకుదురు, నడకుదురు.

ఆడ : మామిడాడ, దోమాడ, పెద్దాడ, కంచరాడ, ఇల్లిందాడ.

గిరి : జగన్నాధగిరి, కొమరగిరి, అనంతగిరి, వేమగిరి.

గొండి : బొద్దగొండి, కల్లెపుగొండి.

గుండము : రామగుండము.

మిల్లి : కోరుమిల్లి, యల్లమిల్లి, ఉప్పుమిల్లి.

విల్లి : పెదగాడవిల్లి, చినగాడవిల్లి, సన్నవిల్లి, గొల్లవిల్లి, విలసవిల్లి.

పల్లి : కందులపల్లి, కొత్తపల్లి, నాగులాపల్లి, ఇసుకపల్లి, కోటిపల్లి, రాచపల్లి. దేవరాపల్లి.

మండ : కాతిమండ, ఇరుసుమండ, పొన్నమండ.

లంక : అప్పన్నరాముని లంక, పసర్లపూడి లంక, మొండెపు లంక, ఊబలంక, బండారులంక, తూరుపులంక.

పూడి : ద్వారపూడి, మేడపూడి, నరసపూడి, సంధిపూడి. కత్తిపూడి, రాతులపూడి.

కుట్టు : గాగులకుట్టు, పుల్లేటికుట్టు, సోమనాథ్ కుట్టు.

వలస : ఎంగవలస. అద్దరి వలస, కుంకురువలస, గోవువలస.

రాయి : డొంకరాయి, ఒంకరాయి, దాకరాయి, లాగరాయి, తాడురాయి.

పురము : సిరిపురము, తిమ్మాపురము, పెద్దాపురము, కుమారపురము, జగన్నాథపురము.

వరము : సర్పవరరం, వామవరము, హంసవరము.

కోట : కాండ్రకోట, భీమవరపుకోట, తంగేడుకోట, శృంగవరపుకోట, కశింకోట, పాతకోట, గండికోట.

పేట : రమణయ్యపేట, సీతయ్యపేట. పాపమ్మపేట, గవరమ్మపేట, అచ్చంపేట, లక్ష్మీదేవి పేట, కృష్ణదేవి పేట.

పాలెము : శృంగరాయపాలెము, రాజుపాలెము, కొత్త పాలెము, తోటకూరపాలెము, రామన్నపాలెము, బుచ్చిరెడ్డిపాలెము, కొండపాలెము.

ఊరు : ఆలమూరు, చింతలూరు, నేలటూరు, నల్లూరు, నడ్లమూరు నెల్లూరు.

గూడెము : బంకలగూడెము, మద్దిరాతిగూడెము, ములగలగూడెము కొత్తగూడెము, దేవరాపల్లిగూడెము.

వాడ : వేములవాడ, కొవ్వాడ, కందరాడ, ఇల్లిందాడ్రిడ, విరవాడ, గోకివాడ, నవఖండ్రివాడ, ఉప్పాడ, గుడివాడ, సిరివాడ.

ఇవిగాక ఇంకా అనేకమైనటువంటి చారిత్రిక సాంఘిక, సాంస్కృతిక, రాజకీయాంశాలు కూడా ఎన్నో ఉన్నవి. అంతేకాదు ఈ జిల్లాలో ఎన్నో ప్రాచీన శాసనాలు లభ్యమవుతున్నాయి. వాటి ఆధారంగా గ్రామనామాల చారిత్రిక విశేషాంశాలు సమగ్రంగా పరిశీలించి గ్రామనామ నిఘంటువును తయారు చేయవలసిన అవసరం ఉంది. జాతి పునర్జీవనం పొందుతున్నట్లే గ్రామముకూడ పునర్జీవనము పొందుతున్నది. కాని నాటి చరిత్ర పునర్జీవనము పొందుట లేదు. కారణం సాహిత్యవేత్తలు నిరాదరణ చేయుటయే. అందువల్ల ప్రతి గ్రామాన్ని భాషాపరంగా, చారిత్రికంగా, సాంఘిక, సాంస్కృతిక పరంగా పరిశోధించి భవిష్యత్తరాలవారికి అందించవలసిన బాధ్యత ఈనాటి పరిశోధకులది, ఫలితం భావితరాలవారిది.



# గ్రామనామములు ద్వితీయావయవములు

గ్రామ నామములు జీవద్భాషా సామగ్రి. అవి భాషా బహు రూపాలు. భాషా చరిత్ర విషయంలో గ్రామనామాల ప్రాధాన్యాన్ని భాషావేత్తలు గుర్తించినారు. ఒక భాషా సమాజంలో గ్రామనామాల చరిత్ర విశ్లేషణ, భాషా చరిత్రలో అంతర్భాగమే కాబట్టి ఒక భాషా సమాజంలోని స్థలనామ పరిశోధన ఆ సమాజపు భాషా చారిత్రిక, సాంస్కృతిక విశేషాలను తెలియజేయుచున్నది. స్థలనామములు గూడ జీవద్భాషయందలి పదజాలమే అయిన వాటికి గూడా ఒక విశిష్టమైన ప్రయోజన మున్నది. స్థలనామ పరిశోధనకు గల ప్రయోజనమును భాషావేత్తలు, శాస్త్రవేత్తలు, చరిత్రకారులు, పురాతత్త్వ శాస్త్రవేత్తలు మానవశాస్త్రజ్ఞులు గుర్తించినారు.

స్థలనామములు భాషకు చెందిన పదజాలములు. భాషా శాస్త్రజ్ఞులు స్థలనామేతర పదజాలమును భాషా దృష్టితో ఏవిధముగా పరిశీలించెదరో ఆదేవిధముగా స్థలనామములనుగూడా పరిశీలించవలయును. అట్లు పరిశీలించిన, భాషా వికాసమును. సజాతీయ విజాతీయ భాషలతో కూడిన సంబంధమును, అన్య భాషా ప్రభావమును, మాండలిక భాషా లక్షణములు మొదలగు వాటిని తెలియజేయుటకు అవకాశముండును, అపుడు గ్రామనామ పరిశోధనలో వర్ణనాత్మక, చారిత్రాత్మక, తుల నాత్మక పద్ధతులద్వారా పరిశీలించే అవకాశముండును, 19వ శతాబ్దము ఆరంభమున పాశ్చాత్యసాహితీ సంపర్కము వలన పాశ్చాత్య విజ్ఞాన దృక్పథాలు భారతదేశంలో ప్రచారమునకు వచ్చిన తరువాత స్థలనామ పరిశోధన ప్రారంభమైనది. అయితే ప్రాచీన భారతీయ నైఘంటిక

వైయాకరణులు స్థలనామములు భాషా సమిష్టిలో భాగములుగా గుర్తించినారు. కాత్యాయన, పాణి, పతంజలులు స్థలనామ వివరణలను తమ తమ గ్రంథములయందు ఇచ్చియున్నారు. స్థలనామ పరిశోధనకు శ్రీకారము చుట్టినవారు పాశ్చాత్యులే అయినప్పటికిని పూనా కళాశాలకు చెందిన HD sankaalia ప్రప్రథమంగా పరిశోధనా గ్రంథమును ప్రచురించినారు. తరువాత వారు అనుసరించిన ఆ మార్గముననే అనేకమంది పరిశోధనలు చేసి సిద్ధాంత వ్యాసములను ప్రచురించిరి. ఈ రంగమున పరిశోధన మరింత ముందుకు సాగుచున్న తరుణమున దాక్షిణాత్య భాషలైన తమిళము, మళయాళము, కన్నడ రంగముల యందు మాత్రమేగాక తెలుగు నందును గూడ స్థలనామ పరిశోధన విశేషముగా సాగినది. తమిళరంగమున Sethu Pillai, Nachimuthu కన్నడమున Hiremath, మళయాళమున menon మొదలగు వారు ప్రముఖులుగా మనము చెప్పుకోవచ్చును.

తెలుగు గ్రామనామ పరిశోధనకు గల ప్రాధాన్యతను గుర్తించిన చిలుకూరి నారాయణరావుగారు, బూదరాజు రాధాకృష్ణగారు, కేతు విశ్వనాథరెడ్డిగారు, వై. బాలగంగాధరరావుగారు, మరియు ఎస్. ఎస్. శ్రీరామచంద్రమూర్తిగారు అనేకమంది పరిశోధకులు వివిధ విశ్వవిద్యాలయముల యందు పరిశోధనలు చేసి తమతమ సిద్ధాంత గ్రంథములను సమర్పించియున్నారు.

గ్రామ నామ పరిశీలన భాషా చరిత్రకు సంబంధించినదని తెలుసుకున్నాము, అపుడు గ్రామనామ, పద నిర్మాణములో రెండు లేక అంతకంటే ఎక్కువ పదముల కలయిక వలన గ్రామనామము ఏర్పడుచున్నది. అవి పూర్వభాగము (Prefixces) (Suffixces) అందురు. వీటినే ప్రథమావయవములు, ద్వితీయావయవములు అందురు. ఈ ద్వితీయావయములు గ్రామనామములయందు విధిగానుండును. వీటికి

కొంత ప్రత్యేకత కల్గియున్నది. వాటిని గురించి కొంత వివరణ ఇవ్వడమే ఈ వ్యాసోద్దేశ్యము. అందులకు తూర్పు గోదావరిజిల్లా నందలి గ్రామనామములను పరిగణన లోనికి తీసుకొనుట జరిగినది.

ద్వితీయావయపములు ఆ యా నైసర్గిక, భౌగోళిక, సాంఘిక, వలస సాంద్రత, పశుపత్యాదులు మొదలగు అంశములను ఆధారములను పరిగణనలోనికి తీసుకొని గ్రామనామములు ఏర్పడుటకు అవకాశములు ఏర్పడుచున్నవి. ముఖ్యముగా పర్వతములు, నీటివసరులు, ఉనికి నివాసము, భూసంబంధమైనవి, వ్యాపార సంబంధమైనవి మొదలగునవి ఎక్కువగా కనబడుచున్నవి. ద్వితీయావయవములను కొన్ని విభాగములుగ విభజించి వ్యాసము చివరన పట్టికగ చూపబడినవి. వాటికి ఈ దిగువ నుదహరించిన ఉదాహరణలను చూడుము

1. <u>ఉనికి నివాసమునకు చెందిన ద్వితీయావయవములు :</u>

అవని, అని, చేరి, గ్రామ, గుడి, ఖండి, ఖండ్రిక కుదురు, నాదు, నాడు, పాడి, కుట్టు, పట్టు. పట్టె, పెంట, పూండి, పుర, పురము, ఊరు, వాడు.

2. <u>నీటివసతులకు చెందినవి :</u>

చెలమ, చెఱువు, అంబుధి, సముద్రము, తటాకము, దోన, ఏఱు, గడ్డ, గుండము, గుంట, కాల్వ, కొలను, నూయి, రేవు, ఊట, వాగు, వాయ, బాయలు,

3. <u>పర్వతములు, కొండలకు చెందినవి :</u>

బండ, గిరి, శైల, గుండ్ల, కొనప్ర, కొండ మేడు, మెట్ట, మిట్ట, మిట్టు, రాయి, తిప్ప.

4. వ్యాపార సంబంధమైనవి ;

అంగడి, నగరము, పట్టణమ్, మంగళమ్

5. భూసంబధమైనవి :

చేను, పఱ్ఱ, పాడు, గుట్ట,

6. ఇతర వర్ణములకు చెందినవి ;

అగ్రిహారము, దోవ, త్రోవ, దుర్గము, కోట, గట్టు, మడక పొదురు, పొలము, పుంత.

ఇందుపైన చూపబడిన ద్వితీయావయవములు కొన్ని సంస్కృతమునకు, సంబంధించినవి కాగా కొన్ని ద్రావిడ భాషకు సంబంధించినవి ఉన్నవి. ఇంతకు పూర్వము రెండు పదముల కలయికవలన ఏర్పడినవి అని తెలియజేసినాను. కాని రెండు పదముల కంటే ఎక్కువ పదములతో కూడిన గ్రామనామములు కూడా మనకు కనపడుచున్నవి.

ఉదా: తూర్పులక్ష్మీపురమ్ వేంకటకృష్ణరాయపురం. మరికొన్ని గ్రామనామములు ఆదికాలమున చేర్చబడినవి. తరువాత నూత్నత్వము కోసము మరికొన్ని పదములు కూడిగాని లేదా క్రొత్తపదములతో గాని చేర్చబడియుండును. మరికొన్ని రాజకీయోద్యమ సంఘటన వలన ఏర్పరచుకున్నవి. ఉదా: లంజవాడ కాలక్రమేణాగాంధీ నగరముగ మారినది. బౌద్ధ, జైన మతముల ప్రభావము వలన అరామము, పల్లి, విల్లి, పాడు మొదలగునవి వచ్చి యున్నవి. పాలెము అన్న ద్వితీయావము శాసన రూపమున 13వ శతాబ్దము నుండి గూడ మనకు కనపడు చున్నది. ఇది మిలటరీ కాలమున సైనికులు తాత్కాలికముగా నివసించు ప్రదేశమును పాలెము అని పిలిచినారు. పాలెము అన్న పదము గురజాడ అప్పారావుగారు తమ కన్యాశుల్కము నాటకమున

రామప్ప పంతులుగారు "పాలెము వెళ్ళి భజంత్రీలను పిలవండి" అని చెబుతాడు. అంటే ఊరి చివరన నివశించెడి ప్రదేశము, శివారు బయలు ప్రదేశము అని అర్థము మనకు స్ఫురించుచున్నది.

గ్రామనామముల యందున్నటువంటి ద్వితీయావయవములు కొన్ని సంస్కృత ప్రభావము గల్గియున్నటువంటి పురము, పట్టణమ్ నగరము నగరి, అగ్రహారము మొదలగునవి.

అనంతమైన ప్రకృతి సహజ సుందరముగ అంతట ఆవరించి యున్నది. అందు సుందరతర పుష్పజాలమునుండి మహావృక్షముల వరకు ఆవరించియున్నది. ఆయా వృక్షముల ఆవరించియున్న ప్రదేశముగాని లేదా అంతకు పూర్వము అక్కడ నివసించిన మెలగిన జంతు జాలము వలన గూడ గ్రామములకు నామకరణము జరిగినది. గ్రామ నామముల ద్వితీయావయవములలో చెట్లపేర్లు లతలు, తీగలు పుష్పములతో గూడినవి అనేక మున్నవి.

విభిన్నజాతుల కలయిక వలన సమాజము నాగరికత సంస్కృతి ఏర్పడినవి. కులము, మతము సూచకాలుగల గ్రామములు సమాజంలో గోచరించుచున్నవి.

ఉదా: ఎరకల గూడెము,

కులము పేర్లతో గూడిన ద్వితీయవయవములు కొన్ని ఉన్నవి.

ఉదా : దేవాంగవీధి (గ్రామముపేరు)

కులవ్యవస్థను, జాతిని గూడ సూచించేవి వున్నవి.

ఉదా : నాయుడు, భట్టు, రాజు, కాపు, రెడ్డి, శాస్త్రి, శెట్టి, సోమయాజి మొదలగునవి.

మహమ్మదీయులు కూడా ఈ ప్రాంతమును పరిపాలించినందువల్లన వారి ప్రభావముతో గ్రామ నామములు ఏర్పడినవి. అట్లే ఆంగ్లేయులతో కూడినవి కూడా నున్నవి.

ఉదా : ఘోర్కున్నపేట, నార్కోడ్ పల్లి, హాసన్ బాద

దేశచరిత్ర, పాలకుల జీవితములను బట్టి రచించుట ఆచారమైనది. కాని గ్రామనామములను బట్టి చూచినచో పాలకులు గాకుండా జనులలో పేరు పెంపులు గల్గియుండిన మహనీయులు ఎందరో ఉండిరనియు, పాలకులతో పేరుపెట్టిన నామములు కూడ గ్రామ నామములుగా నిలిచిపోయినవి. ఇందు పురుషులు మాత్రమే గాక, స్త్రీలకు కూడ కీర్తి వచ్చినది.

ఉదా : రాయభూపాలపట్నమ్, లక్ష్మీశ్వరసాపురము, బలభద్రపురము, జగపతినగరము.

సంస్కృత భాషాప్రభావము గ్రామనామాల విషయంలో గణనీయంగా లేకపోయినా, తగు మాత్రము ఉంది. గ్రామనామములయందు తత్సమ తద్భవ పదజాలము ఈవిషయమున ఋజువు చేయబడుచున్నది సంస్కృత ప్రభావము కేవలము ఒక్క తెలుగు భాషయందే గాక తక్కిన ద్రావిడ భాషల యందును కూడియున్నది.

ఉదా శ్రీ పురుషోత్తమపట్టణమ్, శ్రీ సర్పవరము

ఒక సంస్కృతి మీద అన్యసంస్కృతి తమ ప్రభావమును తప్పకుండా చూపును. చాలా దేశములయందు ఒకేజాతి, ఒకేభాషా ఒకేసంస్కృతి యుండదు. భిన్నజాతుల సంపర్కము, భిన్నభాషల ప్రభావము కన్పించును. అన్యజాతుల, అన్యభాషీయుల దాడిగాని వలసగాని ముమ్మరముగా జరిగినపుడు స్థలనామములకు పునర్నామకరణము జరిగితీరును. ఇట్లు వివిధ గ్రామనామములయందు పలురకములయిన

పదములు ప్రథమావయవములుగా, ద్వితీయావయవములుగా నుండి, కలయికవలన గ్రామ నామములు ఏర్పడుచున్నవి. ఇట్లు ఏర్పడిన ద్వితీయావయవములను సంగ్రహముగ పరిశీలించుదము. అన్నింటిని చర్చించుటకు వ్యాసపరిధి పెద్దఅడ్డంకి.

'అగ్రహారమ్': అగ్రహారమ్ అనగా బ్రాహ్మణులు నివసించు ప్రదేశము అనే అర్థము మనకు స్ఫురించుచున్నది. పూర్వకాలమున రాజులు పన్ను చెల్లించ నవసరము లేకుండా తమ దగ్గరుండే ఆస్థాన కవులకు, పండితులకు కొన్ని గ్రామములను దానము చేయుచుండెడివారు. శ్రీకృష్ణదేవరాయలకాలమున ఆస్థాన కవీంద్రుడు పెద్దనకు నందవరమను గ్రామము అగ్రహారముగా యివ్వబడెను. ఆగ్రామమునందు వారు పన్నులు వసూలు చేసుకొనుచు ఆయా పాలకులకు విశ్వాసపాత్రులుగ నుండెడివారు. తరువాత కాలమున బ్రాహ్మణేతరులకు కూడ గ్రామములను యిచ్చుచుండెడివారు. అటువంటి ఈనాముగా ఇవ్వబడిన గ్రామములు జిల్లా నందు చాలావరకు ఉన్నవి.

ఉదా: చతుర్వేది మంగళమ్

తమిళమున అగరమ్, మంగళమ్‌గ పిలువబడుచున్నది. తమిళ సంప్రదాయమును అనుసరించి ఈపదము పుట్టినది. ఈ ప్రాంతము నన్నయామాత్యుని ఆదరించిన రాజరాజ నరేంద్రునిది. అతడు చోళులకు సంబంధించినవాడు.

ఆ సంప్రదాయములనుసరించి కొన్ని గ్రామములు ఇక్కడ వున్నవి. వత్సవాయి వారి వంశమునకు చెందిన వంశాంకురము రాయె జగపతిని తురుష్కుల బారినుండి కాపాడి విజయనగరమునకు చేర్చినందు వలన విజయనగర రాజులు ఆమె పేరున నొక గ్రామమును కట్టించినారు. అదియే "లక్ష్మీనరసాపురాగ్రహారమ్."

అవని అన్న సంస్కృత పదమునుండి 'అని' పదము ఉత్పన్నమగు చున్నది. అవని అనగా భూమి, నేల, స్థలము అనే అర్థమున వాడబడు చున్నది. ఇది భౌగోళికముగా సూచింపబడే అవగావని.

'ఆరామమ్' : ఆరామమ్ అన్నపదము చాళుక్య, చోళ, కాకతీయుల కాలమునుండి గూడ వాడబడుచున్నది. ఆరామమ్ అన్న సంస్కృతమున తోట,బ్రహ్మాండమైన అనేఅర్థమున చూపబడుచున్నది. మన ఆంధ్రదేశమునందు పంచక్షేత్రములు ఖ్యాతి వహించినవి. అందు ద్రాక్షారామము, కుమారారామము చాళుక్య భీమవరము - సామర్లకోట, పశ్చిమగోదావరి జిల్లానందు పాలకొల్లు క్షీరారామము, భీమవరము, గునిపూడి వద్దనున్న "సోమారామము", గుంటూరు జిల్లాయందు అమరావతి దగ్గరనున్న 'అమరారామము' మొదలగునవి. ఈ ఐదు క్షేత్రములందును శివుడే ఆరాధ్య దైవము. శైవులకు పరమముక్తిదాయకమైన క్షేత్రము, శివరాత్రి పర్వమైనదినము. ధ్వని పరిణామమున "ఆమ- ఆకేమ ఆరోమి-ఆరామ(ము) మరొక ఆశ్చర్యకరమై విశేషమేమిటంటే ఆరామ అన్నపదము కన్నడమునకు సంబంధించినదిగా తెలియుచున్నది. కన్నడమున బౌద్ధులు నివశించు పవిత్ర ప్రదేశమును పిలుచుస్థలము. కన్నడమున శాసనములు గూడనున్నవి.

పెద (ద్ద) దాక (ఆరామ) ఆరామి-1057 శాసనము

పెదదాకఆరామి-తామ్రశాసనము

ఇవిగాక ఆరామములకు చారిత్రాత్మకమైన ఐతిహాసికమైన చారిత్రిక గాథలు కలవు.

ద్రాక్షారామము-భావారామము

బంద : పర్యాయపదము బండ

బండ (బండ) అనగా పర్వతము, పెద్దకొండ (రాయి) అనే అర్థము మనకు స్ఫురించుచున్నది. బహుశా ఆ గ్రామమున పెద్దపెద్ద రాళ్ళు ఉండిగాని, పర్వతాగ్రభాగమున గ్రామము నిర్మించబడి గాని యుండవచ్చును.

ఉదా : వెలుగుబండ-

కాలక్రమమున అక్కడ బండలు లేకపోయినప్పటికిని అక్కడ గ్రామము బండ-బందగానే మిగిలి పోవుచున్నది.

బాయలు : ఏకాంత ప్రదేశము అనే అర్థము కన్నడమున సూచించు చున్నది. తెలుగు వ్యవహారమున బయలు - బాయలు బాయలు అనగా తమ పిల్లలకు స్తన్యమును యిచ్చు కుచములను బాయలు అని పిలుచుట గూడ జరుగుచున్నది.

బయలు-ఏకాంత ప్రదేశము బాయలు-స్తనములు

ఉదా : పోచమ్మ బాయలు - చింతబయ్యలు

తమిళము : వాయల్-వాయక్కళ్ - వరి పొలము, బహిరంగ ప్రదేశము

మళయాళము : వాయర్ వేళ్- వరిపొలము

కన్నడము : బాయ, బాయల్ - బహిరంగప్రదేశము

తుళు : బాయలు, బైలు-సారవంతమైన వరిపొలము

తెలుగు : బాయలు: బయలు; బహిరంగప్రదేశము, కుచములు

సమీప ద్రావిడభాషలయందు వీటికి వేరు వేరు అర్థములను పరిశీలించినట్లు తెలియుచున్నది,

ఉదా : చింతబయలు



మంగళం "అగ్రహారము" అన్నదానికి పర్యాయపదముగా సూచింపబడుచున్నది. చోళులకాలము నుండి గూడ ఈ పదము ఉపయోగింపబడుచున్నది. తమిళ సంప్రదాయమునకు సంబంధించినది.

ఉదా : చతుర్వేది మంగళమ్. 1093 శాసనము
(దానశాసనము)

చేడు : సంస్కృతభాష నుండి ఉద్భవించినది.

తమిళము : చేఱు నదీ పరీవాహక ప్రాంతము

మళయాళము : చేఱు - గరపనేల

కన్నడము : కేశర్ - గఱపనేల

తుళు : కేడు, తుప్పలుగల ప్రదేశము—

తెలుగు సాహిత్యమున చేడు అన్న చెత్తప్రదేశము, మెరక నేల అని సూచించేలాగున వాడబడుచున్నది. అయితే కొన్ని సారవంతమైన ప్రదేశములకు గూడ యివి సూచించడము జరుగుచున్నది. చేడుధ్వని పరిణామమున చేడి-శేటి-చేడుగా మార్పు నొందినది.

ఉదా : కారంచేడు.

చెలమ : చెలమ పదము గూడ ద్వితీయావయవముగా కనబడుచున్నది. ఇది తమిళమునకు చెందినది.

కన్నడము . చెలమ - నీటితో నిండిన గుంట.

తెలుగు - చెలమ - చిన్నవాగు

తుళు : సల్మా - నూయి .

సర్వసాధారణముగా నదీపరీవాహక ప్రాంతమున చిన్ననీటివాగు ఆధారముగ వెలసిన గ్రామమునకు చెలమ ద్వితీయావయవముగానున్నది.

ఉదా : కొండచెలమ

ఉదా    కొండ చెలమ

చెఱవు : తెలుగునాడు చెఱువు అన్నపదముతో కూడియున్న గ్రామ నామములు అనేకము మనకు గనబడుచున్నవి. దీనికి శాసనా ధారములు కూడ మనకున్నవి.

తమిళము : చేఱు - తటాకము పొలము,

మళయాళము : చిఱ-తటాకము

కన్నడము : కెఱె - తటాకము

తుళు : కెఱె - కృత్రిమముగా తయారుచేయబడిన తటాకము

తెలుగు : చెఱువు

ధ్వని పరిణామమున చెఱువు చెర్ వ్-చేఱు చెర్ల కెఱె-గఱె. తాలవ్యీ కరణమున 'క-గ' గా మారును అన్న విషయము మనకు తెలిసినదే.

శివసముద్రాలచెఱువు

అంబుధి : అంబుధి, తటాకము, చెరువు, సముద్రము మొదలగు పద ములు నీటివసతులకు సంబంధించినవి. అందువలన అవి అక్కడక్కడ ఉన్నవి.

ఉదా    పద్మాంబుధి - నాగాంబుధి

దివి-ద్వీపము-లంక : సంస్కృతమున ద్వీపము అన్నపదమునకు దీవి. దివి అని రూపాంతరములుగా వ్యవహారమున ఉన్నవి లంక కూడ పర్యాయపదమే. దివి "దీ" గా మారి ద్వీపము అగుచు న్నది. నదీ పరివాహక ప్రాంతమున చిన్న మెరకనుండి చుట్టూ నీరు ప్రవహించుచుండిన అటువంటి వాటిని మనవారు లంక అందురు. రామాయణ కాలమున రావణుడు నివశించిన

ప్రదేశమును లంకా ద్వీపము అందురు. అదియే నేడు లంకగా మారినది. తూర్పుగోదావరి జిల్లానందు గోదావరి నదీ పరివాహకప్రాంతము నిండా అనేక లంక లున్నవి. ఆ లంకలు జంతు, పశు, పక్షి, వ్యక్తి, దైవపరముగా అనేకములు ఏర్పడియున్నవి.

ఉదా : గుత్తినదీవి- గుడిలంక-తుమ్మలంక, బండారులంక.

దోన : తమిళమునకు ఋనై - పర్వతముల సమూహము. సమతల ప్రదేశమున చెట్లతో నిండిన, కప్పబడియున్న ప్రదేశము.

కన్నడమున దోనె-సహజముగా ఏర్పడిన చిన్నపర్వతమున నున్న నీటిగుంట.

తెలుగునందు మాత్రము దోన పర్వతముల సమూహము అని అర్థము మనకు గనబడుచున్నది. ఎక్కువగా దోనతో గూడియున్న గ్రామములు అటవీ ప్రాంతమునకు చెందియున్న ప్రదేశములను సూచించు మన్నవి. దోన-దొనె-దెవ-కోనదోన.

దుర్గము : సంస్కృతమున దీని అర్థము కోట. తెలుగునాడున కోట ద్వితీయావయవములుగా అనేక గ్రామములు మనకు కనబడుచున్నవి శతృవుల నుండి తమ్ము తాము రక్షించుకొనుటకు నిర్మించుకునే బలమైన కట్టడము దుర్గము. కాలక్రమేణా ఆ కట్టడముతో ఆ గ్రామమునకు ఆ పేరు వచ్చినది. కాని ఇపుడు ఆ కోటలు అక్కడలేనప్పటికిని ఆదే పేరుతో పిలువబడుచున్నవి.

ఉదా : కొండపల్లికోట - భీమవరపుకోట- కశింకోట- తంగేడుకోట.

రాజులు నివశించు ప్రదేశమును గూడ కోట అందురు. వ్యవహారమున దుర్గము చిన్నది, అంతకంటె పెద్దది కోట.

ఏఱు : ఏరు పదము 7వ శతాబ్దమునుండి శాసనస్థమైయున్నది.

తమిళము .... యారు-నది

మళయాళము .... ఆరు-నది

తెలుగునందు ఏరు అనగా చిన్ననది.

వర్షాకాలమున పొంగు కాల్వ అనే అర్థము మనకు ద్యోతక మగుచున్నది.

కొల్లేరు, కాలేరు, కాతేరు, దొంగేరు.

గడ్డ : గడ్డ పర్యాయ పదము గెడ్డ, చిన్న నీటి ప్రవాహము. ఇవి సాధారణముగా పర్వతముల నుండి ప్రవహించు నీటెని, గడ్డలు-గెడ్డలు అని పిలుచుట కలదు. బెంగాలీ భాషయందు కూడ గెడ్డయన్న పదము ఆ పదముతో కూడిన గ్రామ నామములు మనకు కనబడు చున్నవి.

తెలుగు గడ్డ

కన్నడము-గడ్డె

బెంగాలీ-కున్డ్రి

ఉదా : వట్టిగెడ్డ. కమిలిగడ్డ, అల్లూరిగడ్డ, చీలిమిగడ్డ, రొడ్డగెడ్డ

గణ్ణి : గండి అన్న పదమునకు సమానార్థకముగా గణ్ణి వాడబడు చున్నది.

మళయాళము : కలన్ది, పర్వత మధ్య భాగముల నున్న త్రోవ

కన్నడము : కండి కిండి-గండి

తులు : కండి ఖండి-గండి

ఈదేపదము బహువచనమున గుండ్లగ వాడబడుచున్నది

ఉదా : గుం కమ్మ.

గిరి కొండ అన్నపదమునకు గిరి సమాంతరముగ వాడబడుచున్నది ఇది పర్వత సూచకము.

ఉదా : జగన్నాథగిరి, కొమరగిరి, అనంతగిరి, వేమగిరి.

గుడి : దేశ వ్యవహారమున ఆలయము, భగవంతుడు నివ
శించు ప్రదేశం

తమిళము : కుటి కుటి-కుటికాయ్

మళయాళం : కుటి

కన్నడము : గుడి-చిన్న పూరిపాక

తుళు : గుడి-చిన్న పగోడ

తెలుగు : గుడి-ఆలయము

వివిధ భాషలయందు వివిధ అర్థములు ఉన్నప్పటికిని తెలుగు నందు మాత్రము గుడి అన్న పదమునకు పవిత్రమైన ఆలయం అన్న భావన మాత్రమే తెలియుచున్నది. తాలవ్యీ కరణమున కుడి - గుడి (క-గ)గా మారును.

ఉదా : జగన్నాథ గుడి.

గుండము : సంస్కృతమున కుందము గుండ్రముగనుండి నీటితో నిండియున్న ప్రదేశము అందురు. దేవతల ప్రీత్యర్థము చేయబడిన గుండమందురు. మహ్మదీయులు పీర్లపండుగ సందర్భమున కణ కణ మనే నిప్పులు పోసి వాటిమీద ఉపాసకులు నడుచుదురు. వాటినే గుండమందురు. తాలవ్యీకరణమున క-గ గా మారి కుందము గుండ ముగా మారినది. ఉదా : రామగుండము

ఇల్లి, విల్లి, మిల్లి, పల్లి : ఎక్కువగా నదీ తీరముల యందును, సముద్ర తీరములందు గల గ్రామముల యందును ఇల్లి, విల్లి, మిల్లి, పల్లి, మొదలగు ద్వితీయావయవములు గల గ్రామములు కనబడు చున్నవి. నిఘంటువుల యందు వీటికి అర్థము లేదు. పదవ్యుత్పత్తిని గూడ మనము తెలియజేయలేము. ఇవి ఎక్కువగా వృక్షవాచకములు గల శబ్దములుగా మనకు కనబడుచున్నవి.

ఉదా : కోరుమల్లి- యల్లమిల్లి- కందులపల్లి దేవరాపల్లి-విలసవిల్లి గాడవిల్లి-

కాల్వ : నీరు ప్రవహించు మార్గమును కాలువ, కాల్వ అందురు. సన్నని ఇరుకైన వ్యవసాయ సంబంధమైన నీటి మార్గము. సమీప భాషలయందు తమిళమున కళ్ - వాయక్కాళ్, తెలుగున కాల్వ - కాలువ ఉదా: శివకోడు కాల్వ.

కుదురు : కుదురు శబ్దము మనకు 11వ శతాబ్దము నుండి గూడ గన బడుచున్నది. కుదురు శబ్దమునకు శబ్దరత్నాకరమున అనుకూలము, స్థిరము అను అర్థములు సూచింపబడినవి.

ఉదా : నడకుదురు - మామిడి కుదురు - పెనుగుదురు, కొంకుదురు- మొగలికుదురు.

కుఱ్ఱు : కుర్తి శబ్ద భవము మనకు 12వ శతాబ్ధము నుండి శాసన రూపమున గనబడుచున్నది.

ధ్వనిపరిణామమున కుర్తి-కుఱ్ఱుగా మారుచున్నది.

ఉదా : గాగులకుఱ్ఱు,-పుల్లేటి కుఱ్ఱు - బోడసకుఱ్ఱు - సోమనాధకుఱ్ఱు.

పఱ్ఱ : పఱ్ఱ శబ్దమునకు చవిటినేల, వ్యర్థభూమి అందురు. ఉప్పును పండించే ప్రదేశమునకు పఱ్ఱ అని పిలుచుదురు.

ఉదా : చవిటి పఱ్ఱ

పట్టణము : పుర(ము) శబ్దభవము సంస్కృతమునకు చెందినది. పురము ద్వితీయావయవముగా పురములు దేశమున అంతట కల్గియున్న గ్రామనామములు అనేకము వున్నవి. ద్రావిడ భాష నుండి ఉద్భవించి, సంస్కృతమున అభివృద్ధి చెందిన పురమునకు జనసమ్మర్థము కలిగియున్న అభివృద్ధి ప్రదేశమును పురము అందురు.

పురమ్-పుర-వొరమ్-వొరము-వరము

విష్ణుపుర-విశ్వపురము-పిఠాపురము-450 శాసనము

జననాథపురం-దత్తారామము-1076 శాసనము

భీమపురమ్-భీమవరము-1146 శాసనము

రాజమహేంద్రీపురమ్-రాజమండ్రి-1296 శాసనము

చాళుక్య భీమవరమ్-సామర్లకోట-1093 శాసనము

వాడ : సంస్కృతమున వాట పదమునకు వీధి-వరుసగల యిండ్ల సముదాయముగ తెలియుచున్నది. వాట పదము తెలుగున వాడగ మార్పు చెంది వీధివీధిన వెలసినవి. మాయిన్ద్రివాడ ... మహేంద్రివాడ...564 శాసనము. తరువాత కొన్ని పదములకు 'అడ'గ మారినవి

కాకండివాడ-కాకినాడ-742 శాసనము

నవఖండ్రివాడ-కండరాడ-1070

దుర్గవాడ-దుర్గాడ-1116 శాసనము

తరువాత వాటిక పదము గూడ వాడగ మారు చున్నవి. వివిధ గ్రామములయందు తెలియజేయబడిన ద్వితీయావయవములను కొన్నింటిని మాత్రమే తెలియజేసితిని. ఇంకను వివరించలసినవి యున్నవి అనేకము. ఇవి కేవలము గ్రామనామముల యందు మాత్రమే గాక వ్యక్తులనామములందు గూడ నున్నవి. కులవాచకములు, జాతివాచకములు మొదలగునవి.

అట్లే నాయుడు, శ్రేష్టి, రాజు, శెట్టి, మస్తాన్, మొదలగునవి. పుటల పరిమితిని, వ్యాసపరిమితిని దృష్టియందుంచుకొని మరింత విశాలముగా యిక్కడనేను విశ్లేషణ చేయలేక పోవుచున్నాను.

# వ్యక్తి వాచకాలు

ఆంధ్ర సాహితీ రంగమున పరిశోధన నేడు రెండు విధములుగా జరుగుచున్నది. ఒకటి భాషా శాస్త్ర పరముగానూ, మరొకటి సాహిత్య పరముగా ముమ్మరముగా జరిగినది. జరుగుచున్నది కూడానూ. అందులకు కారణము పరిశోధకులు సాహిత్యము మీద ఎక్కువగా అభిమానము చూపసాగడమే. అంతేగాదు, ఆనాటిప్రజలు సాహితీ వేత్తలు, సాహిత్యము నెక్కువగా నారాదించారు. అందువల్లన పరిశోధకులు సాహితీపరమైన వ్యాసములను, పరిశోధనా ఫలితములను పత్రికాముఖంగా ప్రచురించేవారు. ఈ తరహా పద్ధతి నించు మించు 20వ శతాబ్ది ప్రారంభము వరకూ గూడా జరిగినది అని చెప్పవచ్చును.

గానీ 20వ శతాబ్ది నుండి సాహితీరంగమున అనేక విప్లవాత్మకమైన మార్పులు కనబడుచున్నవి. అంతు లేని సాహిత్యరంగమున ఇతర భాషల సాహిత్యము ప్రవేశించుటవలన పరిశోధకులలో నూతన ధృక్పథము నేర్పడుట వలన, సాహిత్యరంగము మీదనుండి భాషా రంగము మీదకి దృష్టి మరల్చినారు. తత్ఫలితముగా భాషాశాస్త్ర పరముగా ముమ్మరముగా పరిశోధన జరుగుచున్నది.

సాహిత్య పరముగా పరిశోధన సాగిస్తే, పురాణ కాలక్షేపణ సాహితీ సంపద వెలుగులోనికి వస్తాయి. భాషాశాస్త్ర పరముగా పరిశోధన వలన ఆ కాలమునాటి ప్రజల భాషావ్యవహార సరళీ ఇతర భాషల ప్రభావము, భాషాపరిణామము భౌగోళిక మత సాంఘిక అంతేకాకుండా ఆనాటి ప్రజల జీవన సరళి పూర్తిగా మన కవగతమగుచున్నది.

భాషా శాస్త్ర పరిశోధనలో ఈనాడు ముఖ్యముగా నామ శాస్త్రాధ్యయనము ప్రముఖముగా గానవచ్చుచున్నది. అందులో

స్థలనామములు వ్యక్తినామములు ఇత్యాదులు. వ్యక్తుల నామముల మీద చేసే పరిశోధనను "అంత్రోపోనిమి" అనియు, స్థల నామ లేదా గ్రామ నామముల మీదచేసే పరిశోధనను "టోపోనిమి" అని యందురు. అంతేగాదు ఈ మధ్యన ఇంటి పేర్లమీద కులం గోత్ర నామముల మీద పరిశోధకులు పరిశోధనలు చేయుచున్నారు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున అచార్య జి యన్. రెడ్డిగారి పర్యవేక్షణలో రాయలసీమ స్థల నామములు మరియు వ్యక్తుల నామ పరిశీలన అను ఒక ప్రాజక్టు పనిచేసిట్లుగా తెలియు చున్నది. పరిశోధకులు జిల్లాలవారీగా పరిశోధనలు చేసి అనేకమంది పరిశోధకులు M.Phil. మరియు Ph.D., పట్టాలను పొందియున్నారు.

భగవంతునిచే సృష్టింపబడిన ప్రతీవస్తువునకు పేరున్నట్లే సృష్టింపబడిన ప్రతీవ్యక్తికీ పేరు ఉండుట సహజము. అంతేకాదు, వ్యక్తిని గుర్తించటానకి పేరు చాల అవసరము. జన్మించునపుడే వ్యక్తి గూడా పేరుతో పుట్టడు. ఆ పుట్టిన వ్యక్తికి నామ కరణము అతడు నివశించే ప్రదేశము, భౌగోళిక పరిస్థితి తిథి నక్షత్రము, వంశచరిత్ర, రాజవంశ చరిత్రల ఆధారములతో అతనికి పేరును సూచించడము జరుగుచున్నది.

"పేరులో ఏమున్నది పెన్నిది" అని మనవారు పేరున కంటేగుణానికి ప్రాధాన్య మిచ్చినప్పటికిని వారు భావించిన అర్థములో పెన్నిది లేక పోయినా జీవితాంతము అనంతర కాలమున గూడా అతనికి ఆ పేరుతోనే ఆ వ్యక్తికి గుర్తింపు కల్గుతుంది. కనుక ఆ గుర్తింపునే పెన్నిధిగా భావించు కొనవచ్చును పోతనామాత్యుని ఆంధ్ర మహాభాగవతమున

"ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వనియందు డిందు బరమేశ్వరుండెవ్వండు మూలకారణం
బెవ్వఁడనాది మధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁదాన యైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేఁడెదన్"

పరమాత్మ సాక్షాత్కారమును పొందిన మహాభక్తుడు పోతన తన భాగవతములో సృష్టి స్థితి లయాలకు కారకుడైన భగవంతుడ్ని గురించి చాలా గొప్పగా స్తుతించాడు. ఆ భగవంతుడెలాంటివాడో తెలిపాడే తప్ప ఫలాని అని నిర్ధేశించలేకపోయినాడు.

పరమాత్మసాక్షాత్కారాన్ని పొందిన మహాభక్తుడైన పోతన గారే నిర్ధేశించలేకపోతే, భౌతికమైనటువంటి రూపములేని పరమాత్మ స్వరూపమును ఎవరు మాత్రము నిర్ధేశించగలరు. గాని మానవుల సంగతి వేరు మానవుడు సంఘజీవి. వ్యక్తులమధ్య సంబంధాలు చాలా సంక్లిష్టముగా నుంటాయి. వ్యక్తులసంఖ్య అత్యల్పమైతే, ఆ వ్యక్తులకు ప్రత్యేక గుర్తింపు అనవసరము కాని మానవుల సంఖ్య అపరిమితము. అందువల్లన మానవునికి పేరు విధిగా చేయవలసి వచ్చుచున్నది. మన ప్రాచీనులు జన్మసంస్కారములలో ఒకటిగా నామకరణ మహోత్సవమును చేయుచున్నారు. అందువల్లన పుట్టిన బిడ్డనకు ఏదో ఒకపేరు పెట్టకుండా ఆ వ్యక్తులు నివశించే ప్రదేశము, మతము, ఆచారవ్యవహారము, జీవన సరళి అధ్యాత్మిక, తిధి, వారము, నక్షత్రము మొదలగు అన్నింటిని పరిగణనలోనికి తీసుకుని నామకరణము చేయుచున్నారు.

అనంతమగు నటువంటి సృష్టియందు వ్యక్తుల నామములను పరిశోధిస్తే, మనకు ఎంతో ఆసక్తికరమైన సంఘటనలు వెలుగులోనికి వచ్చుచున్నవి. భారతదేశములోనేగాక, అటు పాశ్చాత్య దేశాల్లోను, ఈ నామ శాస్త్రాధ్యయనముమీద ఆశక్తితో పరిశోధనలు చేయున్నారు. అనంతమగు నటువంటి ఈ నామ శాస్త్రాధ్యయనమును శాస్త్రీయ దృష్టితో ఈ క్రింది విధముగా వర్గీకరించడము జరుగుచున్నది.

# నామశాస్త్రము : ఆంత్రోపోనిమి

1. మత
సూచకాలు : 101

- ఎ. హిందూమత
  సూచకాలు : 100
- బి. శైవమత
  సూచకాలు 120
- సి. వైష్ణవమత
  సూచకాలు 130
- డి. మహమ్మదీయ
  సూచకాలు 140
- ఇ. క్రైస్తవ మత
  సూచకాలు 150
- ఎఫ్. బౌద్ధమత
  సూచకాలు 160
- జి. శిక్కుమత
  సూచకాలు 170
- హెచ్. ఇతర మత
  సూచకాలు

2. జానపద
సూచకాలు : 200

- ఎ. గ్రామదేవత
  సూచకాలు : 210
- బి. క్షేత్రదైవత
  సూచకాలు 220
- సి. పశుపక్ష్యాది
  సూచకాలు 230
- డి. లతా
  సూచకాలు 240
- ఇ. ఆభరణ
  సూచకాలు 250
- ఎఫ్. కాల
  సూచకాలు 260
- జి. నక్షత్ర
  సూచకాలు 270
- హెచ్. మహాత్మ
  సూచకాలు 280
- ఐ. నదుల సూచకాలు 190
- జె. ఇతర సూచకాలు 295

3. చారిత్రిక
సూచకాలు : 300

- ఎ. ఇతిహాస
  సూచకాలు : 310
- బి. పురాణ
  సూచకాలు 320
- సి. స్థలపురాణ
  సూచకాలు 330
- డి. రాజకీయ
  సూచకాలు 240
- ఇ. సంఘటనాత్మ
  సూచకాలు 350

4. సాంఘిక
సూచకాలు : 400

- ఎ. కుల
  సూచకాలు : 410
- బి. గుణ
  సూచకాలు 420
- సి. ఆకార
  సూచకాలు 430
- డి. వర్ణ
  సూచకాలు 440
- ఇ. ఇతర
  సూచకాలు 450
- మైనరు-దత్తుడు 460
- కవలలు 465
- ముద్దు పేర్లు 470
- ఇంటి పేర్లు 485
- కులము పేర్లు 480
- వెక్కిరింత పేర్లు 480
- స్వరూపనామాలు 490

5. ఆధునిక
సూచకాలు : 500

- ఎ. విజ్ఞాన
  సూచకాలు
- బి. పాలనా
  సూచకాలు
- సి. ఇతరములు 530

మతసూచకాలు మతమును సూచించేవి. నామ శాస్త్రాధ్యాయనమున ముఖ్యముగా కన్పించేవి మత సూచకాలు, నూటికి తొంబదిపాళ్లు మతమును సూచించేవే గనబడుచున్నవి. సువిశాలమైన భారత దేశమునందు వివిధ రకాలైన మతములు, అందునా వింత వింత ఆచారవ్యవహారములతో ప్రజలు, జీవనము సాగించుచున్నారు.

మతము మానవాళికి జీవగఱ్ఱ. మతమునందున్న మూఢ విశ్వాసము ప్రజలకు మరిదేనియందునూ లేదు. చివరకు తను కని పెంచిన తల్లిదండ్రులయందు కంటే తమ మతమునకే ఎక్కువగా ప్రాధాన్యము చూపెడుతున్నారు. అంతేకాదు వివిధ మతాలవారు తమతమ మతాల ప్రాధాన్యతను గొప్పదనమును చూపెట్టుటకొరకు ఉత్సవములు ఊరేగింపులు జరుపుచున్నారు.

ఆదికాలమున దేశసమైక్యత, మానవాళి ఐక్యతకొరకు మాత్రమే సృష్టించబడిన మతవ్యవస్థ, ఈనాడు మానవుడు దానికి బానిస. చూడగా కొన్ని కొన్ని పర్యాయములు మూర్ఖుడుగా ప్రవర్తించుచున్నాడు. తత్ఫలితముగా విభిన్నమతముల మధ్య అంతఃకలహములు, రాజకీయ హత్యలుగూడా జరుగుచున్నవి. అన్ని మతముల సారాంశము ఒకటే అయినప్పటికినీ మానవుడు మతవ్యవస్థను అర్థము చేసుకునేతీరు, భిన్నముగా నున్నది, ఆ ఉద్యమాల ప్రభావఫలితముగా మానవులు తమ లేదా తమ సంతతి వంశ, జాతి పేర్ల మీదగూడా ఆ ప్రభావమును చూపెడుతున్నాడు.

విశాలమైన భారతదేశమునందు ప్రధానంగా కన్పించేది హిందూ మతము. ఆదికాలమున ఆదిగురువు శ్రీ శంకరాచార్యులు హిందూ మతమునకు ఆదిప్రవక్త. వారు వేదములను, ఉపనిషద్‌లను, ప్రజలకు బోధించి ప్రజలందరిని మతోద్యమున ప్రభావితులుగా చేసినారు. ఆ

తదుపరికాలమున శైవమతోద్ధరణకు పండితారాధ్యుడు, నన్నెచోడుడు. యథావాక్కుల అన్నమయ్య, ఇత్యాదులు శైవమతమైన గ్రంథములను రచించి తిరునాళ్ళలో, దేవుని ఉత్సవములలో, ప్రజలకు భోదించుచుండెడివారు. ఇటువంటి ఉద్యమాల ప్రభావము ప్రజలలో బాగా వేళ్ళూనుకోని, తమజాతి వారికి, శైవ సంబంధమైన పేర్లను కృతజ్ఞతగా సూచించడము జరుగుచున్నవి. శైవమతోద్యమ ప్రభావ ఫలితముగా ఆకాలమున వెలసిన శివక్షేత్రములు శ్రీశైలము, కాళేశ్వరము, దాక్షారామము, కాశీ, శ్రీకాళహస్తి, బదరీనాద్, రామేశ్వరము.

శైవమతము మంచి ఉచ్ఛస్థితియందున్నపుడు ప్రజలు తమ బిడ్డలకు నామములను మతానుసారముగా అవలంబించారు.

| | |
|---|---|
| మల్లిఖార్జునయ్య | ధూర్జటి |
| మల్లిఖార్జునరావు | పండితారాధ్యుడు, |
| గణేశ్వరరావు | శివకుమార |
| గణపతి | పంచాక్షరి, |
| గణేష్ | మల్లేశ్వరి |
| తిమ్మన్న | భ్రమరాంబ |
| తిమ్మరుసు | అన్నపూర్ణ |

ఇటీవల కాలమున నేటి మానవులు పేర్లవిషయమున వాజూకుగా మతానుసారముగా సూచించుచున్నారు.

## వైష్ణవమత సూచకాలు :

భిన్నత్వములో ఏకత్వము కొరకు ఎంత ప్రయత్నము చేసినపటికినీ, రెండుచేతులూ ఒక్కరివే అయినప్పటికినీ, రెండు చేతులూ రెండే. అవి ఒకటిగా ఎన్నడూ గావూ.

దేశమున శైవమతము ఎంత ఉచ్చస్థితి యందున్నప్పటికినీ, దానికి వ్యతిరేకముగా ఉద్భవించినది, వైష్ణవ మతము. ప్రజలయందున్న మూఢ విశ్వాసాలను తొలగొట్టుటయేగాకుండా, వైష్ణవమతమును ప్రచారము చేసినవారు ఎందరో యున్నారు. అందులో ప్రధానముగా ముఖ్యులు రామానుజాచార్యులు. మధ్వాచార్యులు ఆధర్వణాచార్యులు. ఆ ఉద్యమాల ప్రభావముగా కొన్ని క్షేత్రములు గూడా వెలసినవి. హరిద్వారము. కైలాసనాథ్, ఋషీకేష్ తిరుపతి, సింహాచలము, చిదంబరము మొదలైనవి.

వైష్ణవమత ఉద్యమాల ప్రభావముగా, ఆ ఉద్యమము కొరకు శ్రమించేవారు, అభిమానించేవారు. ఆయా మతసంబంధమైన పేర్లను సూచించేవిగా తమ పేర్ల విషయమున అవలంబించుచున్నారు.

| | |
|---|---|
| శ్రీనివాసాచార్యులు | శ్రీనివాసరావు |
| గోవిందాచార్యులు | గోవిందరావు |
| రామానుజాచార్యులు | రాజారావు |
| ఆధర్వణాచార్యులు | అన్నమయ్య |
| పద్మావతి | మంగావతి |

తదుపరి ఉద్యమములు నశించిపోయినప్పటికినీ, ఆనాడు తామరతంపరగానున్న పేర్ల విషయము ఈనాడు కూడా మనము అవలంబించుచున్నాము, కానీ ఆధునికతగా మాత్రమే.

| | |
|---|---|
| రామారావు | పద్మావతి |
| సత్యనారాయణ | వెంకటరమణ |
| రాజేష్ | పద్మిని |
| రజనీష్ | పాపారత్నం |

## మహమ్మదీయ మతసూచకాలు

హిందూమతము అభివృద్ధిచెంది, సువిశాలమైన భారతదేశమున హిందూరాజులు పరిపాలిస్తున్న కాలమున రత్నగర్భ అనదగిన ఈ దేశముమీద విదేశీయులు కన్నువేసారు. అందులకనుగుణముగనే, హిందూరాజుల అనైక్యతకారణముగా, కొందరు స్వార్థపరులు, మరియు దేశద్రోహులు విదేశీయులైన మహమ్మదీయులను ఆహ్వానించిరి అట్టిచిన్న పొరబాటు కారణముగా మనదేశము కొంతకాలమునకు పూర్తిగా మహమ్మదీయ రాజ్యముగా మారిపోవలసి వచ్చినది. మహమ్మదీయ రాజులు ఎంతటి ప్రజారంజకముగా పరిపాలించినప్పటికినీ, వారికి విపరీతమైన మతమౌఢ్యము గలదు. మత ప్రాబల్యము కొరకు కొందరిని బలవంతముగా, మరికొందరిని ధన ప్రలోభముతో, మరికొందరిని మంచి ఉద్యోగాదులతో హిందూమతము నుండి మహమ్మదీయ మతములోనికి మార్చిరి. మరికొందరు హిందువులు హిందూదేశపు రాజులు మహమ్మదీయ యువతులను వివాహమాడిరి. ఇస్లాము మతమును స్వీకరించిరి. ఇటువంటి అనేక విపత్కర పరిస్థితుల యందు హిందువులు మహమ్మదీయ మతమును స్వీకరించుటయే గాక, తమ పేర్లయందు, తమ బిడ్డల పేర్లయందు ఇస్లాము ప్రభావమును స్పష్టముగా చూపినారు.

| | | |
|---|---|---|
| సుల్తాన్ | అల్లా | మహమ్మద్ |
| మస్తాన్ | అబ్దుల్లా | షాజహాన్ |
| సులేమాన్, | ఖాన్ | ముంతాజ్ |
| శిలార్ | జరీనా | నూర్జహాన్ |
| హుస్సేన్ | ఫకీరు | సైమున్నీసా |

కొందరు హిందూ మతస్థులు ఇస్లాము మతమును అవలంబించక పోయినప్పటికినీ ఏదోనొక చిన్న సంఘటనతో తమ పిల్లలకు మస్తాన్

రావు, మస్తాన్ రెడ్డి, మస్తానయ్య మస్తానమ్మ మొదలగునవి పెట్టు కొనుచున్నారు. ఇందు రెడ్డి, రావు, అయ్య అమ్మ మొదలగు పదములు హిందూ మతమునకు చెందినవి. ఇవి హిందూ, ముస్లిముల ఐక్యతకు ప్రతీక.

క్రైస్తవమత సూచకాలు :

హిందూ దేశమున మహమ్మదీయ చక్రవర్తులు రాజ్యమును పరిపాలించు కాలమున భారతదేశమునకు క్రీ.శ. 1498న సముద్ర మార్గమున ఫ్రెంచివారు ప్రవేశించిరి. ఆ తరువాత డచ్చివారు, బ్రిటీష్‌వారు వర్తకరీత్యా వచ్చి చివరకు తమకు ఆశ్రయమిచ్చిన భారతీయ రాజులను మోసముతో జయించి వారి సామ్రాజ్యమునే కబళించారు. వారు తమ రాజ్యమును సుస్థిరము చేయుటకు మతమును ఆయుధముగా స్వీకరించిరి. అందుల కనుగుణముగానే బైబిలును పాఠ్యగ్రంథముగా ప్రవేశబెట్టి ప్రజలకు నన్నియో సౌకర్యములు కలుగచేసిరి. ఆ ప్రభావముతో ఆ మతమును అవలంభించిన ప్రజలు, తమ మరియు బిడ్డల పేర్ల విషయమున మతానుసారిగా సూచించుచున్నారు.

| | | |
|---|---|---|
| మేరి | మరియమ్మ | దావీదు |
| జీసస్ | ఏసురత్నం | డానియల్ |

నేటి ఆధునిక సమాజమునందు విపరీతమైన మార్పులు చెందుచున్నతరుణమున, కొందరు ఐక్యత దేశ సమైక్యత, కొరకు నిరంతరము ప్రతిఫలాపేక్షలేకుండా దేశసేవ చేయుదురు. వారి ఆశయాల సిద్ధికొరకు, సమైక్యతా చిహ్నాలను సూచించేవిగా యుంటున్నాయి. గాని ఇటువంటివి చాలా అరుదుగానుంటాయి.

ఉదాహరణకి పెద్దాపురము గ్రామమున వైశ్య కులమునకు

చెందిన ఒక వ్యక్తి పేరు కటకం బాబాఖాదర వల్లీఖాన్. అంతేగాదు ప్రసిద్ధి చెందిన పండితుని పేరు షేక్ జాకబ్ శాస్త్రి.

ఇందు షేకు పదము మహమ్మదీయ మతమునకు చెందినది కాగా శాస్త్రి హిందూ మతమునకు చెందినది. ఇది కేవలము సమైక్యత చిహ్నముగా మనము సూచించుకోవచ్చును.

జైనమత సూచకాలు :

వర్ధమాన మహావీరుని బోధనలచే ప్రభావితులైన వారు జైనులు. వారు అవలంబించే మతము జైన మతము. బౌద్ధమతము వలెనే, జైనమతము గూడా జంతువులను హింసించకూడదు, సత్యమును పలుక వలయును. సాటివారిని ప్రేమించవలయును. కోరికలు కోరగూడదు. వీరు మనకి జ్ఞానాభివృద్ధికి ఎంతగానో పోరాడినారు. ఆ మతమును అవలంబించి ఇప్పటికినీ ఆరాధించేవారు కేవలము రాజా స్థానీయులే. వీరినే మనము మార్వాడీలందురు. వీరు వర్ధమాన మహావీరుని పూజిస్తారు. కాని పేర్లయందు మాత్రము హిందూ దేవతల ప్రభావము ఎక్కువగా కనబడుచున్నది.

ఇంద్రజిత్ లాల్ కృష్ణ సేట్ వర్ధిచంద్ సుఖ్‌రాజ్
మోహన్‌లాల్ కృష్ణ ప్రకాష్‌చంద్

జానపద సూచకాలు :

జనపదము నుండువారు జానపదులు, జనపదమనగా గ్రామము గ్రామమున నివశించువారు జానపదులు. అనగా నేటి గ్రామీణ ప్రాంతమున నివశించు పల్లెటూరు వాసీయులు దేశము ఇంత అభివృద్ధి చెందుచున్నప్పటికినీ, కొన్నిచోట్ల ఆచార వ్యవహారములందు నే మాత్రమును మార్పుచెందక, ఆ రీతిగానే మసలు చున్నారు. ఇంత ఏండ్లలకు ఈ శతాబ్దమున సైన్సు ఎంతగానే అభివృద్ధిచెంది గ్రహం

తర యానము చేయుచున్న తరుణములో దేవుడు లేడని నిర్ణయించబోయె సమయమున అత్యంత ఆధునిక శాస్త్రవేత్తలు గూడా భగవంతుని మాధ్యముగా ఆరాధించుటములో ఎంత ఔచిత్యమున్నదో అంతటి ఔచిత్యము గ్రామీణ ప్రజల వ్యవహారమున తెలియుచున్నది.

నిజానికి గ్రామీణ ఆచార వ్యవహారములను, పూర్తిగా పరిశీలిస్తే మన ఆచార వ్యవహారమున ఎంతటి ఔన్నత్యము దాగి యుందో తెలియుచున్నది. గ్రామీణుల భాషను నిశితముగా పరిశీలిస్తే ఆనాటి ప్రజల వ్యవహారసరళి సాంఘికాచారములు మూఢ నమ్మకాలు ఒక టేమిటి సమస్త విజ్ఞాన సంపదను వెలికితీయవచ్చును. ఇటీవల పరిశోధనకారులు ఈ విషయమై చాలా కృషి చేయు చున్నారు. జనపథమును సూచించేవి కొన్ని విభాగములుగా చేయ డము జరిగినది.

గ్రామ దేవత సూచకాలు :

నాడు గ్రామము స్వయం పోషకము. గ్రామ ప్రజల కొరకు గ్రామమునందలి కొందరు వ్యవసాయము, మరికొందరు వాణిజ్యము, మరికొందరు కులవృత్తులు అనుసరించి గ్రామమును సస్యశ్యామ లముగా చేసేవారు. అయా సందర్భమున ఒక గ్రామ దేవతను గూడా నెలకొల్పేవారు. గ్రామ దేవత కొరకు ప్రజలందరు సమైక్యముగా ఏటేటా ఉత్సవములు, బలులు చాలా ఘనముగా చేసేవారు. ఆ గ్రామదేవత దయవల్లన, ఆ గ్రామమును పూర్తిగా రక్షించుట కొరకేగాక, ఆ గ్రామమునందలి ఆకస్మాత్తుగా బయలుదేరే కలరా, ఆటలమ్మ వంటి, అంటువ్యాధులను గూడ ఆతల్లి రూపుమాపుతుందని వారి ఆశయము. ఆ భావముతోనే, గ్రామముల యందు ఎత్తైన ప్రదేశములయందు గ్రామదేవతల ఆలయములను నిర్మించేవారు. ఆ తదుపరి గ్రామ ప్రజలు తమ తమ బిడ్డలకు ఆ దేవ

తల పేర్లు పెట్టుకుని ఆ తల్లి చల్లగా కాపాడుతుందని వారి నమ్మకం. ఇంచుమించుగా ప్రతీ గ్రామమున నొక గ్రామ దేవత ఆలయమున్నది.

| | | |
|---|---|---|
| పెద్దాపుర గ్రామమున | .... | మరిడమ్మ |
| కాండ్రకోట | ... | నూకాలమ్మ |
| ఉప్పాడ | ... | గంగాలమ్మ |
| తుని | .... | తలుపులమ్మ |
| విజయనగరమున | ... | పైడితల్లి |
| అనకాపల్లి | ... | పరదేశమ్మ |
| విజయవాడ | .... | కనకమహాలక్ష్మమ్మ |
| కాశీ | ... | అన్నపూర్ణమ్మ |

మొదలగునవి ఖ్యాతి చెందిన గ్రామ దేవతలు. ఆ గ్రామ దేవతల కృతజ్ఞతా సూచకముగా గ్రామీణ ప్రజలు తమ బిడ్డలకు నామకరణము చేయడము జరుగుచున్నది.

| | | | |
|---|---|---|---|
| మరిడయ్య | మరిడమ్మ | బంగారయ్య | బంగారమ్మ |
| నూకాలమ్మ | నూకన్న | తలుపులమ్మ | దుర్గమ్మ |
| అంకాలమ్మ | అంకయ్య | పరదేశి | పైడితల్లి |

తదుపరి ఇవే పేర్లు ఆధునికత కారణముగా నూకాలమ్మ పేరు నూకరత్నముగా, అంకాలమ్మ పేరు అంజలిగా. బంగారమ్మ పేరు బంగారుపాపగా మార్పు చెందడము జరుగుతున్నది. ఎన్ని మార్పులు ఏర్పాటు చేసుకున్నప్పటికినీ, మౌలికమైన భావన. ఆచారమును వదలలేరు.

## క్షేత్ర దర్శన సూచకాలు :

గ్రామ దేవతలతో బాటుగా క్షేత్రములను గూడా మనవారు నెలకొల్పి, వారిని ఆరాధించడము మనకు వేదాలనుండి గూడా

తెలియుచున్నది. గ్రామస్థులు జాతరలు, ఉత్సవముల నిమిత్తము క్షేత్రోత్సవములను జరుపుదురు. ఆ ఉత్సవమునందు వేలకొలది జానపదులు పాల్గొని తమ భక్తిని చాటుదురు. భక్తితోబాటు వారికి కొన్ని కోర్కెలు కలుగును. ఆ కోర్కెలు తీర్చమని ఆ దేవతలను కోరుకుందురు. అందులకు ప్రతిఫలముగా నీ పేరు పెట్టుకుంటామని ఆ స్వామినకు విన్నవించుకొందురు. అట్లాగే క్షేత్రదర్శన ద్వారా పుట్టిన పిల్లలకు ఆయాపేర్లను పెట్టడము జరుగుతుంది.

ఇప్పటికినీ, మనము శ్రీ వేంకటేశ్వర స్వామిని బిడ్డలను ప్రసాదించమని కోరడము చూస్తూయున్నాము గదా ! మన ప్రాంతమున ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రములుగా పేరొందినవి సింహాచలము, అన్నవరము, తిరుపతి, శ్రీశైలము, ఆయా ప్రాంతమున నున్న ప్రజలు ఆయా స్వాముల పేర్లను పెట్టుకొనడము జరుగుతుంది.

## పశుపక్ష్యాదుల సూచకాలు :

అనంతమైన ప్రకృతియందు పశు పక్ష్యాదులుతో నిండియుండి లోకరంజనతో బాటు మనోరంజన గూడ దీనివలన లభించును. కొంత మంది వ్యక్తులు తమ బిడ్డల పేర్ల విషయములో పశుపక్ష్యాదుల పేర్లు సూచించుచున్నారు. ఇవి కేవలము ఆధునిక కాలమున మాత్రమే జరుగుచున్నది.

| | | |
|---|---|---|
| చిలకమ్మ | గజలక్ష్మి | గజేంద్ర |
| కుక్కుటేశ్వరరావు | ధనలక్ష్మి | అశ్వత్థామ |
| భుజంగము | చారులత | టైగర్ |

## ఆభరణ సూచకాలు :

మన నిత్య కృత్యములో వేషధారణ యందు విపరీతముగా ఆసక్తి చూపుచున్నాము. ఆసక్తితోబాటు మరెన్నో ఆభరణములను

ధరించినారు. మన పూర్వీకులు. నిజానికి మనము నేడు ధరించే ఆభరణములు చాలా తక్కువ. జానపద సాహిత్యము నందలి కాటమరాజు కథయందు జానపదులు పాడిన నగల పేర్లు వింటే మనకు ఆశ్చర్యము కలుగును.

ముత్యము, ముత్యాలు చంద్రి-చంద్రిమ్మ, చంద్రిన్న
నీలిమ-నీలమ్మ, మరకతం మాణిక్యము, మణెమ్మ
రత్నం కనకము వజ్రాలు.

మొదలగునవి మనము పేర్లుగా సూచించడం జరుగుచున్నది.

కాల సూచకాలు :

కాలమును సూచించేవి గూడా మనకు పేర్లతో కనబడుచున్నవి. ఇవి కేవలము ఆధునిక కాలమున పేర్లు నవీనముగా నూతనముగా యుండాలనే తలంపుతో సూచించుచున్నారు. ఇందు పూర్తిగా ప్రకృతి నిమిడియున్నది.

| | | | |
|---|---|---|---|
| కార్తిక్ | కార్తికము | శరత్ | శరత్కాలము |
| శ్రావణ్‌కుమార్ | శ్రావణము | శిశిరబాబు | శిశిరకాలము |
| ఉష, ప్రభ, | రజని, | సంధ్య, | చంద్రి మొ॥ |

నక్షత్ర సూచకాలు : ఇవి గూడా నూతనత్వం కోసమే వాడబడుచున్నది. గాని కొన్ని పర్యాయములు ఆయా వ్యక్తులు ఆయా నక్షత్రి రాసులలో జన్మించు చున్నందువల్లన కూడా కొందరు తమ బిడ్డలకు ఆయా నక్షత్రిములను పేర్లుగా సూచించడము జరుగుచున్నది.

| | | | |
|---|---|---|---|
| అశ్వణి, | భరణి. | ఆరుద్ర, | అనూరాధ |
| ఉత్తర, | రోహిణి, | రేవతి, | స్వాతి |

మహర్షుల సూచకాలు : మన ఆధ్యాత్మిక వ్యవస్థయందు ప్రతీ వంశమునకు ఒక మహర్షి అధిపతిగా యున్నాడని నమ్మిక. అంతేగాక

ఆ మహర్షి పరముగా ఆయా వంశములకు గోత్రనామములుగా పరి గణించారు. తత్ఫలితముగా ఆయా వ్యక్తుల కుటుంబముల వారు తమ పుట్టిన బిడ్డలకు ఆయా మహర్షుల పేర్లను సూచించడము జరుగుచున్నదీ. అంతేగాదు కొన్ని పర్యాయములు ప్రతిష్టగన్న ప్రతివతల పేర్లను గూడా సూచించడము జరుచుగున్నది.

| | | |
|---|---|---|
| దూర్వాసుడు | వశిష్టుడు | భార్గవుడు |
| అనసూయ | సావిత్రి | అరుంధతి |
| అహల్య | దమయంతి | ద్రౌపది |

పై నుదహరించిన పేర్లు నేడు ఎక్కువగా దళిత, నిమ్నజాతుల యందు మాత్రమే గానవచ్చుచున్నవి.

<u>నదుల సూచకాలు :</u> మానవ జీవనం కొరకు అత్యంత ముఖ్యమైనది జలము. ప్రపంచ మంతయు గూడా జలరాశి మీదే ఆధారపడి యున్నదనడములో ఆశ్చర్య పడనక్కరలేదు. భగవంతుడు సృష్టిని సృష్టించేముందు ఈ మండల మంతా జలముచే ఆవృతమై యున్నది. అందువలన వేదకాలమునుండి మనవారు నదీమతల్లులను ప్రకృతిలో నొక మూర్తిగా భావించి, పూజించడము జరుగుచున్నది. ఆ నదీమ తల్లుల పేర్లను గూడా పరిగణన లోనికి తీసుకొనుచున్నారు.

| | | |
|---|---|---|
| నర్మద | గౌతమి | కృష్ణవేణి |
| జాహ్నవి | గోదావరి | గంగ |
| యమున | సరస్వతి | కావేరి |

ఇందు ఉద్దేశ్యము అదే అయినప్పటికిని ఆధునిక కాలమున నేడు కేవలము నూతనత కోసమే వాడుచున్నారు.

<u>చారిత్రిక సూచకాలు :</u> ఇతిహాసములతో, చిత్ర విచిత్రమైన స్థల

పురాణములతో నిండియున్న కర్మభూమి మన భారతదేశము. అంతే గాదు అతి ప్రాచీనకాలము నుండి గూడా మనకు ఎంతో చరిత్ర గలదు అని వేదాలు చెప్పుతున్నాయి. పంచమ వేదములనదగిన మహాభారతము, భాగవతము జన్మించిన దేశము ధర్మము కోసము, సత్యవాక్య పరిపాలన కోసము, ఆడిన మాట నిలబెట్టుట కోసము తన సమస్త రాజ్య సంపదలను, చివరకు ఆలుబిడ్డలను గూడా అమ్ము కుని చివరకు కాటి కాపరిగా నిలిచిన హరిశ్చంద్రుడు జన్మించిన దేశము. తండ్రి కోసము రాజ్యమును త్యజించి 14 సంవత్సరములు అరణ్యవాసము చేసిన శ్రీరామచంద్రమూర్తి జన్మించిన దేశము. ధర్మ సంరక్షణార్థము కొరకు అవనియందు అవతరించి తన లీలా వినో దములతో అలరింపజేసిన శ్రీకృష్ణ పరమాత్మ జన్మించిన దేశము. దేశప్రజల ఔన్నత్యము కొరకు శంకరాచార్యులు, ఆధర్వణాచా ర్యులు, వివేకానంద, రామకృష్ణ పరమహంస లాంటి మహనీయులు గన్న దేశము. అంతటి మహానుభావుల వ్యక్తిత్వాలను, తమ పిల్లలకు సంక్రమించాలని ఆశించి తల్లిదండ్రులు నామకరణము జరుపు చున్నారు.

| | | |
|---|---|---|
| హరిశ్చంద్ర | దుష్యంత | శ్రీరామచంద్ర |
| శ్రీకృష్ణ | అంబరీష | దిలీపుడు |
| వివేకానంద | పరమహంస | శంకరాచార్య |

అంతేగాదు. నేటి రాజకీయ వ్యవస్థయందు దేశాన్ని పాలించి ఘనత వహించిన వార్ల పేర్లు, ఆధ్యాత్మిక సంపన్నుల పేర్లుగూడా పరిగణన లోనికి తీసుకొనుచున్నారు.

| | | |
|---|---|---|
| గాంధీ | నెహ్రూ | వివేకానంద |
| రాణీసంయుక్త | రుద్రమదేవి | అశోకుడు |
| అక్బరు | స్టాలిన్ | గోర్కి |
| లెనిన్-ఠాగూర్ | | వినోబాభావే |

ఇటీవల కాలమున మన ప్రియతమ నాయకుల పేర్లు గూడా సూచించడము జరుగుచున్నది.

| | |
|---|---|
| ఇందిర | ఇందిరాదేవి |
| సంజయ్ | సంజయ్‌కుమార్ |

సాంఘిక సూచకాలు : సాంఘిక వ్యవస్థ జీవితమునకు అద్దమువంటిది. మనిషి సంఘపరముగనే జీవించుచున్నాడు. సంఘమును ఎదిరించి ఎవడునూ జీవించలేడు. అందువల్లనేమో ప్రాచీన కాలమున మనిషికి మరణ శిక్షకంటె కఠినమైనది, సంఘ బహిష్కార శిక్షను విధించేవారు రాజులు. నాడు గ్రామములు స్వయం పోషకములు గాని నేడు గావు. సంఘము అవసరము లేకుండా ఏ వ్యక్తి జీవించలేడు. కొన్నింటిని మాత్రము తీర్చుకోగలడు. కొన్ని ఇతరులమీద ఆధారపడవలసి యున్నది.

ఉదాహరణకి మంగలివాడు అందరికి క్షురకర్మను చేయగలడు. తనకు మాత్రము క్షురకర్మను ఇంకొకరు చేయాలి. అందువల్ల నాటి సాంఘిక వ్యవస్థయందు కొన్ని పనులను కొంతమంది మాత్రమే చేయుట వల్లన అప్పటినుండి మనకు కులవ్యవస్థ నేర్పడింది.

కుల సూచకాలు : మహాభారతము నందు వేదాలయందు గూడా మనకు కులవ్యవస్థ యున్నట్లు తెలియుచున్నది. యుద్ధమునకు క్షత్రియులు, వర్తకమునకు వైశ్యులు, శ్రోత్రీయులకు ద్విజులు, పరిచర్యలకు శూద్రులున్నట్లుగా తెలియవచ్చినది.

రాజు : క్షత్రియులకు సంబధించిన బిరుద వాచకము. ఉన్నతుడు, దైవాంశ సంభూతుడు, అనే అర్థములో ఉన్నది. పూర్వులు వీరోచిత కార్యములును, దేశమును పాలించేనొక తెగవారిని రాజు అని పిలువ

బడేవారు. కాలక్రమమున ఆ జాతి యంతయును నామము చివర రాజు అని పిలుచుకునేవారు.

వత్సవాయ రాయ జగపతిరాజు
వత్సవాయ బలభద్ర తిమ్మ జగపతిరాజు
పూసపాటి వరహాలరాజు
నంబూరి సీతారామ చంద్రరాజు

ఈ కుల వ్యవస్థయందు విభిన్న శాఖలున్నప్పటికినీ ఇందు సూర్య వంశజులు చంద్రవంశ రాజులు ప్రఖ్యాతులని శాస్త్రములు చెపుతున్నాయి.

ఇటీవల కాలమున ఇతర వర్ణములవారు క్షత్రియులు కాకపోయి నప్పటికినీ వారి పేర్ల చివర రాజులని తగిలించుకొనుచున్నారు.

| | |
|---|---|
| వరహాలరాజు | వైశ్యులు |
| సూర్యనారాయణరాజు | దేవాంగులు |
| నరసింహరాజు | కంసాలి |
| ఆదిరాజు | దళిత నిమ్నవర్ణము |

రావు : మహారాష్ట్ర సంప్రదాయమునకు చెంది తెలుగుదేశమున స్థిరపడి విశేషప్రచారము నొందిన శ్రేష్టార్థకము. ఇది రపుతు-రాతు-రావుగా నిఘంటుకులు నిర్ధారించిరి. ఆంధ్ర మహాభారతమున "రావు తనంగ రాహుః తండగ (ఆది. 2-203)" రావు శబ్దమునకు ప్రయోగము గూడా కలదు.

నేటి వెలమ దొరలు రావు శబ్దమును తమతమ కుటుంబనామములుగా వాడుకొనుచున్నారు. మహారాష్ట్ర శివాజీ కాలమున బాలాజీరావు, విశ్వనాధరావు మొదలగువారు ప్రఖ్యాతిగన్న సంగతి పాఠకులకు తెలిసిందే అదియును గాక ఇటీవల కాలమున పిఠాపురం

జమీందారులు (శ్రీ) రావు మహీధర గంగాధర బహదరువారు దేశ ప్రఖ్యాతి చెందిన విషయము మనకు తెలిసినదే.

శెట్టి : వైశ్య కులమునకు చెందినవారిని మాత్రమే పిలుచుదురు. గాని నేడు వ్యాపారమును చేయు ప్రతివారిని శెట్టిగానే పిలువబడు చున్నారు. పూర్వము వీరు విచిత్రమైన వేషధారణ గల్గియున్నారు.

నల్లటి శరీరఛాయ, చిఱుబొజ్జ, పొట్టి స్వరూపము, గంభీరమైన స్థూలకాయము, చిన్నగా పంచి కట్టుకుని మెడచుట్టూ సన్నని తువ్వాలు వేసుకొని. నుదుటిమీద నిలువు నామములతో యుండెడి వారు. అటువంటి వేషధారణ చింతామణి నాటకమునందు వేసే సుబ్బిశెట్టి పాత్ర మనకు పరిచయమే. గాని ఇటీవల నేడు అటువంటి వేషధారణ లేక పోయినప్పటికినీ, వారిని శెట్టిలనే పిలుచుచున్నారు.

రంగనాయకులు శెట్టి, సుబ్బరాయ శెట్టి, అప్పి శెట్టి

ఇది కేవలము కులవాచకము మాత్రమే.

చౌదరి : ఇదియును మహారాష్ట్ర సంప్రదాయము నుండి తెలుగు దేశమున స్థిరపడిన విశేషణము. పరగణాకైననూ. గ్రామమున కైననూ, పెత్తనదారుగా నుండెడి కాపు లేక సంరక్షకుడు. వీరినే చౌదరి అందురు.

శివాజీ కాలమున దేశ సంరక్షణము కొరకు చౌత్, సర్దేశ్ అను పన్నులు వసూలు చేసినట్లు మనకు చరిత్రకారులు తెల్పుతున్నారు. ఈ పన్నులకు వసూలు చేయుటకు కొన్ని ప్రత్యేకమైన అధికారములు గల్గిన అధికారులుండేవారు. వారిని చౌత్ దార్, అని పిలువబడేవారు. వారు మోతుబరులుగా నుండి పన్నులు వసూలుచేసి ప్రభుత్వాధినేతకు పంపించేవారు. వారే కాలక్రమమున చౌద్ దార్ చౌదర్ చౌదరిగా స్థిరపడినారు.

నిఘంటుకులు కమ్మవార్ని చౌదరిగా పిలుచుచున్నారు. కాకతీయుల కాలమున పన్నులు వసూలు చేసే వార్ని గూడా చౌదరి అనినట్లు తెలియుచున్నది. తదుపరి చౌదరి బిరుదవాచకముగా, ఆ తదుపరి వంశనామముగా వాడబడుచున్నది.

| | |
|---|---|
| బలరామయ్య చౌదరి | సీతారామయ్య చౌదరి |
| సత్యనారాయణ చౌదరి | సత్తిరాజు చౌదరి |

<u>రెడ్డి :</u> ఇదియును మహారాష్ట్ర సంప్రదాయమునుండి తెలుగులో స్థిరపడిన అన్యదేశ్య విశేషణము. దీనిని నిఘంటుకులు గ్రామాధికారులు, కాపులలో నొక తెగవారుగా సూచించారు.

మొదట రట్టడి - రెడ్డె - రెడి - రెడ్డిగా భాషాపరిణామము చెందినది, అని భాషాశాస్త్ర పరిశోధకులు తెలియచేసినారు. తొలుత వీరు గ్రామనాయకులుగా నుండి వ్యవసాయ ఆధారముతో గ్రామ సంరక్షకమును చేసెడివారు. ఇది కేవలము బిరుదవాచకము. ఆ తదుపరి వంశీయులకు రెడ్డిగా పేర్లతో వాడబడుచుండెను.

| | | |
|---|---|---|
| నరేంద్ర రెడ్డి | - | జగన్మోహన రెడ్డి |
| బలరామ రెడ్డి | - | శివా రెడ్డి |
| ఈశ్వర రెడ్డి | - | బ్రహ్మానంద రెడ్డి |
| సంజీవ రెడ్డి | - | బంక్ష గోపాల రెడ్డి |

<u>కాపు :</u> ఇది కేవలము కులవాచకము. దీని అర్థము రక్షణ. అనగా పైరును రక్షించేవాడు అని అర్ధము. అయితే తెలంగాణా ప్రాంతమున ఇది కులవాచకముగా నున్నది. ఇది కేవలము వ్యవసాయదారులకు మరియు ఇతరులకు కులవాచకముగా నుపయోగించుచున్నారు. ఇందు విభిన్న శాఖలున్నట్లుగా తెలియవచ్చుచున్నది.

తూర్పు కాపులు, పడమటి కాపులు. తూర్పునకు పడమటినకు ఎంతటి భేధమున్నదో ఈ కాపులందును ఆచార వ్యవహారములు, సంప్రదాయములు, సాంఘిక వివాహ వ్యవస్థయందును అంతటి భేధసాదృశ్యము గలదు.

నాయుడు : నాయక శబ్ద భవమునుండి పుట్టబడి చివరకు కులవాచకముగా స్థిరపడినది. ఇది ఎక్కువగా శ్రీకాకుళము, విశాఖపట్నము, ప్రాంతమున సంబోధనావాచకముగా నిలిచినది. చిత్తూరు, తమిళనాడు ప్రాంతములందలి కాపు కమ్మవార్ని గూడ నాయుళ్ళుగా వ్యవహరింపబడుచున్నారు. ఇది కేవలము బిరుదవాచకము, లేదా గౌరవ వాచకము. ఇటీవల కాలమున శూద్రులలో కొందరి నామాంతమున గూడా నాయుడు శబ్దము కనబడుచున్నది.

| | |
|---|---|
| సత్తెయ్య నాయుడు | రంగయ్యనాయుడు |
| వెంకయ్యనాయుడు | రామానాయుడు |

తొండ ముదిరి ఊసరివెల్లి సామెతను అన్వయించునట్లుగా ఆర్థిక సామర్థ్యమును గల్గిన కొందరిని నాయుడుగా వ్యవహరిస్తారు.

ఇతరములు : ఆచార్యులు, సిద్ధాంతి, శాస్త్రి, శర్మ, సోమయాజి ఇత్యాదుల పేర్లు గూడా మనకు కనబడుచున్నవి. ఇవి కేవలము బిరుద నామములు. వారి వారి పాండిత్య ప్రకర్షకు చిహ్నాములుగా రాజులచే, సంస్థానాధిపతులచే సన్మానించబడి బిరుదులు పొంది యున్నారు. తదుపరి వారి వంశీయులు ఆ బిరుదములను నామములుగా స్వీకరించుచున్నారు.

ఉదాహరణకి మహాభారత నిర్మాణకర్త తిక్కనామాత్యుడు యజ్ఞము చేయుట వలన సోమయాజి అను బిరుదు నొందెను. ఆ తదుపరి వారి వంశీయులు అంతా సోమయాజులుగానే పిలువ బడుచున్నారు.

1. వైద్యము, దైవారాధన చేసేవార్కి - రామానుజాచార్యులు, విమగ్యరాచార్యులు
2. పంచాంగ శ్రవణము చేసేవార్కి - రామలింగ సిద్ధాంతి
3. విద్యాదానము చేసేవార్కి - మల్లినాధశాస్త్రి (సూరి)
4. యజ్ఞము చేసేవార్కి - తిక్కన సోమయాజి

అంతే గాకుండా ఆంధ్రదేశమున సమీపమున నుండు ఇతర ప్రాంతములనుండి గూడా జనులు, ఈ ప్రాంతమున నివసించుటచే ఆయా జనుల ఆచార వ్యవహారములు వారు అవలంబించుచూ, ఇతరులచే అవలంభించు చున్నందు వల్లన కొత్త శాఖలేర్పడినవి.

1. తమిళ సంప్రదాయమునకు చెందిన అళ్వారు స్వామి, అళ్వారయ్య, వరదరాజన్.
2. కన్నడ సంప్రదాయమునకు చెందిన నంజుడప్ప, బసవప్ప, బసవయ్య.
3. మహారాష్ట్ర సంప్రదాయమునకు చెందిన రామోజీ, అన్నాజీ, అప్పాజీ.

పై నుదహరించిన సంప్రదాయముకల వ్యక్తులు మనదేశమునకు ఇతర ప్రాంతములకు చెందినవ్పటికినీ, ఆచార వ్యవహారములు అవలంభించుచూ మనకు కనబడుచునే యున్నారు.

గుణ సూచకాలు : గుణమును సూచించేవి అనగా స్వభావమును లేక ధర్మమును గాని సూచించేవి. ఇవి కేవలము వ్యక్తుల యొక్క గుణగణములను సూచించేవి. ఆయా వ్యక్తుల ఆయాగుణములకు చెంది యున్నట్లయితే ఆయా వ్యక్తులకు గుణములను సూచించిన పేర్లు పెట్టు కోవడము చూస్తున్నాము.

పేరులో ఏమున్నది పెన్నిధి అని మన వారు పేరున కంటె

గుణమునకు ప్రాధాన్యతను ఇచ్చి యున్న సంగతి మనకు తెలిసినదే. నమ్రతతో మంచి నడవడి కలవాడ్ని, సుబుద్ధి గుణరాము, గుణనిధి పాతివ్రత్యము సదాచార శీలసంపదకలవార్ని, సావిత్రి, పార్వతి అనసూయ. అలాగే శరీర రంగు వర్ణములను బట్టిగూడా పేర్లు పిలువ బడుచున్నాయి. శరీర రంగు ఎఱ్ఱగా నున్నవారిని ఎఱ్ఱమ్మ, ఎఱ్ఱయ్య అట్లాగే అరుణ, అరుణమ్మ, బంగారయ్య, బంగారమ్మ, నీలయ్య నీలమ్మ ఇత్యాదులుగా శరీర ఛాయలను బట్టి పేర్లు నుదహరించడము జరుగుచున్నది.

సాధారణముగా పేరునకు, ఆ పేరుతో పిలువబడుచున్న వస్తువునకు వ్యక్తులకు సంబంధ ముంటుందని శాస్త్రజ్ఞుల అంచనా. అటు పాశ్చాత్యదేశాల యందునూ ఇటు భారతీయ శాస్త్రజ్ఞుల యందునూ ఇటువంటి అంచనా గలదు. అయితే గొన్ని సందర్భముల యందు, ఈ అంచనా సరిగాదు అని కొన్ని సంఘటనల యందు ఋజువగుచున్నది.

ముఖ్యముగా వ్యక్తుల పేర్ల విషయమున నొక వ్యక్తి మంచి స్ఫురద్రూపిగా నుండి ఎఱ్ఱగా బంగారు కాంతితో మిలమిలా మెరిసే వాడిని ఎఱ్ఱయ్య, బంగారయ్య అని పేర్లు పెడుతున్నారు. అతని విషయమున ఆ పేరు సమర్థనీయము. అనంతర కాలములో వారి సంతతి వారు ఆయా రంగులో లేకపోయినా పూర్వీకుల జ్ఞాపకార్థము అవే పేర్లు పెట్టుకును చున్నారు. అంతేగాదు మనకు కనబడు చున్నారు. కనుక వ్యక్తి యొక్క శరీర వర్ణానికి గుణగణములకు ఎల్లవేళలా సంబందముంటుందని చెప్పలేము.

తదుపరి పెంటయ్య, పెంటమ్మ పేర్లు మనకు తఱచు వినబడుచున్నవి. పిల్లలు కలిగి, అస్తమానూ మరణించుచున్న ఎడల ఆ తల్లిదండ్రులు ఇరువురు కలిసి, ఆ పుట్టిన పిల్లవాడ్ని పెంటదిబ్బమీద

పారవేస్తారు. వెంటనే ఆ పక్కనే యున్న మంత్రసాని ఆ పిల్లవాడ్ని తీసుకొని, ఆ తల్లిదండ్రుల దగ్గరికివచ్చి అమ్మా! ఈ పిల్లవాడు అనాధ. వీడిని పెంచుకోండి అని తిరిగి ఆ తల్లిదండ్రులకు దానము చేస్తాది. దాన కట్నము ఇచ్చుకొని ఆ పిల్లవానిని పెంచుకుంటారు. ఇవి కేవలము జానపదుల మూఢ నమ్మకము మాత్రమే. ఆ పిల్ల వానికి పెంటయ్య, పెంటమ్మ అని పేర్లు పెడతారు. అబద్ధయ్య, అబద్ధమ్మ అన్న పేర్లు గూడా యీ కోవకు చెందినవే.

అంతే కాదు శరీరాకారమును బట్టి, పొట్టి, పొడుగు, లావు, బారు పెద్ద, చిన్న పొట్టి బుల్లి, ఇత్యాదులుగా కొంత మందిని పిలుచు చున్నారు. ఒకే పేరుగల వ్యక్తులు ఇరువురు యున్న ఎడల ఆయా వ్యక్తుల శరీరవర్ణమును బట్టిగాని ఆకారమును బట్టిగాని పిలవడము జరుగుచున్నది.

పెద్దమల్లికార్జునరావు - చిన్నమల్లికార్జునరావు
పొట్టి అప్పన్న - పొడుగు అప్పన్న

కొందరి వ్యక్తుల గుణగణములకు, వారి పేర్లకు ఏ మాత్రము సంబంధము లేనివిగా గనబడుతున్నాయి. అంతేగాదు వ్యతిరేకతగా నుంటున్నాయి.

ఉదాహరణకి :

కాలెపు సుందరి : పళ్ళు ఎత్తుగా, ఉబ్బు ముఖముతోనుండును.
పంచాగ్నుల ఆరోగ్యము : నిత్యము అనారోగ్యముతో బాధ పడును.
మానెం సరస్వతి : చదువురాని మొద్దు, అక్షరజ్ఞానము లేదు.
బళ్ళ సత్యం : అబద్ధాల కోరు, కోతలరాయుడు.
కంచర్ల ఆనందము : జీవితమంతా విషాదముతో నిండినది.

వర్గీకరణ విభాగములో చేరకుండా ఇంకనూ కొన్ని మిగిలినవి. ఇవి కేవలము వ్యక్తిగత వైభవ, మత సాంఘికపరమైన కట్టుబాట్లతో జరుగుతున్నవి.

హిందూమను ధర్మశాస్త్ర ప్రకారము అష్టాదశసంవత్సరములనగా పదునెనిమిది సంవత్సరములు నిండనివారు మైనర్లుగా వ్యవహరించబడతారు. వారు వ్యక్తిగతముగా ఎంత తెలివైన వారప్పటికినీ, చట్టరీత్యా వారికి వ్యక్తిగత స్వేచ్ఛలేదు. అందువల్ల వారికి సంరక్షకులు ఇతరులుందురు. అంటే సమీప బంధువులుందురు. అటువంటి వారిని మొదట్లో మైనరు, మైనరుబాబు అని పిలుస్తారు. అటువంటి వారిని మొదట్లో మేజరైనప్పటికినీ, అతడికి పెద్దలు నిర్ణయించిన పేరున్నప్పటికిని జీవిత చరమదశ వరకూ అతనిని మైనరుబాబుగానే పిలుచుచున్నారు.

ఉదాహరణ : మైనరు రాజా, మైనరు గోపాలము, మైనరుబాబు.

దత్తుడు : ఇదికూడ ఆ వర్గీకరణమునకే చెందుతుంది. సంతతి లేనివారు, వారి వంశము వారితో అంతరించకుండా యుండేందులకు, జ్ఞాతులలో నొకరిని తమ వంశముపేరన చట్టరీత్యా దత్తు చేసుకుందురు. వీరికి పూర్వ పర నామములున్నప్పటికినీ, దత్తుడుగానే నామము ప్రచారము జరగడము విశేషము.

మునసబుగారి దత్తుడు — దత్తుడుగారి అమ్మాయి
దత్తుడుగారి పాప — దత్తుడుగారి అబ్బాయి

యిలాగ ప్రజా వ్యవహారమున గానవచ్చుచున్నది.

కవలలు : మన నిత్యజీవితములో ఒకే కాన్పులో ఇరువురు మూవురు శిశువులు జన్మించడము జరుగుతుంది. కేవలము మనుష్యులలో మాత్రమేగాక పశు పక్ష్యాదుల యందుగూడా జరుగుచున్నది. అలాగ పుట్టిన పిల్లలు కవల పిల్లలననడం జరుగుచున్నది. అలాగే జంటగా పుట్టిన పిల్లలకు పేర్లు పెట్టడములో లయతో గూడినవిగా సూచించుచున్నారు.

| | | | |
|---|---|---|---|
| రాముడు - భీముడు; | | చాణుక్యుడు - చంద్రగుప్త; | |
| రామయ్య - లక్ష్మయ్య; | | గీత్ - సంగీత్; | |
| జయ - విజయ; | | పప్పీ - లల్లీ; | |

కవలయందు సాధారణముగా ఇరువురు ఆడపిల్లలుగానూ, మగపిల్లలుగానూ జన్మిస్తారు. కొన్ని అసాధారణ సందర్భముల యందు ఒక ఆడశిశువు, ఒక మగశిశువు ఇరువురు కవలలుగా జన్మించడము జరుగుచున్నది. ఉదా : రామయ్య - లక్ష్మమ్మ

ముద్దుపేర్లు : మానవ జీవితావస్థయందు బాల్యదశ వరప్రసాదము లాంటిది. నిత్యజీవితమున నెదురయ్యె నెన్నియో సంఘటనలకు అతీతమైనది. అటువంటి బాల్యదశయందు తమ తల్లిదండ్రులు తమ తమ పిల్లలకు ముద్దు ముచ్చటలు చేస్తారు. సాంప్రదాయము ప్రకారము ఆ వ్యక్తి నామకరణము జరిగినప్పటికినీ, ఆతని తల్లిదండ్రులు ఆ పిల్లవాని పేరు కత్తిరించి వాడడము జరుగుతుంది. అటువంటి పేర్లను ముద్దుపేర్లందురు.

| | |
|---|---|
| ఇందుమతి - ఇందూ; | విశ్వనాథ్ - విస్సూ; |
| సరోజ - సరూ; | శారదా - శారు; |
| నీరజ, నీలిమా - నీలూ; | మల్లేశ్వరరావు - మల్లి; |

ఇటువంటివి మన నిత్య జీవిత వ్యవహారమున నెన్నియోచూపవచ్చును.

మారుపేర్లు : అంతేకాదు, మరొక ముఖ్య విశేషము. తల్లి దండ్రులు పెట్టిన పేర్లు, వయస్సు పెరిగిన తరువాత వారికి ఆ పేరు నచ్చకపోయిన ఎడల, లేదా మరో కారణముచేత అంటే ఆ పేరు మరీ పెద్దదిగా యున్నఎడల, ఆ పేరును వారు మార్చుకొని మరొక పేరు నుంచుకొవడము జరుగుతుంది చివరకు వారి అసలు పేరు

మరుగున పడిపోయి మారుపేరుతో మాత్రమే రాణించి ఖ్యాతి గడించ డము జరుగుచున్నది.

ముచ్చటగా సినిమా రంగం చూద్దాము.

సుజాత జయసుధగా - లలితారాణి జయప్రదగా
ప్రమీల దేవికగా - సుజాతారావు శ్రీధర్‌గా
మారుపేర్లతో స్థిరపడినారు.

<u>అజ్ఞాత నామములు</u> : అజ్ఞాత నామములు లేదా రహస్య నామములు ఇటీవల కాలమునేగాక, పూర్వకాలమునుండి గూడా వాడుకలో గనబడుచున్నవి. పూర్వకాలమున మహారాజులుగాని రాజవంశీకులు గాని లేదా ప్రస్తుత నేటి రాజకీయనాయకులు గూడా అజ్ఞాత రహస్య జీవితములు గడుప వలసి వచ్చినపుడు తమ అసలు పేర్లకు బదులుగా మరియొక పాత్రోచితమైన పేరును వాడుచుండెడివారు. దీనికి ఆధారము మహాభారతమునందే గలదు. పాండవులు అరణ్యవాసము గడిపి అజ్ఞాతవాసము విరటుని కొలువులో గడుపవలసి వచ్చినపుడు తారుమారు పేర్లు సూచించుకోవడము జరిగినది.

| | | |
|---|---|---|
| ధర్మరాజు | మారుపేరు | కంకుభట్టు |
| భీముడు | " | వలలుడు |
| అర్జునుడు | " | బృహన్నల |
| నకులుడు | " | దామగంధి |
| సహదేవుడు | " | తంతీపాలుడు |
| ద్రౌపది | " | సైరంధ్రి |
| జాతీయ ఆచార్య యస్.వి.జోగారావు | | యస్వీ |
| భాగవతుల శంకరశాస్త్రి | | ఆరుద్ర |
| శివరాజు వెంకటరాజు | | బుచ్చిబాబు |
| గుడిపాటి వెంకటాచలం | | చలం |

| | |
|---|---|
| చెలుకూరి సుబ్రహ్మణ్యేశ్వరరావు | వడ్డెర చండీదాస్ |
| శాపీ ధర్మారావు | శాత్రాజీ |
| శ్రీరంగము శ్రీనివాసరావు | శ్రీ శ్రీ |
| బండ్ల గోపాల రెడ్డి | బంగోరె |
| సి. నారాయణ రెడ్డి | సినారె |
| గోగినేని రంగనాయకులు | యన్. జి. రంగా |

అంతులేని సాహిత్యములో చాలా మంది రచయితు్రిలున్నారు. వారి వారి పేరు మీద గాక కలము పేరు మీందనే ఖ్యాతినొందారు.

జలసూత్రం రుక్మిణి శాస్త్రి, జరుక్ శాస్త్రి ఇంకనూ ఎందరో యున్నారు. అందరిని సూచించడము జరగదు. సాహితీ ఉద్యమమున దిగంబర కవులనే వారు చివరిరోజులలో ఉద్యమించారు. వీరు పాత బడిన బూజుపట్టిన సంప్రదాయమును తుడిచిబెట్టి నేటికాలమునకు సహజమైన, చురుకైన సాహిత్యముమ గావాలని వాంఛించారు. అందులకనుగుణముగానే తమ పేర్లకుమారు పేర్లను వ్యవహరించారు.

నిఖిలేశ్వర్ జ్వాలాముఖి చెరబండరాజు

<u>వెక్కిరింత పేర్లు</u>: నిందాపూర్వకముగాని, అపహాస్య పూర్వకముగా గాని, ఒక వ్యక్తికి మారుపేరు సూచిస్తే, అటువంటి పేర్లను వెక్కిరింత పేర్లుగా లెక్కకట్టవచ్చును.

కవి సార్వభౌముడు శ్రీనాథుడు శ్రీహర్షుని హర్షనైషధమును తెలుగులో శృంగార నైషధ కావ్యముగా రచిస్తే, సాంస్కృత లాక్షణికులు అతనిని "డుమువులు పండితుడు శ్రీ నా థు డు" అని అపహాస్యంగా ప్రశంసించారు.

అమెరికా వారు నూతన పరిగండమును సృష్టించి అది మనదేశ

మున ప్రయోగాత్మకముగా ప్రవేశ పెట్టారు. ఆ సందర్భముగా ఐ.ఆర్.టి అను వరిగంధము అధికపంట పండినందువల్ల తమిళనాడు ప్రాంతమందలి నొకరైతు తమకు పుట్టిన బిడ్డకు "ఐర్యాటెట్టు" అని నామకరణము చేసినాడు.

అంతేకాదు ఇటీవల నేటి సమాజములో కొన్ని ఆక్షేపణలతో గూడిన పేర్లు గనబడుచున్నవి.

| | |
|---|---|
| అధికముగా కోతలు కోసేవాళ్ళని | కోతలరాయుడు, సరుకుడు |
| అధికముగా మాట్లాడేవాళ్ళని | వాగుడుకాయ |
| అతిగా తిరిగే వాళ్ళని | రాలుగాయ |

అని వ్యవహారమున గానబడుచున్నది.

సరూప నామములు : (Duplication of Names)

నిత్య సామాజిక జీవితమునందు అనేకమంది వింత వింత వ్యక్తులతో బాటు అనేకరకాలైన పేర్లను గూడా మనము వింటున్నాము. అంతేగాదు ఒకే పేరుగల వ్యక్తులను అనేకమందిని చూస్తున్నాము. వారు విభిన్న ప్రదేశములలో యుంటే ఫరవాలేదు. గాని ఒక ప్రదేశమున ఒకే పేరుగల వ్యక్తులు యున్నపుడు సమాన వయస్కులు యున్నపుడు సంబోధన, మనకు చాలా తరచుగా చికాకు గల్గిస్తున్నాయి.

ఉదాహరణకి మనకు తరచుగ్గా ఎవరో ఉత్తరాలు మన పేరుతో మనకు రావడము ఆ ఉత్తరము చూచి కంగారు పడడము జరుగుచున్నది. అటువంటపుడు సంబోధన వారి వృత్తిపరముగా జరుగుచున్నది.

| | |
|---|---|
| కోమటి వెంకటేశ్వర్లు | కమ్మ వెంకటేశ్వర్లు |
| ఆచారి అచ్యుతము | అప్పడాల అరుణ |

వృత్తిపరముగా పిలవడానికి అవకాశము లేనపుడు కొన్ని సందర్భముల యందు వారు నివసిస్తున్న ప్రదేశమును కూడా పరిగణలోనికి తీసుకుని పిలుస్తారు.

| | |
|---|---|
| జావికాడ బ్రహ్మయ్యా | చెఱువు సుందరరామయ్యా |
| కోవెల కుటుంబయ్యా | మసీద్ మస్తాన్ |
| బడి భీమన్న | గుడికాడ రాఘవయ్యా |

కవి సార్వభౌముడు శ్రీనాథుడు తన చాటువులో గుడిలోపల నుంచి వారి కోడలితోన్" అన్న ప్రయోగము గానవచ్చుచున్నది.

అట్లు గాక కొన్ని సందర్భములలో ఇరువురు సమాన వయస్కులయి, ఇరువురు ఒకే పేరుగల వారయితే అటువంటి వారితండ్రిని పరిగణనలోనికి తీసుకుని సంబోధన చేయుచున్నారు.

| | |
|---|---|
| చెంచయ్యగారి గురవయ్యా | నారాయణగారి గురవయ్యా |
| బాబ్జిగారి కమల | చంటమ్మగారి కమల |

అంతేగాదు కొంతమంది వ్యక్తులు నొక గ్రామమున స్థిరనివాసముండి కొన్ని కారణాంతరముల వలన మరియొక గ్రామమునకు వెళ్ళి స్థిరపడుదురు. ఆ కారణమున వారి ఇంటిపేరునకు మారుగా వారు ఏ ప్రాంతమునుండి వచ్చిరో ఆ ప్రాంతము ఇంటిపేరుగా జనులు లోకవ్యవహారమున పరిగణించుచున్నారు.

| | |
|---|---|
| గుడివాడ సూర్యారావు | అరట్ల అప్పారావు |
| గుడివాడ అబ్బులు | అరటి కోట్ల సూర్రావు |
| కాకినాడ అప్పారావు | ఉప్పాడ ఉమాకాంతం |
| కలకత్తా సూర్యనారాయణ | పెద్దాపురం పైడితల్లి |

ఇందు మొదట నుదహరించిన పేరు కేవలము గ్రామనామము మాత్రమే. తదుపరి ఆ గ్రామ నామము ఇంటి పేర్లుగా మారిపోయినవి.

ఆధునిక సూచకాలు : ఆధునిక యుగంలో మరీ విచిత్రాతి విచిత్రమైన పేర్లు కనబడుతున్నాయి. ఇవి కేవలము ఆఫీసు వ్యవహారాలల్లో కనబడుతున్నది.

ఒక ఆఫీసుయందు అనేకమైన విభాగాలుంటాయి. అనేక వేల మంది కార్మికులు పనిచేస్తుంటారు. ప్రతీ వ్యక్తికి విధిగా నొక పేరు యుంటుంది. యజమానిగాని సంబంధిత అధికారి ఒక వ్యక్తిని పిలవాల్సి వచ్చినపుడు ఒకే పేరుగల వ్యక్తులు అనేకమంది యుందురు. అందులోనూ నిర్దిష్టమైన వ్యక్తిని పిలవాలన్నపుడు చాలా కష్టము. అందువల్లన అటువంటి వాతావరణములో అతడు చేస్తున్న పని స్థానాన్ని బట్టి పిలవడము జరుగుతుంది.

నిత్యము మనము చూచే కలక్టరు ఆఫీసునందు ఉద్యోగులు బి4, సి3, ఎ6, అని పిలుస్తారు. మరొక విశేషణము అదే ఆఫీసులో ఇరువురు ఒకే పేరుగల వారు యున్నపుడు ఎ5-రామారావు, బి2-రత్నమాల, సి3-సుబ్బారావు అని పిలవడం జరుగుతుంది.

అట్లా గాక ఒకే పేరుగల వ్యక్తులు ఇరువురున్నపుడు ప్యూన్ అప్పారావు లేదా క్లర్కు అప్పారావు అని వృత్తిపరముగా పిలవడము జరుగుచున్నది.

పోలీసుల్ని 202, 303, 421 అని పిలవడము జరుగుతున్నది. అలాగే ఎస్ ఐ, సి.ఐ, డి.యస్.పి. అని పిలుస్తారు. తప్పవార్ని పేర్లతో మాత్రమే పిలవరు ఇట్లాగే వర్గీకరణము చేస్తూపోతూ యుంటే అంతు లేని సాహిత్యమున ఇంకనూ ఎన్నో వింతలు విడ్డూరములు కనబడుతూ యుంటాయి అన్నింటిని చూపించడము సాధ్యము కాదు.



# జానపదుల తిట్లు - శాపనార్థములు

అబ్యూజ్ అన్న ఆంగ్ల పదమునకు సమానార్థకముగా తెలుగున తిట్టు - శాపనార్థము అని తెలియుచున్నది. ఆంగ్లమున శాపమును కర్స్ అని అందురు, దానినే టు ఇల్ ట్రీట్, ఇంప్రాపర్ ట్రీట్‌మెంట్ అని క్రియా పదములుగల రూపములుగ తెలియజేయుచున్నారు. తెలుగున తిట్టునకు నిందించుట, శపించుట అనే అర్థమును నిఘంటుకారులు గూడ చూపుచున్నారు. దక్షిణ భారతము నందలి సమీప భాషలందు, హిందీలో గాలియా అని, ఉర్దూ భాషలో గాలీగలీజ్ అని పిలుచుదురు. హిందీ - ఉర్దూ భాషల మధ్యన పద సామీప్యము, అర్థసామ్యము ఎక్కువగా ఉంటున్నందువల్లన ఎక్కువ తేడా లేకుండా ఉపయోగములు కనబడుచున్నవి. కన్నడమున బైగుళ, తమిళములో వైదుల్, మళయాళమున నిందిక్కు, తుళు భాషలయందు వెరెడ్డైలని తెలియుచున్నది. వివిధ భాషలయందు వివిధ పదములు వాడబడుచున్నను, మొత్తమున భావార్థమున నిందించుట, శపించుట అనే అర్థములో మాత్రమే వాడబడుచున్నవి.

దక్షిణాది భాషలన్నిటి యందును కంటె తెలుగు భాషనందే ఎక్కువగా తిట్లు, జానపదుల భాషలో నిల్చి యున్నవి అని క్షేత్ర పరిశోధన వలన తెలియు చున్నది. ఇతర సమీప భాషలయందు తెలుగు భాషా ప్రభావము, ఇతర భాషల ప్రభావము తెలుగున ఏర్పడి సరిక్రొత్త రకమయిన తిట్లు తెలుగు భాషనందు చోటు చేసుకున్నాయి. బాంచోద్. బద్మాష్, మాదరచోద్, ఫూల్, రాస్కెల్, ఈడియట్ పదములు, తమిళమున వాయాడి, కన్నడమున గండభేరి ఇత్యాదులు ప్రవేశించి జానపదుల నోళ్ళయందు సుస్థిరత నొందినవి. సంస్కృతము జానపదుల భాషనకు చెందినది కాకపోయినప్పటికి

సంస్కృతము ఆనాడు అమితమైన ప్రచారము క్రింద యుండుటయే గాక, జానపదుల వాడుక భాషగ సంస్కృతము ఉన్న రోజులలో తెలుగునందు మూర్ఖ, కులపాతక, ఘాతక, విద్వాంసుడు మొదలగునవి తెలుగు భాషనందు ప్రవేశించి, అన్యభాషా సంపర్కము వల్లన ఏర్పడిన తిట్లేగాకుండ అన్య భాషలతో చేర్చిన తిట్లు కూడ మన తెలుగుభాషనందు ఏర్పడినవి.

తూర్పుగోదావరి జిల్లా నందలి గ్రామదేవతలు, ఆచార వ్యవహారములు అను అంశము మీద ఒక వ్యాసమును సమగ్రముగ తయారు చేయుటకు జిల్లా నందలి అనేక గ్రామములు పర్యటించుచు విషయ సేకరణ చేయుచున్న వేళలయందు గ్రామదేవతలు మశానమ్మ, మొండి జగ్గప్ప, బంగారప్ప, బంగారు పాప మొదలగు దేవతల ఉత్సవములయందు జానపదులు ఆనందముతో ఆ దేవత మీద తిట్ల వర్ణమును కురిపించుచు తమ తమ కోర్కెలను తీర్చమని తిట్టుచున్నారు. ఆ సన్నివేశమును చూచిన తరువాత ఇదేమి వింత అని ఆశ్చర్యపడినాను. దేవతల గురించి పుట్టు పుర్వోత్తరములను సేకరించి గ్రామదేవతలు (భారతి - అక్టోబరు 1989) అను వ్యాసమును ప్రచురించితిని. ఆ సందర్భమున తిట్లు తిట్టడము గూడ ఒక కళే. అయితే ఆ తిట్లు సేకరించాలనే కోరిక కలిగినది. విషయ పరిధిగా తూర్పుగోదావరి జిల్లాను మాత్రమే పరిమితము చేసుకొని, వ్యాసమును రూపొందించితిని.

శిష్ట సాహిత్యమున గాని, జానపద సాహిత్యమున గాని భక్తుడు భగవంతుని ప్రార్థనా పూర్వకముగా ప్రార్థించి తమ తమ ఈప్సితములను తీర్చమని కోరుదురుగాని ఇట్లా కసిదీరా తిట్లను పొందు గ్రామ దేవతలను మొట్టమొదటిసారిగ అక్కడ చూచినాను. గ్రామ దేవతలను తిట్లు ద్వారా రెచ్చగొట్టి తద్వారా తమ తమ కోర్కెలను తీర్చుకుందురు. గ్రామ దేవతల ఉత్సవములలో వ్యక్తుల వేషములు,

మాటలు చేష్టలన్నీ బూతు మాటలతో కూడుకొని ఉన్నాయి. బూతు తిట్టుగూడ ఒక విధముగా పూజా ద్రవ్యమే. నిజానికి మన నిత్య జీవితమున జరిగేది అంతా బూతే గదా. భార్యాభర్తల మధ్య జరిగే రహస్య సంపర్కము బూతేగదా. అది పవిత్రమైనపుడు తిట్టు మాత్రమే బూతు ఎందుకవుతుంది. అందువల్లనే బూతు గూడ పవిత్రమే. ఇట్లాగ గ్రామ దేవతలకు జానపదులు తిట్లు వర్షము చే పూజించే, చేసే ఉత్సవములు కొన్ని జిల్లాలయందు కొన్ని రాష్ట్రముల యందు ఉన్నవి. ఉదాహరణకు ఒక వృద్ధుడు విలపించుచు ముండా దేవుడు నన్నింకా కరుణించలేదు అని అంటాడు. అంటే అతడు తనకు మరణము ప్రసాదించమని భగవంతుని ప్రార్థించు చున్నాడు. అంతే గాని భగవంతుని తిట్టుట లేదు. సరిగదా అతడు భగవంతుని తన కోర్కెను తీర్చమని, తనను కరుణించమని మరీ దీనముగా ప్రార్థించు చున్నాడు.

తిట్టు సామాజిక స్థాయిని సూచించే ఒక అంశము. ఒక వ్యక్తి యొక్క సంస్కారము అతడు ధరించే వేషముకంటే అతడు తిట్టే తిట్టు ద్వారా అతనికి గల సంస్కారము, సహృదయత మనకు తెలియును. తిట్టనివాడు ఎవడు భూమిమీద లేడు ప్రతీవాడు ఎపుడో ఏదో సంద ర్భమున తిట్టును అస్త్రముగా వాడుతున్నాడు. కొందరు సభ్యతగా తిడతారు. మరికొందరు అసభ్యముగా తిడతారు. మరికొందరు అశ్లీల ముగా తిడతారు. ఆ మరికొందరు అశుభ్రముగా తిడతారు. ఇద్దరు రిక్షావాళ్లు తమ బాడుగ విషయములో తిట్టుకునే తిట్లు ఒకరకముగా నుంటే, ఇద్దరు స్త్రీలు పోట్లాడుకునే సమయములో, నీళ్ళు పట్టుకునే సమయములో, జుట్టు పట్టుకొని దెబ్బలాడుకునే సమయములో, ఇద్దరు సవతులు ఘర్షణ సమయములో బిందెలతో దెబ్బలాడుకునే సమయ ములో అశ్లీల, అసభ్యతగా సాహిత్యమును వల్లెవేస్తు యుంటారు. ఆ సాహిత్యమును అంతా యధాతధముగా చెబితే మనకు జుగుప్స

కలుగును. రిక్షావాళ్లు తిట్టుకునే తిట్లకు, ఇద్దరు యువతులు తిట్టుకునే తిట్లకు-ఎంతో వైవిధ్యము, విలక్షణత కన్పించును.

బలవంతుడు బలహీనుడి మీద చెయ్యివేసిన లేదా అన్యాయము చేసిన, ఆ బలవంతుడిని బలహీనుడు ఏమి చేయలేడు. ఎందులకంటే వాడి శక్తిముందు వీడు ఎందుకు కొరగాడు. అందువల్ల తనకు గలిగిన కోపమును. కేవలము తిట్లు ద్వారా తిట్టుకొని, తనకోపమును తీర్చుకుంటాడు. మరొకడు అదేపనిగా తిట్లను తిట్టడములో ఘనుడు. వీడిని చూస్తే ఎంతటివాడికైనా భయమే. అబ్బో! వాడికంటే వాడి తిట్లే భయంకరమురా బాబు!

తిట్లు అన్నీ చెడ్డవి అని చెప్పలేము. కొన్ని ప్రేమతో నిండిన తిట్లు ఉండును. కొన్ని విశ్వాసపాత్రముగా నుండును. కొన్ని హిత బోధనగా, లాలించేవిగా నుండును.

"ఏమిరా సన్యాసీ! ఇంతసేపు బయట ఎండలో ఏమి చేస్తున్నావు. పోయి భోజనము చేయి, ఇది తిట్టుకాదు. ఆప్యాయతతో కూడిన సంభాషణ.

ఇద్దరు భార్యాభర్తలు పోట్లాడుకొంటున్నపుడు ఒక పెద్దమనిషి కలుగ జేసుకొని ఏమిరా! బుద్ధిలేదురా మీకు? సంసారం గొడవలు వీధిలోనికి లాగు కుంటారా. నడవండి లోనికి అని అంటాడు ఆ పెద్ద మనిషి. ఇది కేవలము హితబోధన. "ఒరిని జిమ్మడ! దారికి ఎడమ వైపున నడవరా! ఏ లారీయో, రిక్షాయో గుద్దేయగలదు. ఇది పైకి తిట్టులాగ కనబడుతుంది గాని అంతర్గతముగా చూస్తే పిల్లలను సముదాయించినట్లుగా గనబడుచున్నది.

గ్రామములయందు తిట్లు వర్షములో తిట్లు ఆడేవాళ్ళే ఎక్కువగా ఉపయోగిస్తారు. గ్రామములయందు ఒకరింట పెంటకుప్పనుండి

మరొక స్త్రీ దొంగలించి తన కుప్పయందు కలుపుకున్న వేళలయందు ఒకరి పెంటకుప్పనుండి మరొకరి పెంట కుప్పలకు బదలాయింపు జరిగినపుడు ఆ ఆడవాళ్లు ఇరువురు జుట్టు జుట్టు పట్టుకొని, తన్నుకుంటూ తిట్ల వర్షమును కురిపిస్తారు. ఇక ఆ తరువాత మగవారు బయలుదేరుతారు. వాళ్ల స్థాయికి తగినట్లుగా తిట్ల వర్షము మొదలు పెడతారు. చివరకు మూడవ వ్యక్తి వినలేనంత కర్ణకఠోరముగా వెలువడతాయి. తిట్లు తరువాత బల ప్రదర్శన, కర్రసాము మొదలైనవి. తరువాత ప్రవేశించును. అసలు తిట్లుపదజాలమును విశ్లేషణగ చూచిన అందు కొన్ని ప్రత్యేకమైన అంగములుగా మనకు ద్యోతకమగుచున్నది. తిట్టు బయటకు వచ్చుటకుగల అవకాశములు ఎన్ని ఉన్నవో మనము పరిశీలించుదుము.

1. బలవంతుడయిన ఒక వ్యక్తి బలహీనుడిని కించపరచినపుడు, అతడు ఏమి చేయలేక తిట్లను ఒక సాధనముగా స్వీకరించును.
2. ఎదుటివాడి మీందగల కోపమును తెలియ జేయుటకు కొన్ని కొన్ని వేళలయందు తిట్లే శరణ్యము.
3. ఎదుటి వ్యక్తిని అపహాస్యము చేయవలసి వచ్చినపుడు తిట్ల ద్వారానే వ్యక్తిపరచును. (వ్యంగ్యముగా)
4. ఎదుటి వారి ఐశ్వర్యమును చూచినపుడు ఓర్వలేక పోయిన తిట్లు వచ్చును.
5. ఇద్దరి మధ్యన పోట్లాట మొదలైనపుడు తిట్లతోనే ప్రారంభమగును.
6. అత్తాకోడళ్ళ మధ్య, వదిన, ఆడపడుచుల మధ్యన జరిగే ఘర్షణలు తిట్లతోనే ప్రారంభమగును.
7. ఆత్మగౌరవము దెబ్బతిన్నపుడు అవతలి వ్యక్తిమీద తిట్లతో విరుచుకు పడతాడు.

8. స్త్రీ తన శీలమునకు భంగము కలిగించే పరిస్థితి ఏర్పడినపుడు ఆ స్త్రీ తిట్ల వర్షముతోనే పరిస్థితిని ఎదుర్కొనును.

9. ఆఫీసులయందు తోటివాడు తనకంటే ఉన్నతస్థితికి వెళుతుంటే చివరకు వ్యంగముగా తిట్లే శరణ్యము.

తిట్టు అనునది సర్వకాలముల యందును అందరికీ ఒకే ఆయుధము వంటిది. జానపదుల సాహిత్యమున తిట్లకు కొదువ లేదు అనుకుంటే శిష్టసాహిత్యమున గూడా తిట్టునకు అత్యంత ప్రాముఖ్యత సంతరించుకొన్నది. తిట్టు కావ్యమునకు అధిక్షేప కావ్యములు, నిందా, హేళన కావ్యములు, అని నామాంతరములున్నాయి. చాటు పద్యములలో శతకములయందు గూడా తిట్టు కవిత్వము చోటుచేసుకున్నవి. బూతు కవిగా పేరుగాంచిన కుందవరపు కవిచౌడప్ప శతకము మనకు తెలిసినదే గదా.

తెలుగులో తిట్టు కవిత్వములకు పరిశోధనా గ్రంథమును రచించిన రావూరి దొరస్వామిగారు తిట్టు కవితకు అసూయ, ద్వేషము, క్రోధము, లోభము, మాత్సర్యము, వైషమ్యము. వైమనస్యము, నైరుధ్యము మొదలైనవి కారణములుగాను, వంచన దోహము, దుఃఖము, మదం, తిరస్కారము, దురాగతము, దుర్విదగ్ధత లనేవి వీటికి అంగములుగాను పేర్కొన్నారు. ఈ తిట్లలో అశ్లీలత ఎక్కువ చోటు చేసుకుంటున్నాయి.

కన్నడ విద్వాంసుడు డా. చిదానందముగారు తిట్లను, జాతి, మత, వృత్తినకు సంబంధించిన తిట్లగాను, వ్యక్తి, దైహిక దోషాలకు సంబందించిన తిట్లని, కామమునకు సంబంధించిన తిట్లని పలువిధములుగా ఉటంకించినారు అట్లే కన్నడమున శ్రీహరికృష్ణ భట్ భరణ్యాగారు కన్నడమున తిట్లను 1. తీవ్రమైన తిట్టు 2. సరళమైన తిట్టు

3. ప్రతిష్టాత్మకమైన తిట్లు, 4. ఇతరములు అని నాలుగు విధములుగ విభజించినారు.

తీవ్రమైన తిట్టు ఒక్కొక్కమారు ఆ వ్యక్తిని మాత్రమే గాక జన్మ యిచ్చిన వారిని కూడా చేర్చుకొని ప్రయోగింపబడును. ఇవి పురుషులకు సంబంధించినవి, స్త్రీలకు సంబంధించినవి గూడా నుండును. తిట్టే తిట్టు ఎదుటి వ్యక్తిమీద గల తీవ్రతను బట్టి యుండును. పురుషులయితే లంజ కొడుక, స్త్రీ అయితే బేవార్స ముండా, ఉభయముగా దరిద్రము, శనిముండా, ఇత్యాదులు.

ప్రీతిపాత్రమైన తిట్లు. ఇది ఎక్కువగా పిల్లల విషయమున మనకు కనబడును. ఆ తిట్లు గూడా చాలా కర్ణకఠోరముగా నుండును. తిండి ఎక్కువ తింటే తిండిపోతు నాయాలు, పనిచేయకపోతే సోమరిపోతు, సోంబేరి ఇత్యాదులు. ఒకొక్క పర్యాయము పిల్లలు పెద్ద వాళ్ళను మరీ విసిగించినపుడు నిన్ను పెద్దమ్మోరు ఎత్తుకొని పోను, నీకేదేం పాడురోగమో, అని తిడతారు.

వివిధ భావలయందు వివిధ విధములుగ తిట్లను, శాపనార్థములను విభజించినప్పటికీని, వీటికి మనము కొన్ని లక్షణములను దృష్టి యందుంచుకొని ఈ దిగువ విధముగా విభజించుకొనవచ్చును.

1. <u>జాతిమతకుల సూచకాలు</u> : ఎదుటి వ్యక్తి యొక్క జాతిని, మతమును, కులమును ఎత్తి చూపించుతూ చేసేవి.

2. <u>జంతు సూచకాలు</u> : ఎదుటి వ్యక్తిని జంతువునకు ప్రతీకగా గుర్తు చేస్తూ ఆ జంతువుతో పోల్చి తిట్టడము.

ఉదా : ఆంబోతులంజ, గొడ్డుముండ, గాడిద నా కొడక, దున్నపోతు నాయాలు, దొంగకోళ్ళు పట్టే వెధవ, కోతివెదవ, చుంచు ముంచ.

3. అంగవైకల్య సూచకాలు : ఎదుటి వ్యక్తియొక్క శారీరక మైన లోపమును ఎత్తి చూపుతూ చూసేవి. ఉదా : కుంటి నా కొడకా, తలమాసినోడ, నీ కడుపుకాల, నీ చేతులిరిగిపోను గుడ్డిముండదానా, చెవిటి ముండా కొడుకు.

4. రోగ సూచకాలు : ఎదుటి వ్యక్తియొక్క రోగమును సూచించుచు, లేదా అటువంటి రోగమును రావాలని కోరుతూ సూచించేవి. ఉదా : నీ కడుపు కాలా, నిన్ను మొమ్మారు ఎత్తుకొని పోను, నీకు పెద్దరోగం రాను, నీ నోట్లో పురుగులు పడిపోనూ.

5. శాపనార్థ సూచకాలు : శాపము యిచ్చుచు గాని, నాశనము గావాలని కోరుతూ చెప్పేవి. ఉదా : అడుక్కు తినేముండ, చావు, నీ దుంపతెగ, నిన్నంచాలయందు పెట్ట. (అనంచాల: అనగా చనిపోయిన వ్యక్తిని శ్మశానమునకు తీసుకుని వెళ్ళుటకు వెదురు బద్దలతో తయారు చేసిన గోపురము)

6. లైంగిక సూచకాలు : స్త్రీ పురుషుల కామమునకు సంబందించినవి సూచించును. ఉదా : ఆడంగి వెధవ, లంజ కొడక, నీ అమ్మనీ, నీయప్పనీ, బజారు లంజ, బేవార్సీముండాకొడక, ముండలసోకోడు, రంకుముండ, రంకులాడి, వెధవ ముండాకొడక

7. మానవ స్వభావసూచకాలు : మనిషి యొక్క స్వభావమును సూచించుచూ చెప్పేవి. ఉదా : ఆడంగి వెధవ, కంత్రీనాయాలు, రౌడీ వెధవ, దొంగ వెధవ, అమాయక చక్రవర్తి.

8. స్త్రీ సంబంధ సూచకాలు : స్త్రీలను గురించి చెపుతూ తెలియజేసే సూచకాలు. గొడ్డుముండ, చుప్పనాతి ముండ, తిక్కముండ, బోడిముండ, రాక్షసి, లంకిణి.

9. ఇతర సూచకాలు : పై విభాగమునకు చెందకుండ మిగిలి యున్నటువంటివి. ఉదా : కృతఘ్నుడు, కర్కోటకుడు, కులపాతకుడు, మూర్ఖ.

పై నుదహరించిన విధముగ మనము తిట్లను వర్గీకరించవచ్చును. అంతే గాదు ఆ వర్గములోనికి చెందినవి అనేకము మనకు లభ్యమగును. ఉదాహరణకు అన్యభాషా సంపర్కము వలన రాస్కేల్, ఫూల్, బద్మాష్, బేవార్సీ వెధవ, ఇత్యాదులు ఇతరములకు చెందును.

వివిధ రకములయిన తిట్లను నేను సేకరించుచున్నపుడు ఒకా యన ఇది గూడా ఒక సాహిత్యమేనా అని అపహాస్యము చేసినాడు. తిట్లనేవి కేవలము జానపదుల యందేగాదు చదువు సంస్కారము, కలిగిన వాడు కూడా ఏదో ఒక సందర్భమున ఎదుటివ్యక్తి గురించి అపహాస్యముగ, అశ్లీలముగ మాట్లాడి యుండును. వరుసగ 10 తిట్లను నన్ను తిట్టండి అని సవాలు విసిరితే వారు నోరు వెళ్లబెట్టారు. గాని నేను సేకరించిన తిట్లను చదివి, వినిపించితే ఆయన చాలా ఆశ్చర్య పోయాడు. తిట్టు ఒక ప్రాంతమునకు, మరొక ప్రాంతమునకు ప్రాంతీయతా భేదము, ఉచ్ఛారణా వైషమ్యము గనబడును.

నాగరికత సంస్కృతి పెరిగిన కొలది జన సామాన్యమున తిట్లు కనుమరుగయ్యే ప్రమాదమున్నది. అందువల్లన జానపదుల తిట్లను సేకరించి భద్రపరచవలసిన అవశ్యకత ఎంతైనా కలదు. అవి రేపటికి ఎంతైనా అవసరముండును.

ఒక ప్రాంతమునకు మరియొక ప్రాంతమునకు గల మాండలిక వ్యవస్థా భేదమును బట్టి, యాసను బట్టి, తిట్లనందలి ఉచ్ఛారణ మారును గాని మౌలికమైన భావమునందు మార్పులేదు. తిట్లను, ఒట్లను ఒక పద్ధతిన అధ్యయనము చేసిన ఎడల ఆ ప్రాంతమునందలి భాషా సామాజిక వ్యవస్థ మనకు స్పష్టముగా తెలియును.

క్షేత్ర పరిశీలనా సమయమున తూర్పుగోదావరి జిల్లాయందలి విభిన్న ప్రాంతముల యందలి జానపదుల నోళ్ళ యందున్నటు వంటి తిట్లను సేకరించి ఈ దిగువన పొందుపరచుచున్నాను.

1) అబద్దాల నా కొడుక  2) అడుక్కుతినే ముండ
3) ఆబోతు లంజ  4) ఆడంగి వెధవ
5) అమ్మోర్రు  6) అఘోరించావులే
7) ఎర్రి ముండ  8) ఎర్రి లంజ
9) ఎర్రి నాయాలు  10) ఎర్రి వెధవ
11) ఏడు చెరువులు నీళ్ళు తాగిస్తా చూడు
12) ఏడిశావులే  13) ఎర్రి ముండగానా
14) ఎదవ లంజ కొడకా  15) కుంటినా కొడకా
16) కొండ మంగలోడు  17) కిలాడి వెధవ
18) కల్తీ నాయాలు  19) కంత్రీ నాయాలు
20) కొజ్జా  21) కొజ్జా నా కొడకా
22) కంత్రీ ముండ  23) కంత్రీ నా కొడకా
24) కర్కోటకుడు  25) కుక్కల నా కొడక
26) కృతఘ్నుడు  27) కక్కిన కూడు తినే వెధవ
28) గడ్డి తినే నా కొడుకు  29) గాండూ నాయాలు
30) గొడ్డు ముండ  31) గాడిద
32) గాడిద నా కొడక  33) గాండు నా కొడకా
34) గడ్డితినే వెదవ  35) చుప్పనాతి ముండ
36) చావు  37) చవట
38) చాడీకోరు  39) జిడ్డు నాయాలు
40) తిండిపోతు నాయాలు  41) తిక్కనా కొడకా
42) తిక్క ముండ  43) తొత్తు కొడక

44) తొత్తు ముండ
45) చెంచా గాడు
46) తలమాసినోడు
47) దయ్యం ముండ
48) దరిద్ర ముండా కొడక
49) దున్నపోతు నాయాల
50) దుమ్ము దులిపేస్తా
51) దాన్ని మాకిగోనికియ్య
52) దొంగ నా కొడకు
53) దొంగ ముండ
54) దొమ్మరోడు
55) దొంగకోళ్లు పట్టే వెధవ
56) దొంగ ముండా కొడుకు
57) దద్దమ్మ
58) దరిద్ర నాయాల
59) దరిద్ర ముండ
60) దగుల్బాజీ
61) దొంగ సచ్చినోడు
62) నీ కడుపు కాల
63) నీ పెళ్ళాం తాడుతెగ
64) నీ పెళ్ళాం ముండామొయ్య
65) నీ పిండా కూడు
66) నంగనాచి
67) నీ జిమ్మడ
68) నోర్ముయ్
69) నిన్న మ్మోరు ఎత్తుకొనిపోను
70) నీ తాడు తెగ
71) నీ నోట్లో దుమ్ముపడ
72) నీనోట్లో సాడుపొయ్య
73) నీనోట్లో పురుగులు పడ
74) నీ మోహానికి అగ్గిపెట్ట
75) నీ ఎముకలు విరుస్తా
76) నీ యమ్మ
77) నీ యాలి
78) నీ యిల్లు పాడుగాను
79) నీ కడుపు కాల
80) నా సంక నాకు
81) నీ దుంప తెగ
82)నీకేం పొయ్యాకాలమొచ్చింది
83) నీ సిగ్గు బొగ్గులుకాను
84) నిన్ను కాట్లో పెట్ట
85) నిన్ను గోతిలో పెట్ట
86) నిన్నుగంగానమ్మ ఎత్తుకెల్ల
87) నీ అమ్మని విషయించ
88) నీ అక్కని విషయించ
89) నీకు పిండాకూడు పెట్ట
90) నీకు పెద్దరోగం రాను
91) నీకు చేతులు పడిపోను
92) నీ గాజులు పగిలిపోను
93) నీ తెలివి తెల్లార
94) నీ తెలివి సంతకెల్ల
95) నీ నల్లలు రాల

96) నీ నోట్లో ఉచ్చొయ్య 97) నీనోట్లో దుమ్ము కొట్ట
98) నీ పసుపు కుంకుమలు రాలిపోను 99) నీ మొహం తగలెయ్య
100) నీ అమ్మకడుపు మాడ 101) నీ శ్రాద్ధం పెట్ట
102) నీ సిగ తరగ 103) నిన్నుమ్మోర్తుకు బలియ్య
104) నీ బొట్టు చెరగ 105) నిన్నుఅనంచాల్లో పెట్ట
106) నీకు మాయారోగం రాను 107) నీ ఇంట్లో పీనుగెల్ల
108) నీ నోట్లో మన్నుడ 109) నీ యిల్లు కూల
110) నీ సేతులిరిగిపోను 111) నంగ నాచి
112) పండ్లు రాల్తాయి 113) పండికొక్కు నాయాల
114) పడావు ముండ 115) పాకీదాన
116) బుద్ధిలేని గాడిద 117) బదామ్మెష్
118) బాంచత్ 119) బేవార్సి వెధవ
120) బికారి వెధవ 121) బేవార్సి ముండ
122) బేవార్సి ముండా కొడకా 123) బొచ్చు ముండ
124) ముదనష్టపోడు 125) ముండనష్టపు లంజ
126) ముస్టెత్తుకునే నా కొడుకు 127) మాల ముండ
128) ముండల సోకోడు 129) మంగి నాయాలు
130) మూర్ఖుడు 131) రంకు ముండ
132) రంకులాడి 133) రాక్షసి
134) బ్రహ్మ రాక్షసి 135) లంకిణీముండ
136) వెధవ ముండా కొడుకా 137) శని ముండ
138) రాడీ ముండా కొడుకా 139) రాడీ వెధవ
140) కిరాయి వెధవ



# జానపదుల సామెతలు

ఆంగ్లమున ప్రోవెర్బ్ అను పదమునకు తెలుగున సమానార్థకముగ సామెత అను పదమును వాడుచున్నారు. ఇదే పదమునకు హిందీ భాషలో కహావత్, కన్నడమున తుళు భాషలందు గాదె అనియు, తమిళమున వళమొళి అనియు, మళయాళమున పళంచొల్ అని తెలియ జేయుచున్నారు. ఆంగ్ల భాషయందు ప్రోవెర్బ్ అన్న దానికి A General or Common say అన్న అర్థమును తెలియ జేయగా తెలుగు నిఘంటువులు సామెతలను లోకోక్తి అని తెలియ జేసినారు.

లోకోక్తి అను పదమునకు ఆంధ్రదేశమున వివిధ ప్రాంతముల నందు నానుడి, లోకోక్తి, శాస్త్రము, జనస్తుతి అని పర్యాయ పదములు వాడబడుచున్నవి. దీనినే కొన్ని ప్రాంతములవారు చాటువులని అనడము కూడ కద్దు. సామెత సమాన రూపము, సారూప్యత, సారూప్యము, సామ్యము నుండి సామెతను పదము ఉద్భవించినట్లు గూడ ఆలంకారికులు తెలియజేయు చున్నారు.

సామెత అన్న పదమునకు మనము 'అల్పాక్షరములలో అనల్పాక్షరత'గ మనము తెలుసుకోవలసియున్నది. దీన్నే ఆంగ్లమున BRIVITY. సంక్షిప్తతనకు మారు పేరు. ఎంతో గొప్ప భావమును అతికొద్ది కాలములో అతికొద్ది పదములతో కూర్చి చెప్పడమే సామెత. ఉదా : పిట్ట కొంచెము కూత ఘనము. ఈ సామెతను గురించి మనము ఎంతైనా వివరించ వచ్చును. ప్రధానమంత్రి జవహార్‌లాల్ నెహ్రు చనిపోయినపుడు ప్రధానిగా లాల్‌బహాదూర్ శాస్త్రి గారిని నియమించిరి. అపుడు జరిగిన ఇండోపాక్ యుద్ధమున మన ప్రధానిగా లాల్‌బహాదూర్ శాస్త్రి చూపిన నేర్పునకు సర్వమానవ ప్రపంచము

అతడిని కీర్తించిరి. పిట్టకొంచెము కూత ఘనము అన్న సామెత ఎంతగా అన్వయించినదో ఒక్కసారి పాఠకులు అర్థము చేసుకోవాలి. గొప్ప విషయమును అతి చిన్న పదములతో చెప్పడమె మహా విద్య. అలాంటి సామెతలు మన జనపదుల యందు ఎన్నింటినో అలవోకగా మనము వింటున్నాము. మనమే ప్రయోగిస్తున్నాము. జానపదులు తాము జీవితములో పొందిన సుఖదుఃఖములను రెండింటిని సమాన ముగ అనుభవించి ఆ అనుభవసారమె ఇతరులకు నర్మగర్భముగ సామెత రూపమున బయటకు వెలార్చుదురు. అంటే జీవిత అను భవము నుండి సామెత పుట్టబడినది. అంటే ఇది ఒక్కరి నుండి పుట్ట బడినది గాదు. జన సామాన్యుల అందరి నుండి సమిష్టి సంపదగా ఉద్భవించినది. అలా ఉద్భవించబడిన సామెతలను సూక్తులగ తరతర ములనుండి మనకు అనుచానముగ వచ్చుచున్న గద్య, పద్య కావ్య ములయందు చొప్పించి కథలకు, పాత్రలకు ప్రామాణికతను కలుగ జేయుచు జానపద సాహిత్యమునందే గాదు శిష్ట సాహిత్యమునందు గూడ చోటు చూపించిరి. నన్నయ్య కాలమునాటికి జానపదుల భాషే. తరువాత నన్నయ్య వారు కావ్యభాషగా మహాభారతమును రచించినప్పటికి ఆతడు జానపదుల సంస్కృతిని, సూక్తులను అందు ప్రవేశ పెట్టినారు గదా ! అసలు నన్నయ కవీంద్రుల వారు తన కవితా లక్షణములుగా చెప్పుతునే మూడింటిలో నానారుచిరార్థ సూక్తి నిధి. ఇక్కడ సూక్తి అంటే సు + ఉక్తి; మంచి మాట, పలుకు అంటే సామెతకు పర్యాయ పద రూపమే. తన కాలమునాటి సామెతలను ఆతడు వాడగా ఎట్టిన కవీంద్రులు మాత్రము సూక్తి వైచిత్రి అని తన లక్షణముగా చెప్పియున్నారు.

సామెత చెప్పినపుడు అందలి వస్తువు సమాజమునకు చెందినదిగ యుండును. అందలి జీవనము ప్రజా జీవనమే, ఉపదేశము, వాటి తీవ్రత సంఘమునకు సంబంధించును. బోధన, ఉపదేశముగ నుండును.

ఉదా : పోరు నష్టము పొందు లాభము.

ధ్వని ప్రధానమై, అర్థ గంభీరత, భావసారూప్యత, సంభాషణా చతురత, నిర్దిష్టత కలిగి యుండి ఎదుటి వారు విన్నంతనే అర్థమగునట్లు చెప్పబడే ఒకటి లేదా రెండు వాక్యముల సమూహామే సామెత లేదా సూక్తి. ఇది సామెతనకు నేను (రచయిత) చెప్పే నిర్వచనము.

అట్లు చెప్పబడిన సామెతకు కొన్ని లక్షణము ఉండవలెనని కొందరు తెలియజేసి యున్నారు.

1. సంక్షిప్తత
2. వ్యాస రూపమున నుండుట
3. అనుభవ రూపమున నుండుట
4. తీక్షణత
5. వివేకవంతమైన అంశము కలిగియుండుట
6. సార్వజనీనత
7. ఉపదేశాత్మకత
8. వ్యంగ్య ప్రాధాన్యత

ఇవి లక్షణములుగా తెలియ జేసినప్పటికిని, అన్ని సామెతలుకు అన్వయము చేయలేకపోవచ్చును. ఏవో కొన్ని సామెతలకు కొన్ని లక్షణములు అన్వయించక పోయినప్పటికి ఇవి లక్షణములుగా మాత్రము మనము అంగీకరించవచ్చును.

అనన్యమైన జన సామాన్యమున సామెతలు మనము సేకరించు చున్నపుడు కలగూర గంపవలె నున్న దానిని శాస్త్రీయమైన పద్ధతిలో మనము వర్గీకరించవలసియున్నది.

ఆంగ్లమున **R. S. BOGGS** సామెతలను ఆరు విధములుగ వర్గీకరించినాడు.

1. Proverbial metaphor. 2. Proverbial (Apologue) 3. Blason Populare. 4. Wellerism. 5. Proverbial phrase 6) Proverbial Comparison

ఎటువంటి వాటిని సామెతలుగా సేకరించవలయునో గూడా తెలియ జేసినాడు.

1. Folk proverbs appearing as complete sentences : పోరు నష్టము పొందు లాభము.
2. Sentences sayings or proverbs of the learned in complete sentences : మెరిసేదంతా బంగారము గాదు.
3. Proverbial rhymes. : కాకి పిల్ల కాకికి ముద్దు
4. Proverbial sayings not complete sentences involving a verb. : అడిగే వాడికి చెప్పేవాడు లోకువన్నట్లు.
5. Proverbial sayings not involving a verb : అనుమానం పెనుభూతం.
6. Proverbial comparisons and similies : చంద్రునికో నూలుపోగు.

సామెతలను మన తెలుగు నాట అనేకమంది కవులు నన్నయ మొదలుకొని ఈనాటి ఆధునిక కవుల వరకు తమ తమ కావ్యముల యందు గ్రంథములయందు చొప్పించినప్పటికిని జానపదుల వ్యవహారమున వాళ్ళనోళ్ళ యందు 99 శాతము ఇంకా జీవించి యున్నవి. నాగరికత పెరిగిన కొలది సామెతలు అన్నింటిలాగానే తెరమరగవుచున్నవి. అట్లు తెరమరుగు గాకుండా సామెతలను సేకరించవలసిన బాధ్యత ఈనాటి పరిశోధకుల మీద ఎంతైనా ఉన్నది.

తూర్పుగోదావరి జిల్లాను పరిమితము చేసుకొని నేను సేకరించిన

సామెతలను కూలంకషముగ పరిశీలించగా వాటిని క్రింది విధముగా వర్గీకరణం చేయవచ్చును.

1) నిషేధించుచున్నట్లుగా : కాని పనికి పోరాదు.
2) నీతిని బోధించునవి : ఇద్దరు పెళ్ళాల మొగుడు ఇరుకున బడి చచ్చాడట.
3) హాస్య పూరితమైనవి : ఇంత లావున్నావు తేలు మంత్రం రాదా అని.
4) గృహ సంబంధమైనవి : కడుపులో లేనిది కావలించుకుంటే వస్తుందా.
5) సమాజమును చూపునవి : ఎవరు తీసుకున్న గోతిలో వారే పడతారు.
6) సెక్సునకుసంబందించినవి : కోడలికి బుద్ధిచెప్పి అత్త రంకోయిందట
7) ధర్మమునకు సంబంధించినవి: విత్తుముందా? చెట్టుముందా?
8) ఉపదేశాత్మకమైనవి : చెడి స్నేహితుని ఇంటికైనా పోవచ్చునుగాని చెల్లెలింటికి పోకూడదు
9) శబ్దాలంకారమైనవి : ఉభయభ్రష్టత్వం ఉపరిసన్యాసత్వం
10) ప్రశ్నారూపకముగా : ఎద్దు పుండు కాకికి ముద్దా?
11) అశ్లీలపు సామెతలు : తొడసంబంధము తొంబై ఏళ్ళు దాకా పోదు.
12) అలంకారికమైనవి : చందురునికో నూలుపోగు.
13) వైద్యపు సామెతలు : పెరటి తులశి వైద్యానికి పనికిరాదు.
14) అన్యభాషా సంబంధమైనవి: బాంచెత్ బద్మాష్‌కి పణాగాని శ్రార్ధం.

ఇటీవల కొందరు జాతీయములను సామెత లనుచున్నారు. జాతీయము సామెతగాదు, జాతీయము వేరు. సామెత వేరు. ఈ ఈ రెండింటికి చాలా బేధమున్నది.

ఒక ప్రాంతమునకు, ఒక వర్గమునకు, ఒక కాలానికి మాత్రమే వర్తించేది సామెత. అయితే సార్వజనీనతను సూచించేది జాతీయము.

గోరుచుట్టుపై రోకలిపోటు - సామెత

మెరిసేదంతా బంగారము కాదు - జాతీయము
**All the glitters are not Gold**

పిండి కొలది రొట్టె - జాతీయము
**Cut your coat according to the cloth**

కవి వయస్సును నిర్ణయించవచ్చును. కవి అందించిన కావ్యమున గూడా అంతర్గత, లేదా బాహ్య ఆధారముల ద్వారా నిర్ణయించ వచ్చును. కవికాలాదులను గూడా మనము చెప్పవచ్చును. కాని కావ్యమునందు గాని, జన సామాన్యమున గాని నున్నటువంటి సామెతల వయస్సును, కాలమును మనము నిర్ణయించ గలమా! ఒకొక్క నిర్ణయము చేయవలసివస్తే పై ఆధారములను మనము తీసుకోవాలి. కావ్యము ఆధారముగా తీసుకుందామా అంటే అంతకు పూర్వము జనసామాన్యమున ఉంటేనేగాని కవి ఆ సామెతను గ్రంథస్తము చేయుడు గదా! మరి అప్పుడు ఆ సామెత అంతకంటే ముందుది అనీ మనము ఎలాగ చెప్పగలము. అందువల్లన జానపద విజ్ఞానమునకు కాలమును నిర్ణయించలేనట్లే సామెతలను గూడ మనము కాలనిర్ణయాదులను చేయలేము గాని ఇటీవల ఆధునిక కవులు కొందరు సామెతలను కృత్రిమముగా నిర్మించి ఉపయోగించు చున్నందువలన వాటి ఆధారముగా కాలనిర్ణయము చేయగలము.

"ఇంతోటి మొఖమునకు పీశేబులము పశుపా" ఇందు కొల మానము ప్రయోగించి యున్నారు. కొలమాన ప్రవేశము ఆధార ముగా మనము కాల నిర్ణయము చేయవచ్చును.

ఒకే దెబ్బకు రెండు పిట్టలు. ఇందు సంఖ్యామానము.

ఓలి తక్కువని గుడ్డిదాన్ని చేసుకుంటే నెలకి మూడు పదుల కుండలు పగులగొట్టిందట.

పేదవాడి కోపము పెదవికి చేటు. దీనికి కాలనిర్ణయము చేయలేము.

సామెతలు పరిశోధన చేసియుండుట వలన ఆ జాతి సంస్కృతి, సాహిత్య పరిస్థితి వారి సాంఘిక సంస్కారము, గృహ జీవన సంబంధి మొదలగు పూర్తి సమాచారము అంతా మనము పరిశోధన వలన తెలియజేయగలము.

సాంఘికశాస్త్రజ్ఞులకు ఆనాటి సమాజము నందలి సంప్రదాయము, భాషాశాస్త్రజ్ఞలకు ఆనాటి ప్రజల ఉపయోగించుభాషాశాస్త్రము నృశాస్త్రజ్ఞతకు (Anthropologist) ఆనాటి జీవన సరళి తెలియుటకు అవకాశము లభించును.

ఇతర భాషలయందుండు శాస్త్రజ్ఞులు తమ తమ భాషలయందలి సామెతల ఆధారముగా వారి జాతి సంస్కృతిని పూర్తిగ విశదీకరించిరి. తెలుగుదేశమునందలి సామెతలను ఆంగ్లేయులు, బ్రౌన్, కాల్, మెకంజీ మొదలగువారు సామెతలను సేకరించిఅంతా గ్రంథస్తము చేసియున్నారు. ఈ రంగమున ఆంధ్రలోకోక్తి చంద్రిక మొదటి సామెతల సంకలన గ్రంథమని, కుకుమళ్ళ కామేశ్వరావు అభిప్రాయము. తరువాత చిలుకమర్తి నారాయణశాస్త్రి దేశమంతట తిరిగి సామెతలను సేకరించినారు. దీనిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు తెలుగు సామెతలు అను పేరన గ్రంథముగ రూపొందించిరి.

ఇటీవల కాలమున కీ.శే. నేదునూరి గంగాధరంగారు జానపద విజ్ఞానము అంతటిని సేకరించిరి. ఆసేకరణలో ఎన్నియో సామెతలు

వారి భాండాగారమున నిండియున్నవి. అవి వెలుగు చూడలేదు. ఇటీవలి కాలమున జానపద పరిశోధకునిగా తూర్పుగోదావరి జిల్లాను పరిమితము చేసుకొని వివిధ ప్రాంతములయందు జానపదుల నోళ్ళయం దున్నటువంటి సామెతలను సేకరించినాను. వాటిలో కొన్నింటిని ఈ దిగువ ఉదహరించుచున్నాను. భవిష్యత్తున ఒక ప్రామాణికమైన పరి శోధనా గ్రంథముగా వెలుపడాలని నా ఆశయము.

అరిచే కుక్క కరవదు
అర్ధరాత్రికాడ అంకమ్మ శివాలని
అమ్మ పెట్టా పెట్టదు, అడుక్కు తిననా తిన నివ్వదు
అత్తసొమ్ము అల్లుడు ధారవోసినట్లు
అన్నీవున్నాయి, ఐదోతనమే లోటు
అడ్డాల్లో బిడ్డలుగాని, గెడ్డాలొచ్చేక బిడ్డలా ?
అంగట్లో అన్నీవున్నా, అల్లుడినోట్లో శని అన్నట్లు
అంతా శ్రీవైష్ణవులే అయితే బుట్టెడు రొయ్యలూ ఏమయినట్టూ
అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు
అంబలి తాగేవాడికి మీసాలొత్తే వాడొకడు
అచ్చి పెళ్ళి బుచ్చి చావుకొచ్చింది
అడగందే అమ్మైనా పెట్టదు
అడుసు తొక్కనేల కాలుకడగనేల
అత్తచచ్చిన ఆమాసాలకి అల్లుడు పరామర్శ కొచ్చినట్లు
అడిగేవాడికి చెప్పేవాడు లోకువ
అంత్యనిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరంమేలు
అచ్చమ్మ పెళ్ళిలో బుచ్చమ్మ శోభనాలని
అవిటోడ్ని బలివోడు కొడితే బలివోణ్ణి దేవుడు కొట్టాడట
అసలే కోతి, అందులో కల్లుత్రాగింది, ఆపైన తేలుకుట్టింది
అయ్యొచ్చేదాకా అమావాస్య ఆగుతుందా?

అరచేతి బెల్లం చిప చేదు

అన్నీ తెలిసినోడికి అమావాస్య మరణం, ఏమీ ఎరగనోడికి ఏకాదశి మరణం

అడావడి పెండ్లికొడుకు పేరంటాలుని తీసుకుపోయేడట (తన్ను కుపోయాడంట)

అణా కాణి పెళ్ళికి అర్ధరూపాయి బాణాసంచా

అదిగో పులి అంటే ఇదిగో తోకన్నట్లు

అదృష్టవంతుణ్ణి పాడుచేసేవాడులేడు, దురదృష్టవంతుణ్ణి బాగు చేసేవాడూలేడు

అమ్మవారి మొక్కూ తీరుతుంది, ఆశాదేవి బూతీ తీరుతుంది.

అయ్యవారిని చెయ్యబోతే కోతైనట్టు

అయ్యవార్లం గారు ఏంచేస్తున్నారంటే ఒలకబోసుకొని ఎత్తి పోసుకుంటున్నారన్నారట

అబద్ధపు పెళ్లికి ముడివాయింపు వాయిద్యం

అమ్మని తిడతావేమిరా లంజకొడకా అన్నాట్ట

అయ్యకి రెండో పెళ్ళిఅని సంబరమేగాని తనకి సవితితల్లి వస్తుందనే తెలీదు

అరచేతిలో తేనెపోసి మోచేతిదాకా నాకించినట్లు

అడవిపంది చేనుమేసిపోతే ఊరపంది చెవులు కోసినట్లు

అతనికంటే ఘనుడు ఆచంటమల్లన్న

అతి రహస్యం బట్టబయలు

అతి వినయం ధూర్త లక్షణం

అన్నం ఉడికిందో లేదో మెతుకుబట్టి చూస్తే చాలు

అనుమానం పెనుభూతం

అప్పుచేసి పప్పుకూడు

అప్పులున్న వాడికంటే చెప్పులున్న వాడివెంట పోగూడదు

అక్కచెల్లెళ్ళకు అన్నంపెట్టి లెక్కవ్రాసుకున్నట్టు
అందానికి నేను రోగానికి మా అప్ప అందట
ఆర్నెల్లు సావాసంచేస్తే వారు వీరవుతారు
ఆర్నెల్లు సాముచేసి మూలనున్న ముసలమ్మను పొడిచాడట
ఆలికి అన్నంపెట్టడం ఊరికి ఉపకారమా
ఆలులేదు చూలులేదు కొడుకుపేరు సోమలింగం
ఆవుచేల్లో మేస్తే దూడ గట్టున మేస్తుందా
ఆయనే ఉంటే మంగలెందుకు అనీ
ఆవులిస్తే పేగులు లెక్కపెట్టే రకం
ఆడది తిరిగి చెడుతుంది, మగవాడు తిరక్క చెడతాడు
ఆకలి రుచిఎరుగదు, నిద్రసుఖమెరుగదు
ఆ ఊరికి ఈ ఊరెంతో ఈ ఊరికి ఆ ఊరూ అంతే
ఆ అంటే అపరాధం, ఉ అంటే ఉపరాధం (ఉపద్రవం)
ఆకులు నాకేవాడింటికి మూతులు నాకేవాడు వచ్చాడట
ఆడబోయిన తీర్థం ఎదురైనట్టు
ఆ తాను లోదే ఈ ముక్క కూడా
ఆడలేక మద్దెలోడన్నట్టు
ఇంటి గుట్టు లంకకు చేటు
ఇంటికి ఏబ్రాసి పొరుక్కి శివాలెత్తి
ఇంటి దొంగను ఈశ్వరుడైన పట్టలేడు
ఇల్లు అలగ్గానే పండగవుతుందా?
ఇల్లు ఇరకాటం ఆలి మర్కటం
ఇంతలావున్నావు తేలు మంత్రం రాదా అని
ఇంటివాడు గొడ్డు గేదంటే పొరుగువాడు పాడిగేదంటాడా
ఇంటిపేరు కస్తూరివారు ఇల్లంతా గబ్బిలాలకంపు
ఇల్లుకట్టిచూడు పెండ్లిచేసిచూడు
ఇంటికో పుష్పమయితే ఈశ్వరుడికో మాల

ఇంటిమీద రాయివేసి వీపొగ్గినట్టు

ఇంట్లో ఈగలమోత బయట పల్లకీల మోత

ఇంట్లోనాడు ఇలా అంటే పొరుగువాడు పొదా మాటాడు

ఇంతబ్రతుకు బతికి ఇంటివెనకాల పడిచచ్చినట్టు

ఇద్దరి పెళ్ళాలమొగుడు ఇరుకునబడి చచ్చాడట

ఇస్నేకం తెలుసు గాని నాకంతంత నొప్పి ఎరగనన్నాడట

ఇనపగుగ్గిళ్ళు గాని అనపగుగ్గిళ్లు కావు

ఇల్లుకాలుతుంటే నుయ్యి త్రవ్వడం ప్రారంభించినట్టు

ఇల్లుదాటిన ఆడది లోకానికి లోకువ

ఇసుక తక్కెడ పేడతక్కెడ

ఇంతోటిమొఖానికి వీశెబలం పసుపా అని

ఈమాత్రం సంభడానికేనా ఇంత ఆర్భాటం

ఈనగాచి నక్కలపాలు చేసినట్లు

ఆదిలోనే హంసపాదు

ఉట్టికెగరలేనమ్మ స్వర్గానికి ఎగిరెందని

ఉన్నమాటంటే ఉలుకెక్కువ

ఉభయభ్రష్టత్వం ఉపరి సన్యాసత్వం

ఉయ్యాల్లో పిల్లనెట్టుకొని ఊరంతా వెతికినట్టు

ఉండేది గట్టి పోయేది పొల్లు

ఉన్నది మనిషికి శుష్టి తిన్నది పశువుకు పుష్టి

ఊరుమ్మడి గొర్రె పుచ్చి చచ్చిపోయిందని

ఉల్లి మల్లవుతుందా?

ఊరుకున్నంత ఉత్తమము బోడికుండంత సుఖమూలేదు

ఊరందరిదీ ఒకదారి ఉలిపికట్టె దొకదారి

ఊళ్లో పెళ్ళయితే కుక్కలకి హడావడి

ఊహ ఊళ్లేలుతుంటే కర్మ గాడిదలు కాస్తోందంట

ఊరందరికీ నేను లోకువ, నాకు నంబిమంచారయ్య లోకువన్నట్టు
ఎంత చెట్టు కంత గాలి
ఎక్కడైనా బావగాని వంగతోటదగ్గర బావకాదన్నాడట
ఎగరబోయి బోర్లాపడినట్లు ఊరచ్చురాలేదన్నట్లు
ఎద్దు పుండు కాకికి ముద్దా!
ఎరువు సొమ్ము బరువు చేటు
ఎలకల మీద కోపము ఇల్లు తగలెట్టుకున్నట్లు
ఎవ్వడికి పుట్టిన బిడ్డరా వెక్కివెక్కి ఏడుస్తావని
ఎవరు తీసుకున్న గోతిలో వారే పడతారు
ఎక్కడ వేసిన గొంగళి అక్కడే
ఎవరి కంపు వారి కింపు
ఎవరి పిచ్చి వారి కానందం
ఏ పుట్టలో ఏ పాముందో
ఏరు దాటాక తెప్ప తగలేసే రకం
ఏ చెట్టు లేనిచోట ఆముద వృక్షమే మహా వృక్షము
ఏ మొగుడు లేకుంటే అప్ప మొగుడే గతి
ఓడ దాటేందాకా ఓడ మల్లయ్య ఓడ దాటిం తరువాత
బోడి మల్లయ్య
హేమాహేమీలు ఏట్లో కొట్టుకు పోతుంటే నక్క
పాటి రేవడిగిందంట
ఏరాయైతేనేం పళ్లూడ గొట్టుకోవడానికి
ఏకై వచ్చి మేకై తగులకున్నట్లు
ఏ కర్రకు నిప్పంటు కుంటే ఆ కర్రే కాలుతుంది
ఏడు మనువుల ఎల్లినా యేకుల వడకడము తప్పలేదట
ఏడ్చేదానికి మొగుడొస్తే ఏకులాడికే దానికి మొగుడొస్తాడని
ఏనుగును చూచి కుక్కలు మొరిగినట్లు

ఏనుగు బ్రతికినా వెయ్యే చచ్చినా వెయ్యే
ఏబ్రాసికి పనెక్కువ లోభికి ఖర్చు ఎక్కువ
ఏ గూటి చిలుక ఆ గూటి పలుకే పలుకుతుంది
ఒక నాడా దొరికింది ఇక మూడు నాడాలు, గుర్రం దొరకడమే తరవాయి అన్నాడట
ఒకరిద్దరిని చంపితేగాని వైద్యుడు గాడు అన్నాడట
ఒక ఊరి కాపు ఇంకొక ఊరికి మాల
ఒక దెబ్బకు రెండు పిట్టలు
ఓడలు బళ్లు అవుతాయి బళ్లు ఓడలవుతాయి
ఓడినోడు వీధిలో ఏడిస్తే, నెగ్గినోడు ఇంట్లో ఎడ్చాడట
మగనికి నేస్తగాడు ఆలికి మిండగాడు
అల్లుడికి కోపము వస్తే కూతుర్ని తన్ని తీసుకొని పోతాడు
ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెళ్లి చేసుకొంటే నెలకి ముప్పది
కుండలు పగల గొట్టిందట
కుంచెడోళ్లు కూలికెలితే తూముడోళ్లు దూడలు తినేశాయి
కుక్క మొరిగితే జంగం పరపతి పోతుందా
కడవంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువ
కడుపులో లేనిది కావలించుకుంటే వస్తుందా
కర్ర లేనివాణ్ని గొర్రె కరిచిందన్నట్లు
కలపోసి పెట్టినా ఉట్టి వంకే చూసినట్లు
కలిసొచ్చే వేళకి నడిచొచ్చే బిడ్డ పుడతాడని
కాకి పిల్ల కాకికి ముద్దు
కాకినాడ లాభాలు కొవ్వూరు లాకులు దాటాలి
కాకిముక్కుకు దొండపండు లాగ
కాకుల్ని కొట్టి గద్దల కేసినట్లు
కాని పనికి పోరాదు

కాలు జారితే తీసుకోగలంగాని నోరు జారితే తీసుకోలేము
కాలు పట్టుకోనిస్తే చూరు పట్టుకొని వేళ్లాడుతున్నట్లు
కాశీకెళ్లి గాడిద గుడ్డు తెచ్చినట్లు
కుక్క కాటుకు చెప్పు దెబ్బ
కుక్క తోకపట్టుకొని గోదావరి ఈదినట్లు
కూలికి వచ్చి పాలికి మాట్లాడినట్లు
కూసే గాడిదవచ్చి మేసే గాడిదని చెడగొట్టినట్లు
కాలికి వేస్తే మెడకి, మెడకి వేస్తే కాలికి
కొండకి వెంట్రుకకు ముడెయ్యడము
కొత్త బిచ్చగాడు పొద్దెరగడన్నట్లు
కొత్త వింత పాత రోత
కొబ్బరిచెట్టు ఎందులకెక్కేవంటే దూడగడ్డి కోసమన్నాడట
కొరివితో తల గోకుకున్నట్లు
కోడలికి బుద్ధిచెప్పి అత్త రంకోయిందట
కావమ్మ మొగుడంటే కాబోసనుకున్నాను కాకబోతే నా
కర్రా, బుర్రా ఇలా పారెయ్యండి పోతానన్నాడట
కోతికి కొబ్బరికాయ దొరికినట్లు
కూచోడానికి చోటిస్తే తొంగోడానికి చోటివ్వమన్నాడట
కూడా రావద్దంటే ఎత్తుకోమని ఏడ్చాడంట
కుక్క పని గాడిదచేసినట్లు
కాకై కలకాలం బ్రతికేకంటే హంసై ఆరుమాసాలు బ్రతికినా చాలు
కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది.
కొండనాలుకకు మందువేస్తే ఉన్ననాలుక ఊడిపోయిందట
కరవమంటే కప్పకుకోపము, విడవమంటే పాముకుకోపము
కొడుకు బాగుండాలి, కోడలు ముండా మొయ్యాలి

కూకుంటే గడవంది కూలికెడితే గడుస్తుందాఅని
కుమ్మరావలో ఇత్తడిముంతలు దొరుకుతాయా
కథ అడ్డం తిరిగింది
కొత్తగా సిరొస్తే అర్ధరాత్రి గొడుగుపట్టమన్నాడట
కలిసిపొట్టరా కావేటి రంగా అని
కుమ్మరికి కుండ కరువు, కమ్మరికి తెడ్డుకరువు
కరువులో అధికమాసము
కాడు రమ్మంటుంది, ఊరు పొమ్మంటుంది
కడుపు వీపన్నట్లు
కంచే చేనుమేసింది
కక్కిన కూడు కాస పడినట్లు
కడుపునిండిన నోటికి గారెలు చేదు
కుడితిలో పడ్డ ఎలుక లాగ
కూర్చునితింటే కొండలైన తరుగుతాయి
కొండ తల క్రిందెట్టుకొని రాళ్ళ కోసము వెతికినట్లు
కొండని త్రవ్వి ఎలుకని పట్టినట్లు
కొత్త నీటికి చేప ఎదిరెక్కినట్లు
కయ్యానికైనా వియ్యానికైనా సమ ఉజ్జీ ఉండాలి
గొంగట్లో కూర్చుని వెంట్రుకలు లెక్కపెట్టినట్లు
గారాం గాడిదల కేడిస్తే వీపు దెబ్బలకేడ్చిందంట
గాలివాన వస్తే కథే లేదు
గుడిని మింగేవాడు ఒకడు అయితే గుడిని గుళ్లో లింగాన్ని
మింగేవాడు మరొకడు
గుడ్డిలో మెల్లలాగ
గుడ్డెద్దు చేలో పడ్డట్లు
గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించిదట

గుమ్మడికాయల దొంగ భుజాలు తడుముకున్నాడట
గుర్రం గుడ్డిదైన దాణా తప్పదు
గొడ్రాలికేం తెలుసు బిడ్డల సంగతి
గొర్రెలు తినేవాడు పోతే బర్రెలు తినేవాడొస్తాడు
గోడకు చెవులుంటాయి
గోడదెబ్బ చెంపదెబ్బ
గోడమీద పిల్లి వాటము
గంతకు తగిన బొంత
గరిక మేసిన గాడిదే పోతుంది
గొర్రె కసాయి వాణ్ణె నమ్ముతుంది
గోటితో పోయే దాన్ని గొడ్డలిదాకా తెచ్చినట్లు
గోరు చుట్టుమీద రోకలిపోటు
గునుపూడి జంగాలు అమ్మకిల్లు కట్టినట్లు
గుడ్డి కన్ను తెరిచిన మూసిన ఒకటే
గోచికి చిన్న గోణాకి పెద్దా
గండంగడిచి పిండం బయటపడినట్లు
గాడిదకు గడ్డేసి ఆవుని పాలు ఇమ్మంటే ఎలా
గాదెలో గింజలు గాదిలో ఉండాలి బిడ్డలు బీరకాయల్లా వుండాలి
గాలికిపోయిన పేలపిండి కృష్ణార్పణం అన్నట్లు
గురువిందపూస గుద్దకింద నలుపెరగనట్లు
గొంతుకలో పచ్చివెలగకాయ పడ్డట్లు
గోడవతల గోలేటంటే కోమటి రహస్యాలన్నాడట
గోడకు కొట్టిన సున్నం, లంజకు పెట్టినసొమ్ము తిరిగిరాదట
గోవును గోలెం దగ్గరకు తీసుకొనివెళ్ళగలం గాని కుడితిని తాగించగలమా

చల్లకొచ్చి ముంత దాయడమెందుకు
చూసిరమ్మంటే కాల్చివచ్చాడట
చంద్రునికి ఒకనూలు పోగు లాగ
చచ్చినోడి కళ్లు చేరడేసి
చదవేస్తే ఉన్న మతిపోయిందట
చదువు కోకముందు కాకరకాయ అంటే చదువుకున్నాక
కీకరకాయ అన్నాడట
చెప్పేవి శ్రీరంగనీతులు, దూరేవి దొమ్మరి గుడెసెలు
చద్దన్నం తిన్న అమ్మ మొగుడాకలి ఎరుగదు
చావుకు పెడితేగాని లంకణాలకు రాదు
చాపు తప్పి కన్నులొట్టపోయినట్లు
చింత చచ్చినా పులుపు చావదు
చిన్న పామునైన పెద్ద కర్రతో కొట్టాలి
చీర సింగారించుకునేటప్పటికి ఊరు మాలు మణిగిందట
చెట్టు చెడే కాలానికి కుక్కమూతి పిందెలు పుట్టినట్లు
చెవిటి వాడి దగ్గర శంఖము ఊదినట్లు
చేతులు కాలేక ఆకులు పట్టుకున్నట్లు
చుట్టంగా వచ్చి దెయ్యమై పట్టుకుందట
చచ్చినోడి పెళ్లికి వచ్చిందే కట్నం
చెట్టుపేరు చెప్పి కాయలమ్ముకొన్నట్లు
చేసే చేసే కాపురం చెడగొట్టకపోతే నేను నీరంకు మొగుణ్ణే
కాదన్నాడట
చాదస్తపు మొగుడు చెబితే వినడు కొడితే ఏడస్తాడు
చూపుల గుర్రమే గాని చురుకు దనమే లేదు.
చెడి స్నేహితుని ఇంటికైనా పోవచ్చుగాని, చెల్లెలింటికి
పోకూడదు
చెబితే పాపంగాని తిరగేసి కొడితే చస్తుందన్నాడట

చెరపడానికి చేటపెయ్యి చాలు
చెరువు మీద కోపగించి ముడ్డి కడుక్కోవడము మానేసినట్లు
చెరువులో గేదెనెట్టి కొమ్ములు బేరమాడినట్లు
జోగి జోగి రాసుకుంటే బూడిద రాలిందన్నట్లు
జరుగుబాటుంటే ఆ జ్వరమంత సుఖంలేదు
జిహ్వకో రుచి పుర్రెకో బుద్ధి
డూడూ బసవన్న అంటే తలూపినట్లు
తడికెలు తినేవాడికి అప్పడాలు లెక్క అని
తక్కువ నోము నోచుకొని ఎక్కువ పుణ్యం రమ్మంటే వస్తుందా
తడిగుడ్డతో గొంతు కోసే రకము
తల ప్రాణం తోక్కొచ్చింది
తల తోక లేని కథలాగ
తల్లి పుట్టినిల్లు మేనమామ దగ్గర
తా చెడ్డ కోతి వనమెల్ల చెరచినట్లు
తాను పట్టిన కుందేలుకి మూడే కాళ్ళన్నట్లు
తాను దూరడానికి గంతలేదుగాని మెడకో డోలు అన్నట్లు
తాపుల గొడ్డుకి రోలడ్డము
తాను వలచింది రంభ తాను మునిగింది గంగ
తింటేగాని రుచి దిగితేగాని లోతు తెలియదు
తిండికి తిమ్మరాజు పనికి పోతురాజు
తిన్న ఇంటికి వాసాలు లెక్కపెట్టే రకము
తిట్టే నోరూ తిరిగే కాళ్లు ఊరుకోవు
తీగలాగితే డొంక కదిలిందని
తుంటిమీద కొడితే ముందుపళ్లు రాలినట్లు
తులసి వనములో గంజాయి మొక్క మొలిచినట్లు
తెగించిన వాడికి తెడ్డే లింగమన్నట్లు
తోడ సంబంధము తొంబై ఏళ్ళు దాకాపోదు

తుమ్మితే ఊడేముక్క ఎన్నాళ్ళుంటుంది
తల్లి కడుపు చూస్తుంది పెళ్లాం జేబు చూస్తుంది
తల్లికి కూడెట్టనోడు పినతల్లికి కోక పెట్టతాడా
తాతా పెళ్ళి చేసుకుంటావా అంటే ఇచ్చేవారెవరూ అన్నాడట
తాతల్నాడు నేతులు తాగాము మా మూతులు వాసన చూడమన్నట్లు
తాడిచెట్టు కింద పాలు త్రాగినా కల్లే అంటారు
తొక్కితే రాయి మొక్కితే దేవుడు
తద్దినం పెట్టేవోడి తమ్ముడిలాగ
తినబోతూ రుచి అడగకు
తన్నితే బూరెల బుట్టలో పడినట్లు
తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం
తాటాకు చప్పుళ్ళకు కుందేళ్లు బెదరవు
తద్దినం కొని తెచ్చుకున్నట్లు
తన్ను తప్పించి ఆకాశమంతా పిడుగుపడినా పరవాలేదు
తల్లి గండమూ కాదు పిల్ల గండమూ కాదు మంత్రసానికి గండమన్నట్లు
తాడూ లేదూ బొంగరమూ లేదూ
తీతూవు పిట్ట కాళ్ళు పైకెట్టి ఆకాశం పడకుండా ఆపు చేస్తున్నదంట
తేలొచ్చిందంటే వీధిలో మగవాళ్ళను పిలవవే అన్నాడట
తొండముదిరి వూసరవిల్లి అయినట్లు
దున్నపోతుమీద వర్షం కురిసినట్లు
దంపినమ్మకి బొక్కిందె దక్కుడ
దినదిన గండం నూరేళ్లు ఆయుసు
దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి

దున్నపోతు ఈనిందంటే దూడను కట్టమన్నాడట
దూరపు కొండలు నునుపు
దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడు
దొంగను తేలుకుట్టినట్లు
దొంగలు పడ్డ ఆరు మాసాలకు కుక్కలు మొరిగినట్లు
దొడ్డెడు దూడలు దొంగలెత్తుకుపోతే గొడ్డుగేదె శివా
లచ్చిమయిందట
దరిద్రుడి పెళ్ళికి వడగళ్ళ వాన
దూదేకులవాడికి దూడ తెగులు, లంజకి పిల్ల తెగులు
దొరికితే దొంగ దొరక్కపోతే దొర
దశకొద్దీ దొరికాడు బిసకత్తుల మొగుడు
దున్నపోతూ దున్నపోతూ పోట్లాడుకుంటే లేగదూడ కాలు
విరిగినట్లు
దొంగతల్లికి పడవ భయం
దొంగలు దొంగలూ కలసి ఊళ్ళు పంచుకున్నట్లు
నూరు అబద్దములాడి అయినా ఒక పెళ్లి చేయమన్నారు
నేతి బీరకాయలో నెయ్యిలాగ
నేల విడిచి సాము చేసినట్లు
నోరు మంచిదైతే ఊరూ మంచిదవుతుంది
నోరుంటే తెలవారుతుంది
నిజం నిలకడమీద తెలుస్తుంది
నక్క ఎక్కడ నాగలోకమెక్కడ
నలుగురితో పాటు నారాయణ కులంతో పాటు గోవిందా
నల్లేరు మీద బండిలాగ
నవ్వినా నాపచేనే పండుతుంది
నవ్వే ఆడదాన్ని ఏడ్చే మగాణ్ణి నమ్మకూడదంటారు
నవ్వు నాలుగు విధాల చేటు

నా కోడి కూయకుంటే తెల్లవారదన్నట్లు
నానాటికీ తీసికట్టు నాగంబొట్టు అన్నట్లు
నిండు కుండ తొణకదు
నిజమాడితే నిష్ఠూరము
నిత్యం చచ్చేవాడికి ఏడ్చేవాడెవడని
నిద్రపోయేవాన్ని లేపగలము కాని దొంగనిద్రపోయేవాన్ని
ఎవరు లేపగలరు
నివురుగప్పిన నిప్పులాగ
నేలనపోతూ నెత్తినకు రాసుకున్నట్లు
నక్క ఒకచోట ఉంటే ఇంకోచోట గారికళ్యాణం పాడదు
నిండా మునిగినవాడికి చలి ఏమిటి
నొసట రాత తుడిచినా పోదు
నక్కపుట్టి నాలుగు వారాలు కాలేదు ఇంతటి గాలివాన
నేనెపుడూ చూడలేదు
నలుగురితో చావు పెళ్ళితో సమానం
నీటిలో గేదెని బెట్టి బేరమాడినట్లు
నీ తలమీద తేలుంది అంటే నీచేత్తో తీసేయి అన్నట్లు
నే పుట్టకపోతే నీకు పెళ్ళామే లేకపోనంటే నువ్వు పుట్టకపోతే
నీ అమ్మని పెళ్ళాడుదు నన్నాడట
నోరున్నవాడిదే రాజ్యం
పనక లెత్తుకు పోయేవాడిని వదిలేసి పరకపరేవాడ్ని
పట్టుకున్నాడట
పాక పీకి పందిరేసినట్లు
యానాదోడు పందిరేస్తే పిచ్చికలు పడగొట్టాయి అంట
పెడితే పెళ్ళి పెట్టకుంటే శ్రార్థం
పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం లాగ

పాముకి పంటిలో విషము అజ్ఞానికి కంటిలో విషము
పొరుగుంటి పుల్లకూర రుచి
పోరు నష్టం పొందు లాభం
పండుగ నాడూ పాత మొగుడేనా
పొరుగూరి వాడికి నీటి భయం ఊళ్ళోవాడికి కాటి భయం
పుల్లవంపు పొయ్యి తీర్చినట్లు
పళ్ళున్న చెట్టుకే రాళ్ళ దెబ్బలు
పనిలేని మంగలి పిల్లితల గొరికినట్లు (పెండ్లాము తలగొరికాడట
పరుగెత్తి పాలు తాగేకంటే నిలబడి నీలు తాగడమే మేలు
పాడింది పాడరా పాసి పళ్ళ దాసరి అని
పాలు తాగి రొమ్ము గుద్దినట్లు
పిచ్చి కుదిరింది తలకు రోకలి చుట్టమన్నాడట
పిట్టపోరూ పిట్టపోరూ పిల్లి తీర్చిందన్నట్లు
పిడిక్కీ బియ్యానికి ఒకటే మంత్రము
పిల్ల కాకికేం తెలుసు ఉండేలు దెబ్బ
పిల్లి కళ్లు మూసుకొని పాలు తాగుతూ తనను ఎవరూ
చూడలేదన్నట్లు
పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణం సంకటం
పిల్లికి ఎలక సాక్ష్యం
పట్టుచీర ఎరువు ఇచ్చి పీటట్టుకు తిరిగినట్లు
పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతోగాని పోదు
పుణ్యానికి పోతే నీ మొగుడితో సమానంగా పెట్టు అన్నాడట
పురుట్లోనే సంధి కొట్టినట్లు
పులిని చూచి నక్కవాత పెట్టుకున్నట్లు
పువ్వులమ్మినచోట కట్టెలమ్మినట్లు
పెట్టనమ్మకు పెట్టిందే సాక్షి

పెద్దతలకాయ లేకపోతే ఎద్దుతలకాయ తెచ్చి పెట్టుకోమన్నట్లు

పెద్దపులి ప్రాణం పెట్టదు

పేదవాడి కోపం పెదవికి చేటు

పొట్టోడికి పుట్టెడు బుద్ధులు

పిండికొద్దీ రొట్టె

పుణ్యంకొద్దీ పురుషులు దానంకొద్దీ బిడ్డలు

పుల్లయ్య వేమవరం వెళ్ళి వచ్చినట్లు

పాత చింతకాయపచ్చడి పత్యానికి మంచిది

పంటపండిన మళ్ళా సంవత్సరం కరువు ఎక్కువ

పట్టపగలు కొంగుట్టుకుంటే రానిది రాత్రి చీకటిలో కన్నుకొడితే వస్తుందా

పనసకాయ దొరికినపుడే తద్దినం పెట్టమన్నట్లు

పుట్టలో పాలుపోసి పొట్ట తడుముకుందట

పెళ్ళికెడుతూ పిల్లిని చంకనెత్తికెళ్ళిందట

పేనుకి పెత్తనం ఇస్తే తలంతా తెగకొరికిందటా

పానకంలో పుడకలాగ

పెంపొకచోట ఉంటే కట్టు ఒకచోట కట్టినట్లు

పుండుమీద కారం చల్లినట్లు

పండుకి పుల్ల మొగుడు

పాపీ చిరాయువు

వెర్రివాడి పెళ్లాం వాడకంతా వదినే

పట్టుకున్నవాడు మట్టగిడస అంటే పైనున్నవాడు బొమ్మిడాం అన్నాడట

పారేసుకున్న చోటు వెతుక్కోవాలి

పిల్లి మెడలో గంటకట్టినట్లు

పూజల సొమ్ముతో పెద తిరపతి వెళ్ళినట్లు

పంచపాండవులంటే మంచం కోళ్ళులా ముగ్గురని రెండేళ్ళు చూపిందట

పడగ చుట్టం పాము పగ

పదిమందిలో పడ్డ పాము చావదా

పాండవుల సంపాదన దూదేకులవాడి పిండాకూళ్ళకు సరి

పాముకి పాలుపోసి పెంచినట్లు

పిచ్చి కుదిరితేగాని పెళ్లి కుదరదు పెళ్ళైతేకాని పిచ్చి కుదరదు

పిడుక్కూ వారశూలా

పిల్లి గుడ్డిదైతే ఎలుక ముడ్డి చూపిందట

పులి కడుపున పిల్లి పుడుతుందా

పులిమీద పుట్రలాగ

పెట్టకపోయినా పెట్టే ఇల్లు చూపమన్నారు

పెట్టనమ్మ పెట్టాపెట్టదూ పెట్టే ముండకే ఇబ్బంది

పెద్దింటి రంకు పెద్ద చెరువు కంపు త్వరగా పుట్టుకు రాదు

పేరు గొప్ప ఊరు దిబ్బ

పొమ్మనక్కర్లేదు పొగబెడితే చాలు

పోలీ పోలీ నీ భోగమెన్నాళ్లంటే మా అత్త మాలపిల్లినుంచి వచ్చేవరుకూ అందట

పరాయివాడితో లేచిపోతూ అత్తా నీ కొడుకుకు చద్దన్నం అలవాటు అందట

పైన పటారం లోన లొటారం

బూడిదలో పోసిన పన్నీరులాగ

బురదగుంటలో పందిలాగ

బోడెద్దుకు పోటీలు మప్పినట్లు

బతకని బిడ్డ బారెడు

బంగారం పళ్ళానికయినా గోడదాపు ఉండాలి

బయటపులి ఇంట్లో పిల్లి

బ్రహ్మచారి ముదిరినా బెండకాయ ముదిరినా పనికిరాదు

బెల్లము ఉన్నచోట ఈగలు ముసరవా

భోగందాని వలపు బొగ్గు తెలుపూ రెండూ రెండే

భక్తి లేని పూజ పత్రి చేటు

మనబంగారం మంచిదైతే కంసాలి ననవలసిన పనేమిటి

ముందు నుయ్యి వెనక గొయ్యి

ముందొచ్చిన చెవులకంటే వెనకొచ్చిన కొమ్ములువాడి

మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టు

మెత్తని వాణ్ణిచూస్తే మొత్తబుద్దేస్తుందట

మొండోడు రాజుకంటే బలవంతుడు

మొగుడు కొట్టినందుకు కాదు తోటికోడలు దెప్పినందుకేడ్చిందట

మోకాలికి బట్టతలకి ముడేసినట్టు

మంచిమనిషికో మాట మంచిగొడ్డుకో దెబ్బ

మంత్రాలకు చింతకాయలు రాలతాయా!

మొగుడు చస్తేగాని ముండకు బుద్ధిరాదు

మసిబూసి మారేడుకాయ చేసినట్టు

మాంసం తింటామని మడుసులు(దుమ్ములు)మెడలో కట్టుకోరు

మాటకు మాట తెగులు నీటికి నాచు తెగులు

మాటలు కోటలు దాటుతాయి కాళ్లు గడప దాటవు

మాటలునేర్చిన కుక్క ఉస్కో అంటే ఉస్కో అందట

మిన్ను విరిగి మీదపడ్డట్టు

మాయింటికొస్తే ఏంతెస్తావ్, మీయింటికొస్తే ఏంపెడతావ్

మేక వన్నె పులి

మంత్రసాని పని కొప్పుకున్నప్పుడు బిడ్డవచ్చినా పట్టాలి, గొడ్డొచ్చినా పట్టాలి

మందఎక్కువైతే మజ్జిగ పల్చనవుతుంది

మొదటిదానికి మొగుడులేనిది కడదానికి కళ్యాణమట

ముంజలు తిన్నవాణ్ణి వదిలేసి మోకులు తిన్నవాణ్ణి పట్టుకున్నాడట

మంద ఎక్కువైతే మరానికిచేటు
మొక్కవంగనిది మాను వంగుతుందా
మోసేవాడికి తెలుస్తుంది కావిడిబరువు
మింగడానికి మెతుకులేదుగాని మీసాలికి సంపంగనూనె
మనిషి మంచివాడే గాని గుణం గుడిచేటిది
మీ యింట్లో భోజనము చేసి మా ఇంట్లో చేయి కడుక్కో
ముళ్లకంచిమీద ఆరేసిన బట్ట మెల్లగా తీసుకోవాలి
ముందు నవవమని వెనకాల కొంకులు కొట్టే రకము
ముసలాడికి దసరా పండగని
మూడు మనువు లెల్లినా పొయ్యి ఊదడము తప్పలేదన్నమాట
మొగమాటానికి పోతే కడుపొచ్చిందట
మొగుడు చచ్చి మొత్తుకుంటుంటే మిండగాడొచ్చి మీద పడ్డాడట
యాదవ కులంలో ముసలం పుట్టినట్లు
రామా అంటే బూతు అయిపోయింది
రాజుల సొమ్ము రాళ్ళ పాలు
రాజుని చూసిన కళ్ళతో మొగుణ్ణి చూస్తే మొత్తబుద్దేస్తుందట
రామాయణం అంతా విని రాముడికి సీత ఏమౌతుందన్నాడట
రామాయణంలో పిడకలవేట
రొట్టె విరిగి నేతిలో పడ్డట్టు
రోలెల్లి మద్దెలతో మొర పెట్టుకున్నదంట
రాతుకొద్ది గుర్రం
రాతు మెత్తనైతే గుర్రం మూడుకాళ్ళమీద నడుస్తుంది
రంకు సాగితే పెళ్లెందుకరా పెదబాబూ అని
రంకు నేర్చింది బొంకు నేర్వదా అని
రామేశ్వరం పోయినా శనేశ్వరం తప్పలేదన్నట్లు
రాక్షసి బొగ్గులో రామ చిలుక

రజకచక్రవర్తి అంటే అంత పెద్ద పేరు మాకెందుక దొరా,
ఆ పేరు మీరే ఉంచుకోండన్నాడట
రాజుగారికి పెద్ద కొడుకైనా పుట్టాలి, భోగందానికి
తమ్ముడుగానైన పుట్టాలి
రాముడిలాంటి రాజుంటే హనుమంతుడిలాంటి బంటు ఉండాలి
రెండు చేతులు కలిస్తేగాని చప్పట్లుగావు
రొయ్యకు లేదా తెగ బారెడు మీసము
లంక మేత గోదావరి ఈత
లంజను లంజ అంటే నూరుసార్లు నువ్వే లంజ అంటుంది.
ఇల్లాలిని లంజంటే ఇంట్లో దూరుతుంది
వానరాకడ ప్రాణంపోకడ తెలియదు
వంకలేనమ్మ డొంకట్టుకుని ఏడ్చిందట
వట్టిగొడ్డుకు అరుపు లెక్కువ
వడ్లపుగింజలో బియ్యపుగింజ
విగ్రహపుష్టి నైవేద్యనష్టి
విత్తుముందా, చెట్టుముందా
వినాయకుడి మీద భక్తా, ఉండ్రాళ్లమీద భక్తా
విన్నన్న చెప్పిందే వేదము
వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లు
వెర్రివాడి చేతిలో రాయిలాగ
వ్రతం చెడ్డా ఫలం దక్కాలి
వండుకున్న వాడికంటే దండుకున్న వాడి పనేమేలు
వడ్డించేవాడు మనవాడైతే కడబంతిన కూర్చున్న ఫరవాలేదు
సాధన ముండకయినా వేవిళ్లు తప్పవు
వసుదేవుడు అంతటివాడు గాడిద కాళ్ళు పట్టుకున్నట్లు
విత్తొకటి వేస్తే మొక్కొకటి మొలుస్తుందా

వెధముండకి దణ్ణంపెడితే నాలాగే నూరేళ్లు బ్రతకమందట
శుభం పలకరా వెంకన్నా అంటే పెళ్ళికూతురు వెధవముండ అన్నాడట
శంఖంలో పోస్తేగాని తీర్థంగానట్టు
శెనగలు తిని చెయ్యి కడుక్కున్నట్లు
శివుడాజ్ఞలేనిదే చీమైనా కుట్టదు
శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు
శతకోటి లింగాల్లో ఈ బోడిలింగం మొకటి
సరదాకి సమర్తాడితే చాకలి కోకెత్తి కెళ్లిందట
స్వర్గానికి వెళ్లినా సవతిపోరు తప్పదన్నట్లు
సూదికోసము సోదికెళితే పాతరంకులు బయటపడ్డాయట
సిగ్గులేని ముఖానికి నవ్వే సింగారమని
సూర్యుడిమీద ఉమ్మితే తనమీదే పడుతుంది.
సిరి పోయి చీడ పట్టుకొన్నట్లు
చిత్రాల మొగుడు ఉత్తరాలు వేస్తే చింతాకుల్లో చిక్కుకు పోయిందట
సమర్త కీడు చాకలదాన్ని కొట్టినట్లు
సుబ్బమ్మ పెళ్లికి సూరమ్మ మూర్తాలని
సంచి లాభము చిల్లు కూడిందన్నట్లు
సరసుణ్ణి నమ్ముకుని ఉన్న మొగుణ్ణి ఊడగొట్టుకొందట
సత్రం భోజనము మఠం నిద్ర
సముద్రంలో కాకిరెట్ట
సరోజ పెళ్ళిలో గుర్రాజుకు పోగు
సాటివారితో సరిగంగ స్నానాలుచేస్తుంటే ముసలిమొగుణ్ని మొసలెట్టుకొని వెళ్ళిందంట
సిరి అబ్బదుగాని చీడ అబ్బుతుంది
హోరుగాలిలో దీపమెట్టి దేవుడా నీదే భారమన్నాడట
హనుమంతుడి ముందా కుప్పిగంతులు.

# జానపదుల తాంత్రిక విద్యలు

పురుషార్థములైన ధర్మార్థ కామ మోక్షాలను సాధించుటకు లౌకిక మార్గము లెన్నో ఉన్నాయి. పురుషకారము చేత సాధ్యము కాని కోరికలను సాధించుటకు తపస్సు మార్గము. అందులో కొన్ని సూక్ష్మ పద్ధతులున్నవి. వేగముగా మంత్ర సిద్ధిని పొందగలిగే పద్ధతులను తంత్ర శాస్త్రము అందిస్తున్నది. మంత్రోపాసకులకు తమ కార్యములను పొందుటకు, తెలిసికొనుటకు అవసరమైన విశేషాలన్నీ తంత్ర శాస్త్రము వలన లభించుచున్నవి. మంత్ర శాస్త్రము, వాటి విశేషాలను చెప్పే గ్రంథములకు తంత్రములనే పేరు ఏర్పడినది. మంత్రమును సిద్ధి పొందుటకు అవసరమయ్యే సామగ్రి అంతా తంత్రము క్రిందకే వచ్చును. అందులో ఉపయోగించు మూలికలు, హోమద్రవ్యములు, తర్పణ విశేష వస్తులన్నియు కూడ తంత్ర విభాగములే.

లౌకిక మార్గముల ద్వారా సాధించుటకు ఏది సాధ్యముగాదో, ఏది దుస్తరముగా ఉండునో దానిని తపస్సుచేత సాధింప వచ్చును. అయితే తపస్సాధన చాలా కష్టము. అటువంటి కష్టమైన పనిని తంత్రము ద్వారా సాధింప వచ్చును. ప్రతీ మనిషికి కొన్ని కోరికలుండును. అవి కొందరికి మాత్రమే నెరవేరుతాయి. కొన్ని కోరికలు తీరవు. తీరని కోరికలు మనిషిని వెంటాడును. అందువల్ల ఏ కోరికనైనా సాధించడానికి తంత్ర సహాయము అవసరము. తంత్ర శాస్త్రముల ద్వారా ఎటువంటి పనైనా సాధించటము దుర్లభము గాదు. నీకెవరిమీద నైనా కోపము వచ్చినదనుకో, వాడు లౌకికముగా నీకంటె ఉన్నతుడనుకో, ఏం చేస్తావు. అసమర్థతతో బాధపడక తప్పదు. ఎందువల్ల ననగా నీవు అల్పుడవు. కనుక ఇంద్రజాలము నేర్చుకో. ఏమైనా చేయవచ్చును. ఎంతటివారినైనా దాసోహము చేయించుకోవచ్చును.

ప్రాచీన కాలమునుండి తంత్ర శాస్త్రములు మనకు ఉన్నాయి. మహా విశ్వసార తంత్రములో యామళోడ్డీశ భూత డమరాదులు అరువది నాలుగు తంత్ర గ్రంథములు చెప్పబడినవి. ఇందు దేవతలయొక్క నదులయొక్క ఇతర దేవతలయొక్క మంత్ర, తంత్ర ధ్యాన, న్యాస పీఠావరణార్చనాది వివిధ విధులన్నీ స్పష్టముగా చెప్పబడినవి. శారదా తిలక మంత్రము పరమ ప్రామాణికమైన గ్రంథము. ఇది కేవలము సాంకేతికముగా నుండును. వ్యాఖ్యానము లేకుండా చదువుట చాలా కష్టము. మంత్ర మహారధి గ్రంథము దానిని వ్యాఖ్యానముతో కలిసి మంత్ర రత్నాకరము పేరుతో ప్రఖ్యాతి చెందినది. ఇందు 108 తంత్ర ప్రక్రియలు తెలుపబడినవి. కాళావళి నిర్ణయం అనే గ్రంథములో 72 తంత్ర గ్రంథములు చెప్పబడినవి. ఇంకను పరశురామ కల్పసూత్రములు, కుల చూడామణి నిగమము, కాలోపనిషత్తు, కామ రత్న తంత్రము మొదలైన గ్రంథములు ప్రముఖమైనవి. ఈ తంత్ర వాదులలో వామాచారులు, దక్షిణాచారులు అనే రెండు తెగలున్నవి. వామాచారులు, దక్షిణాచారులు ఒకరిమార్గంలో ఒకరు ప్రవేశించిన మంత్రదేవత వాళ్లను తింటుంది. అందువలన వారు తమ కులాచార సంప్రదాయములను అనుసరించి ఉపాసన చేయవలయును. వేద మంత్రమును వామ మార్గములో ఉపాసించుకున్నఎడల అది పిడుగు లాగ సాధకుని దగ్ధం చేయును. అదే విధముగా ఉచ్ఛిష్ట గణపతి విద్యకు శుచిగా మడికట్టుకుని జపము చేసిన కుదరదు. దానిని వామాచార మార్గములో అశుచియై దిగంబరుడై తాంత్రిక మార్గమున ఉపాశించవలెను. వేరేమార్గము లేదు. తాంత్రిక మార్గమున, వైదికుల యొక్క ఉపాసనా విధానములు భిన్నముగా నుండును. తాంత్రికులు ఉపాశించు విద్యలు అనేకము. ఈ విద్యలను మన పూర్వీకులు అనేక మంది ఉపాసించి ప్రయోజనమును పొందియున్నారు. పూర్వకవులు అనేకమంది తమ గ్రంథములయందు వివిధ తంత్ర విద్యలను ఆ విద్యల

వలన జరిగే లోకోపకారాలను తెలియచేసినారు. విక్రమార్కు-నికి వశమయిన భేతాళుడు, ఆకాశగమనము, స్వప్న విద్య, దివ్యదృష్టి మనుచరిత్ర యందు ప్రవరుడు పాదుకల ద్వారా హిమవన్నాగమన సౌందర్యమును దర్శించుట ఇవన్నియు తాంత్రిక విద్యలే. అంతేగాదు ఇటీవల కాలములో వచ్చుచున్న క్షుద్ర సాహిత్యము పేరన చేతబడి, కర్ణ పిశాచి, అంజన విద్య, ఉచ్ఛిష్టగణపతి, దెయ్యము, గ్రహములు పూనకములు మొదలగు వానినన్నింటిని సాహిత్యము నందు ప్రయోగించి పాఠకులకు పాతను కొత్త విద్యగా చూపుతున్నారు. తంత్రి శాస్త్రమునందు చెప్పబడిన కొన్ని తాంత్రిక విద్యలను సంగ్రహముగా తెలియబరచడమే ఈ వ్యాసముద్దేశము. దయిచేసి ఎవ్వరు ఈ విద్యలను అభ్యసించరాదు. అభ్యసించే వారు ప్రస్తుత చట్టములను దృష్టి యందు ఉంచుకొనవలసినదని మనవి. క్షుద్ర విద్యలను నేర్చుట చట్టరీత్యా నేరము కాదు.

పరిశోధకుడికి, పరిశోధనకు కావలసిన సామానులు, పరిశోధనాలయములు ఎలాంటివో, అట్లాగే మంత్ర తంత్రవేత్తలకు తమ లక్ష్య సాధనకు కొన్ని అనుకూలమైన ప్రదేశములు, పరిశోధన పరికరములు కావలసియున్నవి. అంతేగాదు తాను తలపెట్టిన కార్యము నిర్విఘ్నముగా జరగాలంటే కొన్ని ప్రదేశములు అవసరము.

"శూన్యాగారే నదీతీరే పర్వతే నిర్జనే తథా
బిల్వమూలే శ్మశానేవా తత్సమీపే వనస్థలే"

ఎవరు నివసించని ఇండ్లు, పాడుబడిన కొండలు, నిర్జీవములైన నదీ తీరములు, పర్వత శ్రేణులు, బిల్వ వృక్షములు, శ్మశానములు, దానికి దగ్గర వనములు, అనువైన ప్రదేశములు, ఇవి గాక అశ్వత్థ, వటాది వృక్షములు కూడ పనికి వస్తవి.

ఆయా మార్గములందు సాధన చేసి, సిద్ధులై, గతించిన వ్యక్తుల సమాధులు కూడ ఎంతో ఉపయోగిస్తవి, వామాచారము నందు

శ్మశానము ఎంతో పవిత్రమైనది. శ్మశాన సాధనల గురించి పూర్తి వివరములు కాల శాస్త్రమునందు వివరింపబడినవి. కాల సాధనకు కావలసిన ఉపకరణాలు అన్నీ శ్మశానమునందు లభిస్తాయి.

అర్ఘ్యపాదాలకు, తీర్థ ప్రాసాదాలకు, దీపారోపణనకు కపాలములు కావాలి. జపమాలికలకు అస్థికలు కావాలి. ఇవన్నీ ఇతరచోట్ల లభించవు. ఇటువంటి పరికరములతో సాధించే విద్యలను తాంత్రిక విద్యలందురు. ఈ విద్యలను పూర్వము మహనీయులు తమ తపస్సుచే సాధనచే సాధించిరని గ్రంథములయందు చెప్పబడినవి.

"శ్యామ వారే తమసాద్రయాం యామేయా తేచ సాధకః
కృష్ణ పక్షే విశేషణ సాధయే దనయాహితం"

రాత్రి ఒక ఝాము గడిచిన తరువాత మంగళవారము నాడు శ్మశానములోనికి వెళ్లవలయును. శుక్ల పక్షము కంటే కృష్ణ పక్షము అందులోను అష్టమినుండి చతుర్దశి వరకు విశేష సిద్ధిదాయకమైన సమయములు, అక్కడికి వెళ్లేటప్పుడు మాంసముతో కూడిన అన్నమును గాని, రక్తాన్నమును గాని, ఇతర నైవేద్యములతో పాటు తీసుకొని వెళ్లవలయును. స్వయముగా జంతు హింస చెయ్యనివాడు కూడ వీటిని సాధించి, దగ్గరుంచుకొనవలయును. జంతువులను చంపుటకు అభ్యంతరము లేనివాడు మేకను గాని, మహిషమును గాని, ఆయా, తంత్రములో చెప్పబడిన జంతువును గాని తీసుకొని వెళ్లి, ఏదైన ఒక చితి యొక్క పశ్చిమ భాగమున కూర్చుండవలయును. చితికి పడమట తాను కూర్చుని, తాను తెచ్చిన జంతువును స్వయంగా నరికి, బలి యిచ్చి, ఆ నెత్తురును అచట వెదచల్లి, శిరస్సును నివేదనం చేయవలయును. జంతువు తలమీద దీప వెలిగించడం ఒక ఆచారం. ఆ విధంగా జంతువులను ఖండించి, ఆ జంతు కళేభరములను నాలుగు దిక్కుల పడవేయవలయును.

బలిని యిచ్చిన తరువాత కుల సాధకుడు తన ఆసనానికి జప సాధనకు ఒక శవమును తెచ్చుకోవాలి. కర్ర, కత్తి, శూలము, పాము మొదలైన వాని చేత మరణించిన తరుణుడగు సుందరుని శవము మేలు. లేదా ఏడెనిమిది నెలల గర్భవతి కడుపులోని పిండముగాని, నెలలు నిండిన లేదా రెండు లేదా అయిదు సంవత్సరముల వయస్సు గల బాలుని శవము గాని మేలు. అది ఉత్తమము అని కాలశాస్త్ర మునందు చెప్పబడినది.

శవమునకు ధూపము వేసి, గంధమును పూసి, ఉపచారములు చేసి, సుగంధాది ద్రవ్యములతో కూడిన తాంబూలములను దాని నోటిలో నుంచి, అధోముఖముగా దానిని నుంచి, దిగంబరుడై దానిపై కూర్చుండి మంత్రమును జపించవలయును. ఆ జపము కూడ మారేడు చెట్టు దగ్గర లేదా ఆ వృక్షము క్రింద చేసిన మరింత శ్రేష్టము. జపానంతరము శవమును నీటిలో పడవేసి తిరుగు ముఖం చూడకుండ తిరిగి వెళ్ళిపోవలయును. సాధకుడు ఒక్కొక్కపుడు అర్చనలో తన వీర్యాన్ని కూడ ఉపయోగించాలని కాళీ తంత్రము చెబుతున్నది.

తెల్ల జిల్లేడు పూలను అపుడే తీసిన తన శుక్లముతో అద్దుచు మంత్రోచ్చారణ సహితముగా వేయి సార్లు మహాకాళిని పూజించిన వాడు మహారాజగును.

"శ్మశానస్థ స్వస్థోగళిత చికురోదిక్పటధర
స్సహస్రం త్వర్కాణాం నిజగలిత వీర్యేణ కుసుమమ్
జపం స్త్వాం ప్రత్యేకం మనుమపితవ ధ్యాన నిరతో
మహాకాళి స్వైరం స భవతి ధరిత్రీం పరిబృఢః"

మహాకాళి, తార, చిన్నమస్త, కర్ణపిశాచి, భేతాళుడు మొదలైన దేవతల ఉపాసనలు శ్మశానము నందు మాత్రమే సిద్ధిస్తవి. సాధన సిద్ధించిన భేతాళుడు వశమై సాధకునికి కోరిన పనులు చేయును. దీనినే బేతాళ విద్య అని అందురు. ఈ సాధన మనకు విక్రమార్కుని కథల యందు ద్యోతనమగును.

ఖడ్గ విద్య : ఇదియును గూడ శ్మశాన ప్రక్రియ. అష్ట లోహాలతో 50 అంగుళముల పొడవు కత్తిని చేయించి దాని మీద ఖడ్గమంత్రము 'రాసి, జపం చేసి, హోమమును చేయవలయును. తరువాత ఆ కత్తిని ఒక ప్రేత కళేబరంలో పెట్టి, ఆ కళేబరమును ఒక చెట్టు కొమ్మకు కట్టి అది ఎండిపోయే వరకు అక్కడే ఉంచాలి. కృష్ణాష్టమి నాటి అర్థ రాత్రి శ్మశానములో చితాగ్నిలో కాలి నుండి తల దాక వివిధావ యవములు మంత్ర సహితంగా హోమము చేయవలెను. బలి సమర్పించి ఆ ఖడ్గాన్ని స్వీకరిస్తే, అది ఎవరిని చంపి రమ్మంటే వారిని చంపి వచ్చును. విక్రమార్కుని కథల యందు చెప్పబడిన ప్రక్రియ, ఇదే. కృష్ణుని దగ్గరనున్న సుదర్శన చక్రము గూడయింతే

పాదుకా సిద్ధి : ఈ ప్రక్రియ వల్ల ఎంత దూరమైన క్షణకాల ములో వెళ్లవచ్చును. మారేడు చెక్క తెచ్చి మంగళవారము అర్థ రాత్రి శ్మశానములో పాతి, సాధకుడు మహిష మర్ధనీ మంత్రమును లక్షసార్లు జపం చెయ్యాలి. తరువాత ఆ కాష్టాన్ని తీసి దానిపై పాదుకా చిహ్నము వేయవలయును. దుర్గాష్టమి నాటి రాత్రి దానిని శ్మశానములో పూడ్చి దానిపై శవమును ఉంచి, దేవి పూజ చేసి. శవాసన గతుడై ఎనిమిది లక్షల సార్లు జపము చెయ్యవలయును పిదప బలిసమర్పించిన ఆ పాదుకను ఎక్కడికి తీసుకొని వెళ్ళమన్న అక్కడికి తీసుకొని వెళుతుందని, సాధకుడు స్వేచ్ఛా సంచారియై ఆనందించగలడని తంత్ర శాస్త్రము చెబుతుంది. మను చరిత్ర యందు సిద్ధుడు పాదలేప ప్రభావము చేత నాలుగు దిక్కులు చుట్టి వచ్చెను. ఇటువంటి పాదుక విద్యలయందు శవమునకు సంబందించిన ప్రేతాత్మ అందు ఆవేశించి ఆయా పనులను చేస్తుందనేది గ్రహించాలి. ఉజ్జయినీ రాజ్యమును పరిపాలించిన విక్రమార్కుడు చేసిన సాహసము లన్నింటి యందును, తంత్రాలే చాల ప్రముఖమైనవి. ఆతడికి భేతాళుడు వశం కావడము, ఆకాశయానం, ఖడ్గవిద్య, శవయానము మొదలగునవి ఆతనికి సిద్ధించిన విద్యలు.

సుప్రసిద్ధులైన రామప్రసాద్, రామకృష్ణ పరమహంస, కపాలాసనాల మీద జపించి సిద్ధవిద్యలను సాధించినట్లు వారి జీవిత చరిత్రలను బట్టి తెలుస్తుంది.

పురోలవలెనే ఎముకలతో చేసిన పూసలను మాలికగా గ్రుచ్చి జపమునకు వినియోగించడం వలన మంత్రసిద్ధి వేగంగా లభించే అవకాశము వుంది. ఎవరి ఎముకలను సాధనకు ఉపయోగిస్తారో వారి గుణములను వారికి సంక్రమిస్తాయి.

ఎముకలే కాదు శవము కాల్చిన బూడిద కూడ అనేక సాధనలకు పనికి వస్తుందని తంత్ర గ్రంథములు చెబుతున్నవి. చితాభస్మముతో రక్తాదులను కలిపి బొమ్మలు తయారు చేసి ప్రాణ ప్రతిష్ఠ చేసి పూజ చేయటము ప్రయోగ విధానాలలో చాలా ప్రాచుర్యము పొందింది. అభిమంత్రించిన శవపు బూడిదను ఇండ్లపై చల్లి, వివిధమైన ప్రయోగములు చేయట క్షుద్ర మాంత్రికులకు సాధారణమైన పని. గాని శ్మశాన వస్తువులన్నింటియందును ప్రేత శక్తులు అవహించి వుంటవి. వాటి స్పర్శ చాలా ప్రమాదకరం. అందువల్లన మన ప్రాచీనులు శవాన్ని తాకినా, చూచిన, శ్మశానానికి వెళ్ళి వచ్చినా సచేల స్నానము చేసి, దైవ దర్శనము చేసుకొని, దోష పరిహారము పొంది, అశుచి స్పర్శ వదిలించికొని ఇంటిలో ప్రవేశిస్తారు. కాని వామాచారులకు శ్మశానమే సర్వ సిద్ధులకు నిలయం, ఇందులో ప్రాణాపాయం కూడ లేకపోలేదు.

సంస్కృతమునందు నైషధీయ చరితమును రచించిన శ్రీ హర్ష కవి శవసాధన చేసిన వాడేనని చెబుతారు. శ్రీ హర్షుడు తండ్రి శ్రీహీరుడు. వాదములో ఒక పండితుని చేతిలో ఓడిపోయి అతని పాదుకలను అర్చించవలసిన దుర్గతి పట్టినది. ఆ అవమానముతో మరణించినాడు. అప్పటికే శ్రీ హర్షుడు బాలుడు. అతని తల్లి తన

భర్తకు కలిగిన పరాభవానికి ప్రతీకారము తనకుమారుని వలన జరగాలని ఆశించినది, దానికి శవ చింతామణిసాధన మొక్కటే శరణ్యమని ఆమె విశ్వసించి, తన బిడ్డకు ఆ మంత్రం ఉపదేశించి, ఆతనిని తనమీద కూర్చోబెట్టుకొని కండ్లు మూసుకొని జపం చేయ మన్నదట. శ్రీహర్షుడు అట్లాగే జపిస్తున్నాడు. ఆమె కత్తితో పొడుచుకొని గుంభనముగా చనిపోయినది. అది తెలియని బాలుడు శవమైన తన తల్లిపై కూర్చుండి జపించిన ఫలితంగా శవచింతామణి మంత్రాధి దేవత ప్రత్యక్షమై ఆతనికి వాక్సుద్ధిని ప్రసాధించినది. దాని ఫలితంగా ఆతడు తండ్రి పరాభవానికి ప్రతిక్రియ చేసాడు. లేని ఎడల ఆ బాలుడు ఎపుడు పెరిగి పెద్దవాడై విద్యావంతుడై తల్లి ప్రతిజ్ఞను నెరవేర్చును. ఒక వేళ ప్రాజ్ఞుడైన, ప్రత్యర్థి అప్పటి వరకు బ్రతికి యుండవలెను గదా.

ఇటువంటి ప్రక్రియలు చేయడానికి ఈ రోజుల్లో పూనుకోవడం విరుద్ధం సుమా !

<u>సూక్ష్మ శరీరము</u> : కంటికి కనిపించే పాంచభౌతిక శరీరం గాక, ప్రతీ మనిషికి కంటికి కనిపించని మరొక శరీరము ఉన్నదని యోగు లేనాడో గ్రహించి నారు. దానినే సూక్ష్మ శరీరము అందురు.

కర్మవశాత్తు మానవుడనుభవించవలసిన మంచిగాని, చెడుగాని ముందు సూక్ష్మ శరీరం మీదకు వస్తేగాని, తరువాత భౌతిక శరీరము మీదకు రావు. సూక్ష్మ శరీరాలను దర్శించగల దివ్య దృష్టి సాధించ గల వ్యక్తి, మనుష్యులకేయే మంచి చెడ్డలు అధ్యతన భావిలో జరుగ నున్నవో చెప్పగలుగును. స్థూల శరీరాన్ని ఆశ్రయించి యున్న మనస్సు అబద్ధం చెపుతున్నది. గాని సూక్ష్మ శరీరాన్ని ఆశ్రితమైన మనస్సు అబద్ధం చెప్పదు. మనిషికి ఏ కర్మ అనుభవం వచ్చినా, అది ముందు సూక్ష్మశరీరము మీద రూపు దాల్చిన గాని స్థూల మునకు దిగదు.

"మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్"

కృష్ణుడు అర్జునునితో భీష్మ ద్రోణాది ప్రతి పక్ష యోధులను గురించి చెబుతూ వీరంతా యిదివరకే నా చేత చంప బడ్డారు. నీవు కేవలం నిమిత్త మాత్రంగా బాణాలు వేయటం అని పలకడంలో యున్నటువంటి రహస్యమిదియే.

సూక్ష్మ శరీరమును వశం చేసుకొని, సూక్ష్మ శరీరము మీద చేసే ప్రయోగాలు చాలా వున్నాయి. అందులో ప్రధానమయినవి మనము చర్చించుకొందాము.

చేతబడి : క్షుద్ర మాంత్రికులు నిర్ణీత కాల వ్యవధిలో శత్రువుని, అతనియొక్క సూక్ష్మ శరీరము మీద తంత్రము ద్వారా ప్రయోగము చేసి చంపే విద్యలలో చేతబడి యొక్కటి. ఇవియే చిల్లంగి బాణామతి

తంత్రవేత్తలు, మాంత్రికులు, ప్రయోగాలు చేసేటపుడు చంపదలచు కొన్న మనిషి బొమ్మను చేసి దానికి ప్రాణప్రతిష్ట చేయుదురు. ఆ ప్రాణ ఆకర్షణ మంత్ర శక్తి వల్ల బొమ్మలోనికి సూక్ష్మ శరీరము ఆకర్షించ బడి బంధించబడుతుంది. బొమ్మకు ముల్లో, సూదో ఎక్కడ గుచ్చితే అసలు మనిషికి అక్కడ బాధ కలుగుతుంది. బొమ్మకున్న ఏ అవయ వానైనా విరిచి వేస్తే మనిషి శరీరంలో ఆ భాగము చచ్చుబడిపోతుంది. గుండెలో గుచ్చడమో, తల నరకడమో బొమ్మకు చేస్తే మనిషి మరణిస్తాడు. ప్రయోగము నందలి రహస్యమిదే.

సూక్ష్మ శరీరమును అతి సూక్ష్మాతి సూక్ష్మమైన ప్రదేశముల యందు భద్రపరచడము మనకు కాశీమజిలీ కథల యందు గానవచ్చు చున్నది. సూక్ష్మ శరీరమునకు, స్థూల శరీరమునకు అవినాభావ

సంబంధమున్నది. ఒక్కొక్కపుడు సూక్ష్మ శరీరము స్థూల శరీరము నకు తెలపకుండానే విచిత్ర పరిస్థితుల యందు విచిత్ర వ్యక్తులను కలుసుకోవడము, తదానందమైన అనుబంధములను అనుభూతులను సంపాదించుకోవడము జరుగుతుంది.

అవతారమూర్తులుగా ప్రసిద్ధికెక్కిన కొందరు సూక్ష్మశరీరాలతో భిన్న స్థలములో ఏక కాలమున దర్శనము యివ్వడము గూడ జరుగుచున్నవి. సూక్ష్మశరీరము కాలాతీతమైనది. క్షణమాత్ర కాలము నందు, ఏకకాలమున అనేక చోట్లకు దర్శనమీయ గలగడమే కాదు, అతీంద్రియ శక్తులు కలిగి యుండును. పుదుచ్చేరి యందలి అరవిందాశ్రమము (శ్రీ) మాత జీవితములో దీనికి సంబంధించిన ఒక విశేషము జరిగియున్నది. చిన్న వయస్సునందు ఆమె చేసిన సాధనల ఫలితంగా భౌతిక శరీరం నుంచి ఇచ్ఛాపూర్వకంగా వెలుపడి సూక్ష్మ శరీరముతో ప్రయాణము చేయగలిగినది. ఒకసారి ఆమె ప్రయాణము చేస్తున్న ఓడ సముద్రములో తుఫానునందు చిక్కుకుని మునిగిపోతుందా అన్న స్థితికి వచ్చినది. అది అంతరిక్షమునందున్న దుష్టశక్తుల యొక్క క్రీడగా ఆమె తెలుసుకొన్నది. ప్రక్కనే ఆమెకు యోగవిద్యా రహస్యాలు నేర్పిన గురువు కూడ యున్నాడు. అతని సలహాతో ఆమె భౌతిక శరీరం నుంచి వెలువడి సూక్ష్మ శరీరంతో ఆకాశంలోనికి ప్రయాణం చేసినది. అక్కడ మానవాతీత జీవులు కొంతమంది తమ ఇచ్ఛాశక్తి చేత ఈ ఓడను కావాలని ప్రమాదం కలగడం కోసం పెనుతుఫాను సృష్టించినట్లుగా తెలుసుకొన్నది. అంత ఆమె ఆ మానవాతీత శక్తులను శాంత పరచి నెమ్మదిగా దిగి వచ్చి తన శరీరంలోకి మామూలుగా ప్రవేశించినది. దాంతో క్షణకాలములోనే వాతావరణము ప్రశాంతంగానే మారిపోయి ప్రయాణము మామూలుగా సాగింది. సూక్ష్మదేహమును వశం చేసుకోవడము వలన ఇలాంటి ఎన్నో మహాకార్యములు చేయవచ్చును.

తెలుగు దేశమునందలి గుంటూరు మండలమునందు చాల సంవత్సరముల క్రిందట తుంగదుర్తి బుచ్చయ్యగారని ఒక మహానుభావుడుండెను. ఆయన యోగశక్తులు కలవాడు. ఆయన ప్రొద్దున్నే లేచి కాశీ, గయ ప్రయాగ మహాక్షేత్రముల యందు స్నాన సంధ్యాదులను చేసుకొని వచ్చేవాడు. ఆ ప్రాంతీయులు ఆయన స్వగ్రామము నందుండగనే తీర్థయాత్రలకు వెళ్లడము, బుచ్చియ్యగారిని ఆయా క్షేత్రములయందు చూడడము, ఇంటికి వచ్చిన తరువాత ఆయన ఆ రోజు ఊళ్ళోనే ఉన్నాడని తెలుసుకొని ఆశ్చర్యపోయేవారు. యోగ శక్తివల్ల బుచ్చయ్యగారు ఆయా క్షేత్రములకు తన సూక్ష్మ శరీరముతో ప్రయాణము చేసేవారు.

మనిషి నిద్రపోతున్నపుడు ఒక్కొక్కసారి సూక్ష్మ శరీరము కొన్ని వందల మైళ్ళు ప్రయాణము చేయవచ్చును. స్థూల శరీరమునకు, సూక్ష్మ శరీరమునకు చాలా బేధమున్నది. అందువల్ల నిద్రపోతున్న వ్యక్తిని హఠాత్తుగా నిద్రలేపరాదు. ఎందువల్లనంటే స్థూల శరీరము నుండి సూక్ష్మశరీరమునకు సమాచారము పంపవలసియున్నది. నిద్రలేపుతున్నపుడు ఆ వార్త స్థూల శరీరమునుండి సూక్ష్మ శరీరమునకు ఆ వార్తను చేరుస్తుంది. అలాగ హఠాత్తుగ లేపినపుడు మనిషి లేచి కూర్చుని భ్రాంతునివలె, జడునివలె ఉంటాడు. అందువల్లనే ఎవరినీ నిద్రలేపునపుడు హఠాత్తుగా లేపకూడదు. అందులోను పగటివేళ నిద్రపోతే సూర్యకాంతి ముందు సూక్ష్మ శరీరాలు కాంతిహీనంగా ఉండి ఒక్కొక్కసారి దూరంగా సంచరిస్తూ, తమ స్థూల శరీరమును గుర్తుపట్టి వెంటనే దగ్గరకు రాలేకపోవచ్చును. కనుక పగలు నిద్రపోవటం అంత మంచిది కాదు. అయితే ఇటువంటి ప్రమాదాలు ఎప్పుడో తటస్థించేవి కావు.

సమ్మోహన విద్యా ప్రవీణం చేత ఒక వ్యక్తిని హిప్నాటిజ్ చేసి అతని మనస్సును అజ్ఞాపించి, సుదూర ప్రదేశాలలో ఏం జరుగు

తున్నదీ చెప్పమంటే వశీకృతులు చెప్పగలుగుతున్నారు. ఎక్కడనో ఫలాన పుస్తకమందలి ఫలాన పేజీలో చదవమనగానే చదువగలుగు చున్నాడు. అంటే ఇక్కడ ప్రయాణము చేసేది సూక్ష్మ శరీరము గాని స్థూల శరీరము కాదు.

స్థూల శరీరము ఇక్కడ ఉండగానే సూక్ష్మ శరీరం స్థూలంతో సంబంధము లేని వ్యక్తులను కలవటము, మాటలాడడము, అనుబంధము లేర్పరచుకోవడము జరుగుచున్నది. అంతేగాదు సూక్ష్మ శరీరముతో తపస్సు చేయుడము గూడ యున్నది. రమణీ ప్రియదూతిక నవల యందు పెద్దన కొరకు లచ్చన ఆతని సూక్ష్మ శరీరము చేత తపస్సు చేయించి ఆ తదనుభవమును అతనికి ఒసంగెను. ఆ ఫలితముగా అతడు ఆ సిద్ధిని పొందెను. సూక్ష్మ శరీరము చేత తపస్సు చేయించగా, ఆ ఫలితము స్థూల శరీరము మీదకు రాగా, ఫలితము పొందెను. అందు వలన స్థూల శరీరమునకు. సూక్ష్మ శరీరమునకు అవినాభావ సంబంధము కలదు.

<u>ప్రేత లోకము - విశేషణములు :</u> శరీరము ధరించిన ప్రతీ జీవి తప్పించుకోలేనిది మరణము. సృష్టిలో కొంచెము ముందుగానో, వెనుకగానో తమ దేహాలు విడిచిపెట్టి లోకాంతరగతుడు కావలసినదే. సామాన్య మనుష్యుల దగ్గరనుండి, అసామాన్యులైన వ్యక్తులు గూడ ఈ స్థితిని తప్పించుకోలేరు. కాకుంటే కొందరు అల్పాయుష్కులు, కొందరు దీర్ఘాయుష్కులు. జీవులకు మరణమనేది అత్యంత బాధాకర మైన స్థితి. తరువాత స్థితి ఏమిటి అనే దాని గురించి అన్ని మతముల వారు అందును యోగులు ఆలోచించినారు. ప్రశ్నలు వేసుకొన్నారు. ఎవరకు తగినట్లుగా వారు సమాధానము ఇచ్చుకొనుచున్నారు.

చరాచర సృష్టి జగత్తునందలి ప్రతీ ప్రాణి మరణించడము జరుగు చున్నది. ప్రాణులలో మనుష్యులు మాత్రమే జన్మించడం జరుగు

చున్నది. పశుపక్ష్యాదులు మరణించిన తరువాత మరల జన్మ నెత్తుటము జరుగుట లేదు.

చనిపోయిన తరువాత జీవుడికి, యమ దూతకు పేచీలు వచ్చిన సంఘటనలున్నాయి. అందులకు మనకు నిదర్శనము లలితోపాఖ్యానము నందు కలదు. ద్విజవర్మ అనే కిరాతకుడు అడవినందు ఉండెడివాడు. ఆ ప్రాంతమునందు వజ్రుడనే దొంగ దొంగిలించిన ధనాన్ని భూమిలో పాతి పెడుతూ ఉండగా కిరాతకుడు అపహరించినాడు. ఎందరు ధన వంతుల ఇండ్లలోనే దొంగిలించిన ధనమది. కిరాతకుడు ఆ ధనముతో అడవిని బాగు చేయించి, అగ్రహారములు కట్టించి చెరువులు త్రవ్వించి. శివ, విష్ణు దేవాలయములు కట్టించి, పుణ్యకార్యములు చేసినాడు. ద్విజవర్మ చనిపోయిన తరువాత యమ దూతలు, విష్ణు దూతలు వచ్చి పోట్లాడుకోగా నారదుడు వచ్చి వారిని శాంతపరచి దొంగిలించబడిన ధనము ఎవరిదో వారు చనిపోయే వరకు, ద్విజవర్మ ప్రేతరూపుడుగ అంతరిక్షంనందు ఉంటాడు. తరువాత పుణ్యాను భవనమున స్వర్గమునకు వెడతాడని దేవర్షి చెప్పిన మీదట వాళ్ళు వెళ్లినారు.

జీవులీ విధంగా కొంతకాలం పాటు స్వర్గమునకు, నరకమునకు వెళ్లకుండా అంతరిక్షములో ప్రేతలై తిరుగాడుతుండగ, ఆ విధంగా తిరిగే ప్రేతాత్మలు మాంత్రికుల అవాహనకు దొరుకును. అంతేగాని ఇతర లోకములకు వెళ్లిన వాళ్లు మాంత్రికులకు దొరకరు.

మృతి చెందిన తరువాత అంగుష్టమాత్ర దేహరూపుడైన జీవుడు తన శరీరాన్ని చూస్తూ చుట్టూ చేరి దుఃఖిస్తూ ఉంటాడు. ఆతనికి పిశాచత్వం రాకుండా ఉండడము కోసము సంతానము కర్మ చేయాలి. పదిరోజుల పాటు పిండోదక దానాలవల్ల ఇంకొక శరీరములో పుట్టి జీవుడు దాంట్లో ప్రవేశిస్తాడని గరుడ పురాణం పలుకుతున్నది. పది రోజుల కర్మలు పూర్తయ్యే సరికి హస్తమాత్ర ప్రమాణము కలిగిన

దేహముతో పదకొండవ, పన్నెండవ రోజున తీవ్రమైన ఆకలి దప్పి కలతో పిండదానాదులను తింటూ, పదమూడవ రోజున యమకింకరుల పాశాల చేత కట్టబడి హాహాకారాలు చేస్తూ యమలోకమునకు చేరును. ఆ పిదప కర్మననుసరించి పుణ్యపాప ఫలితమైన సుఖ దుఃఖా లను అనుభవించి మళ్లీ భూలోకం చేరి జన్మ ఎత్తుతాడు.

స్వయంగా పుణ్యం చేసుకొన్నవాడికి పుణ్యలోకము, సద్గతులు ఎలా లభించునో అల్లే మరణించిన వ్యక్తికి పితృ పిండోదకాలు, శ్రార్థ కర్మలు చేసిన అటువంటి పుణ్యము లభించును. శ్రార్థ కర్మ ద్వారానే పిన్నలు, పెద్దల యొక్క ఋణములు తీర్చుకోగలుగుతారు.

<u>గ్రహములు</u> : గ్రహములు పలు రకములు. అవి నిర్దిష్ట సమయము లందు ఆయా మనుజులను ఆవహిస్తాయి. దేవగ్రహములు పున్నమి దినమున, అసుర గ్రహములు సంధ్యా సమయమున, గంధర్వ గ్రహా ములు అష్టమి దినమున, యక్ష గ్రహములు పాడ్యమి దినమున, పితృ గ్రహములు అమావాస్య దినమున, నాగ గ్రహములు పంచమి దినమున, రాక్షస గ్రహములు రాత్రివేళ, పిశాచములు చతుర్దశిన, మనుష్యుల యందు ప్రవేశించి, తమ ప్రభావము చేత మానవ శరీరమును పాడుచేయును. లోకంలో అధికముగా ప్రేతావేశములే ఎక్కువ. వాళ్లలో రకరకముల మనస్తత్వాలు కలవాళ్లుండును. వారి వారి అవసరములను బట్టి ఆవేశించి, ఆ మనుష్యుల చేతపనులు చేయించుకుందురు.

ఒక ఉద్యోగినిని ఒక ఉపాసకుడు మరణించిన తరువాత దయ్యమై పట్టినాడు. కర్మ పరిపక్వమై ఇతని ప్రేతత్వము పోయి ఉత్తమ గతులకు వెళ్లాలంటే దేవతా పూజ రోజు చేయడం అవసరం అని అతడికి అని పించింది. తాను పట్టిన మనిషి చేత నిరంతరము దేవతార్చన, సహస్రనామ పారాయణం చేయుమని చెవుల్లో పోరుతూ ఉండేవాడు.

అలా చెయ్యక పోతే వెంటనే అతనిలో ఏదో బాధ కలిగేది. ఆ బాధ భరించలేక పట్టినవాడి ఆజ్ఞ ప్రకారము అర్థరాత్రి అపరాత్రి అని తలచక తలమీద స్నానంచేసి కఠోర నియమాలతో పూజలు చేసేవాడు. ఈ విధంగా కొన్ని సంవత్సరములు గడిచిన తరువాత ఆ ప్రేత జీవుడు ఈ శరీరాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయేవాడు. ఈ మనిషికి సహజ స్థితి వచ్చింది. ఇపుడు అర్థరాత్రి, కఠోర నియమాలు లేవు. ఇంతకు ముందున్న అలవాట్లే మిగిలినవి. అట్లే మరొక సంఘటన. ఒక కళాశాలయందు ఒక ఉద్యోగిని వయస్సు ముదురుతున్న తల్లి దండ్రులెంత బ్రతిమాలుతున్న పెండ్లి చేసుకోనని నిరాకరించినది. వైరాగ్యం పండిని యోగినియా ? కాదు. భక్తురాలా ? కాదు, కనీసం జ్ఞానతృష్ణ కలిగినది కూడ కాదు. సంగతి ఏమిటో తెలుసుకుందామని ఒక ధార్మికుడు తన యోగ దృష్టిచే ఆమెలో ప్రవేశించినాడు. ఆమె సూక్ష్మ శరీరమును పూర్తిగా ఆక్రమించుకొన్న జీవుడు మరొకడున్నాడు. వాడు పూర్వము బ్రతికున్న రోజులలో వాళ్లింటికి వచ్చే ఒక పెద్దమనిషి. ఆమెను తన మనస్సులో తీవ్రంగా వాంఛించాడు. వయస్సు యొక్క తారతమ్యమును బట్టి, అవస్థా భేదమును బట్టి తన కామ వాంఛను ఎన్నడు ఆమె దగ్గర వ్యక్తం చేయలేదు. కాలవశమున మరణించి, ప్రేతమై తీరని కోరికతో వాడు నిత్యము రమించుచున్నాడు. ఈ కన్య ఏమి కన్య ? లోకం దృష్టిలో కన్య, నిత్యము స్ఖలిస్తూనే యున్నది. రోజు రోజుకు శరీరం బలహీనమవుతూ ఎంత తిన్నా, ఎంత సుఖంగా ఉందామని ప్రయత్నించినా, ఏదో అసంతృప్తి అవహించి ఉంటున్నది. ఆ కాముక ప్రేత జీవుడు ఆమెను రోజూ అనుభవిస్తూనే యున్నాడు. తననెవడో నిత్యము భోగిస్తున్నాడని ఆమెకు తెలియదు. అప్పుడప్పుడు వయస్సు సహజంగా ఏవో అటువంటి కోరికలు కలల వేళ కలుగుతున్నవి. కాని తర్వాత గుర్తుండవు. అ కాముకుడు ఆమె మనస్సునకు తెలియకుండా శాసించాడు. ఆమె తన తోటివారిలాగే పెండ్లాడి కుటుంబ జీవితం గడపాలని కోరిక

ఉండేది. కాని సమయం వచ్చే సరికి తెలియని ప్రేరణ చేత ఒద్దని తిరస్కరించేది. ఇలా ఎందరి జీవితాలలో దుష్ట పీడశక్తుల ప్రభావము చేత పాడవుతు ఉంటున్నాయి. భార్యాభర్తల మధ్య అనుబంధాన్ని గూడ చెడగొట్టును. ఒక్కొక్కసారి వివాహ బంధములను చెడ గొట్టును.

తీవ్రమైన కోరికల చేత తపించి, అవి తీరక మరణించినవారు ప్రేతత్వమును పొంది, ఆ కాంక్ష తీవ్రతచేత మరుసటి జన్మయందు జన్మించడం జరుగుతున్నది. అనంతామాత్యుని చేత రచింపబడిన భోజరాజీయమునందు ఈ విషయమును గురించిన గాథ యున్నది. ఒకసారి గంగ, యమున, సరస్వతి నదుల సంగమ స్థానమునకు ముగ్గురు కన్యలు వచ్చారు. ఒక అమ్మాయి తనకు లోకోత్తర సౌందర్యవంతుడైన ఒక యువకుడు మరుసటి జన్మలో తనకు భర్త కావాలని కోరుతు నీటిలో దూకి మరణించినది. ఇంకో బాలిక తనకు శౌర్య, ధైర్య, సాహసాది, సద్గుణోపేతుడు మరుజన్మలో పతికావాలని కోరుతూ నీటిలో దూకి మరణించినది. ఇంకో కన్య భూమండలాన్ని ఏకచ్ఛత్రాధిపతిగా పరిపాలించే మహారాజు మరుజన్మలో భర్తగా కావాలని కోరుతూ నీటిలో దూకి మరణించినది. ఇదంతా చూస్తున్న ఒక పేద యువకుడు రాబోయే జన్మలో ఈ నలుగురు తన భార్యలు కావాలని ప్రయాగ మాధవుణ్ణి ప్రార్థిస్తూ సంగమంలో దూకినాడు. ఆ యువకుడే భోజరాజు.

బలాత్కారంగా ఆత్మహత్య చేసుకొన్న వాళ్లు ప్రేతాత్మలై తిరుగుతూ ఉంటారు. రోడ్డు, రైలు, ప్రమాదాలు జరిగే చోట్ల కొంచెము జాగ్రత్తగా పరిశీలిస్తే సామాన్యంగా ఒకసారి ప్రమాదం జరిగిన చోటనే మళ్ళీ, మళ్ళీ ప్రమాదాలు జరుగుతుంటాయి. అక్కడ లోగడ చచ్చిన వారు తమలోకి ఇతరులను చేర్చుకోవడం కోసం

కావాలని ప్రమాదాలు సృష్టించును. డ్రైవర్ల మనస్సులను వికలం చేయడం ద్వారా ఘోర సంఘటనలను కలిగించును. వంతెనలు, రావిచెట్లు, కాలువలు, గ్రామదేవతల గుళ్ళు, పాడుబడిన ఇళ్ళు, పూజా పునస్కారాలు లేని ఆలయాలు, స్మశానాలు, వీటి ప్రక్కగా పోయే టపుడు వాహనాల వాళ్ళు చాలా జాగ్రత్తగా ఉండడం అవసరము.

ఒక వృద్ధురాలు రోగగ్రస్తురాలై మరణించినది. ఆమెకు తన కున్న ఒక్క కూతురు యందు చాలా ప్రేమ. ఆమె చనిపోయిన కొన్నాళ్ళకు ఆమె కూతురుకి కూడా అదే వ్యాధి వచ్చింది.

ఒక మాంత్రికుడు తన దర్శనంలో చూస్తే ఆ తల్లి ప్రేతమై కూతురుని పట్టుకున్నట్లు కనిపించింది. అతడడిగాడు ఇదేమిటి? లోకంలో ఎవరయినా విరోధులను పట్టి పీడిస్తారు. రోగాలతో బాధి స్తారు. చంపుతారు. కాని నీవేమో నీ కూతురుని పట్టుకొన్నావు. ఆమె నీకెంతో ఇష్టమైన బిడ్డకదా? ఏమి యీ విపరీతము? అని అతడు అడిగాడు. ఆమె చాలా విచిత్రంగా సమాధానం చెప్పినది. నా కూతురు చస్తే వచ్చే నష్టమేమిటి? నేను చావలేదా? నా అల్లుడు నా బిడ్డను సరిగా చూచుటలేదు. అందువల్లన అమ్మాయిని తీసుకొని వెళ్ళిపోదామని వచ్చాను. నాకు తోడుగ ఉంచుకుంటాను. పాపం ఆ కూతురుకి తెలియదు తన తల్లే పీడిస్తున్నదనీ, ఆ పీడించడానికి ప్రేమే కారణమని.

మరణించేవరకు చావంటే చాలా భయం. తర్వాత ప్రేతాత్మకు మనుష్యులను చంపడం పెద్ద దోషంగా కన్పించదు. అందువల్ల ఇది ఒక దుర్భలమైన అవాంఛనీయ దశ.

<u>భూతావేశము :</u> ఆవేశము అన్నది చాలా ఉధృతముగా నుండును. అంతకు పూర్వము సహజముగా లేనటువంటి విపరీతమైన ఉధృతము

కలిగి, చూపరులకు భయము, విస్మయము కలిగించేదిగా ఉండును. మరి భూతము అవేశించినపుడు మనుష్యులు ఎంత కష్టమైన పనినైనను అవలీలగా చేయుదురు. ఇప్పటికీ మనము వీరభద్రుని ఉత్సవములందు, జాతరల యందు, గుండముల యందు దూకేవారు, నారసాలు గ్రుచ్చుకోనేవారు, కనబడుచున్నారు. వాళ్లు ఆ క్రియలు చాల ఆవేశముగా చెయడం చుస్తూంటాము. సిడుల పుత్సవము కూడ కేవలము ఆవేశముతో చేసే ఒకానొక ప్రక్రియే. ఇటువంటి ప్రక్రియలు పూర్వమే ఉన్నట్లుగా మనకు ప్రాచీన కావ్యములయందు కనిపించు చున్నవి. క్రీడాభిరామ కావ్యమునందు, పాండురంగ మహాత్మ్యము నందు ఇటువంటి ప్రక్రియలు ఉన్నట్లుగా మనకు తెలియుచున్నది.

నేటి సాక్ష్యముగ 24-7-1987 ఉదయం దినపత్రిక ఆదివారం అనుబంధము నందు సింహళ దేశమున సిడుల ఉత్సవ సందర్భమున ఒక వీరావేశభక్తుడు ఒక మర్రి వృక్షమునకు గేలమును తగిలించు కొని, ఆ గేలమును తన శరీరమునకు తగిలించుకొని, నిరాధారమై ఆకాశమునందు తేలియాడినట్లుగ నుండెను. అంత భక్తులు ఆతనికి నివాళులు అర్పించెదరు. అంత అతడు వీరావేశముతో భక్తుల ప్రశ్న లకు, దేశమునకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానము లిచ్చెను. ఆ ప్రశ్నలకు జవాబులు దేవతలు యిచ్చినట్లుగానే భావింతురు. ఇవి కేవలము ఉద్రేకముగా, ఆవేశముతో చేయుదురు. అతడు చేప్పే వన్నియు జరుగునా? కొన్ని జరుగక పోవచ్చును. కొన్ని జరగవచ్చును.

ప్రాచీన కావ్యమున పాండురంగ మహాత్మ్యము నందు ఇటువంటి ప్రుద్రేకముతో కూడిన ఒక ప్రక్రియ చెప్పబడినది. ఒక పొడుగాటి స్తంభం పాతి దాని చివర కర్రకట్టి, ఆ కర్ర చివర ఒక గాలం వంటి దానిని శరీరంలో కొంత భాగం గుచ్చి, ఆపైన అంతరిక్షంలో వ్రేలా డుతూ వుంటే నాలుగువైపులా ఆ కర్రను త్రిప్పుతూ ఉండడం జరుగు

తుంది. గ్రామ దేవతలకు మొక్కులు మొక్కుకొని, తమ కోరికలు తీరిన తరువాత, భక్తులు తమ మ్రొక్కులు తీర్చుకొనే పద్ధతులలో సిడివేలటం ఒకటి,

క్రీడాభిరామం నందు అటువంటి పనులను వర్ణించిన సంఘటనలున్నాయి.

"రవ రవ మండు ఎర్రని చంద్ర మల్లెల
చోద్యంపు గుండాలు చొచ్చువారు
కరవాడి అలుగుల గసప పాతర్లలో
ఉట్టి చేరులు గోసి ఉరుకు వారు.
గాలంపు గొంకి కంకాళ చర్మము గ్రుచ్చి
ఉడు వీధి నుయ్యేల లుగువారు
కటికి హొన్నాళంబు గండకత్తెర వట్టి
మిని మింతులను గాక మ్రింగువారు
సందులను నారసంబులు సలుపువారు
ఎడమ కుడి చేత నారతులిచ్చువారు
సాహసము మూర్తి గైకొన్న సరణివారు.
ధీర హృదయము మైలార వీరభటులు"

ఈ క్రియలన్నింటిని చూచిన చాల భయంకరముగా నుండును. అల్లే మహమ్మదీయుల పీర్ల పండుగ సందర్భముల యందు గుండములను త్రొక్కుట మొదలగు శకకృత్యములు గూడ ఈ కోవకు చెందును.

ఈ ఆవేశములు కూడ అవి పట్టుకొన్న గణములను బట్టి అనుసరించి యుంటవి. రాక్షస గ్రహములు పట్టుకొన్నపుడు విపరీతముగను, దివ్యాంశ సంభూతులు ఆవేశించినపుడు వేరుగను ఉంటాయి.

దివ్యాంశ సంభూతులను కూడ భూతగణము ఆవేశింపగలదు. భారతమునందు ఘోషయాత్ర ఘట్టములో ఒక విచిత్రమైన అంశము ఉన్నది. గంధర్వుల చేత అవమానం పొంది, భీమార్జునులచే విడిపింపబడి, ధర్మరాజు చేత మందలించబడి తిరిగి వెళుతూ, మానధనుడైన దుర్యోధనుడు మరణించాలని నిశ్చయించుకొని, ప్రాయోపవేశంనకు పూనుకొన్నాడు. అతడప్పుడే మరణించడం, పాతాళ లోకంలోని రాక్షసుల కిష్టము లేదు. వారు హోమము చేసి, ఒక కృత్యను అవాహన చేసి దాని సహాయంతో దుర్యోధనుని తమ దగ్గరకు రప్పించుకొని, ఆతని జన్మరహస్యమును తెలియచేసి, రాబోయే మహాసంగ్రామమునందు పాండవులను తప్పక గెలుస్తావని చెబుతూ పాండవ పక్షపాతులైన భీష్మ, ద్రోణార్జునులను ఆవేశించి యుద్ధ సమయంలో వారిచేత క్రూర సంగ్రామము చేయించి, పాండవ నాశనం చేస్తామని మాట యిచ్చారు. అందువల్లన దివ్యాంశ సంభూతులు గూడ మనుష్యుల యందు ప్రవేశించగలరు.

సామాన్యుడైన ఒక యువకుడొకడు తన ఊరి జమీందారు కూతురును మనసార ప్రేమించినాడు. ఆతనిని గూడ ఆ అమ్మాయి వలచినది. కాని దారిద్ర్యం అడ్డుగా నిలిచినది. జమీందారు ఆతని మీద నేరారోపణ చేసి, ఆతనికి మరణ శిక్ష విధించినాడు. తెల్లవారిన ఉరిశిక్ష. నాటి రాత్రి ఆతడు జైలు గోడమీద లిఖించబడి యున్న ఒక పురాతన లేఖనము చూచినాడు. అది ఒక పిశాచ మంత్రము. చదువగనే భూత నాథుడు ప్రత్యక్షమైనాడు. ఆతనిని అన్ని కష్టములనుండి గట్టెక్కించి, ఇరవైనాలుగేండ్లు కోరిన సుఖములను ప్రసాదించును. భోగాలలో ఓలలాడించెదను. కాని ఈ కాలంలో ఆతడు దేవాలయము నందు ప్రవేశించరాదు. స్మరణ చేయరాదు. ఇరువది నాలుగు సంవత్సరముల తరువాత ఆతడు తన వశం కావలసియుంటుందని భూతనాధుడు హెచ్చరించినాడు. మృత్యుముఖ

మున నున్న ఆ యువకుడు కోరి చావును కొని తెచ్చుకోలేక భూతనాదుని నియమాలను అంగీకరించెను. అనియత కాలమున మహాభోగాలను అనుభవించినాడు. భూతావిష్టుడైన అతడు చేయలేని పనిగాని, సాధించలేని కార్యము గాని ఉండేది కాదు. అపార సుఖముల ననుభవించి, తరువాత పాప పంకిలములో కూలిపోయినాడతడు.

క్షుద్రోపాసనల వలన ఫలితములు విపరీతముగా ఇట్లు ఉండును. ఎవడు ఏ దేవతను ఉపాసిస్తే అంతమున ఆ దేవతా లోకమునకు వెళ్లును. భక్తుడు భూతములను, పిశాచములను ఉపాసించిన వాడు, తాత్కాలికంగా ఒక మెరుపు మెరిసినట్లు ప్రకాశించినా అంతమున ఆ పిశాచ గుణగణములలో తాను ఒకడై ఆ పిశాచము చెప్పిన పనులకు ఇష్టమున్నను, లేకపోయినను చేయుచు ఉండవలసి వచ్చును. దేవత భక్తుని రక్షిస్తుంటే, భూతము రక్షించినట్లు ప్రసాదించినట్లు కనిపించి చివరకు భక్షిస్తుంది.

దేవతను ఉపాసించినవాడు దేవత అవుతాడు. పిశాచమును ఉపాసించినవాడు పిశాచవుతాడు. తామసములైన భూత ప్రేతముల ఆవేశం వల్ల మేలు జరుగదు. అప్పటికేదో కొంత ఉపకారము జరిగినట్లు అనిపించిన, తుదకు వచ్చేది అపకారమే, ఆ భూతాదుల గుణములు ఆ భక్తుడికి సంక్రమించి చివరకు అతడు గూడ భూతమవుతాడు. అధోగతిపాలు చెందును. అందులకే క్షుద్రం వ్యర్థం అందురు.

<u>గ్రహములు</u> : దేవత్వమునుండి, హింసావికారములు గల వాటిని తాంత్రికులు గ్రహములందురు. ఈ గ్రహములనే దయ్యములందురు. గ్రహములకుగాని, దయ్యములకుగాని నిర్దిష్టమైన ఆకారము లేదు.

మానవలోకములో కొందరు తీవ్రమైన అసంతృప్తితో మరణించినవారు, కామక్రోధములు ఎక్కువగా వుండి, అవి తీరక చనిపోయినవారు, బలవన్మరణము, ఆత్మహత్య చేసుకొన్నవారు, ప్రమాదములయందు పోయినవారు, సాధారణముగా ప్రేతత్వమును పొందుతారు. మాంత్రికులు తమ కార్యసిద్ధి కోసం ఈ ప్రేత జీవులను వశం చేసుకొందురు. మంత్రసిద్ధి చేత సాధించిన వశీకరణ చేత ప్రేతములను ఆవాహన చేయగలిగిన వాడు, వాటినుండి ఎన్నో విశేషములను తెలుసుకొని, తన పనులకు వాటిని ఉపకరణములుగా వాడుకొందురు. మంత్ర తంత్ర సహాయముతో ప్రేతాత్మలను అదుపులోనికి తెచ్చుకొనేవారు అద్భుతాలెన్నో చేయగలుగుతారు, విచిత్రమైన మహిమలు ప్రదర్శించెదరు. ఇటీవల కాలంలో ఎందరో స్టూలు, అక్షరాల చారులు, ఆటోరైటింగు పద్ధతి మొదలైన ఉపకరణముల ద్వారా లేదా వాటి సహాయంతో మంత్రాత్మలను పిలిచి, వాళ్ల ద్వారా విశేషములను తెలుసుకోవడానికి ప్రయత్నించడం చాల చోట్ల ఉంది.

స్టూపద్ధతి : ముగ్గురో, నలుగురో చుట్టూ చేరి, మధ్యలో ఒక తేలికపాటి స్టూను పెట్టుకొని, దానిమీద నలుగురు చేతులు పెట్టి బలంగా నొక్కకుండా ఉంచి, తమ ఇష్టదేవతను ప్రార్థన చేయుదురు. దేవతలు తీవ్రమైన తపస్సు చేస్తే కానీరారు. కాని మానవులతో సంబంధం కోసం వేచియున్న ఏ ప్రేతాత్మయో యిందులో ఎవరో ఒకరి శరీరం ద్వారా చేతులలో నుంచి స్టూను కదిలింప చేస్తుంది. ఒక కాలెత్తి కొడుతుంది. కొంచెము జరుగుతు వుంటుంది. మనసులో ఒక కోరిక కోరుకుని, అది జరిగినట్లయితే, నువ్వు కొంచెము జరగమంటే ఆ స్టూ ఒక రవ్వ ప్రక్కకు జరుగుతూ వుంటుంది. ఆ కదలికను బట్టి తమ కోరిక తీరుతుందో, తీరదో, ఆ మనుష్యులు నిర్ణయించుకొంటారు తమకు దివ్యశక్తి వచ్చిందని మనుష్యులు ఆనందిస్తారు.

అక్షరాల చార్టు : రకరకాల ఇంగ్లీషు అక్షరములను బోర్డుమీద గళ్లలో వ్రాసి వుంచి, మనసులో ప్రార్థించి, ఒక కలమో, పెన్నిలో చేతిలో పెట్టుకొని, తేలికగా ఆ చార్టు మీద ఆనించి ఉంచితే సరి. కాసేపటికి అక్షరాల మీద ఆ కలము కదులుతూ వుంటుంది. కలము మూసివేసి పెట్టుకోవాలి. లేకపోతే అక్షరాలకు సిరా అయ్యే ప్రమాదమున్నది. మనస్సునందు ఏదో ప్రశ్న వేసుకొంటే చాలు. ఇకపైన ఆ కలం కదలికలను గమనిస్తూ ఉండాలి. అది నెమ్మదిగా ఒక్కొక్క అక్షరము దగ్గర ఆగిపోతూ ఉంటుంది. ఏ అక్షరం దగ్గర ఆగిందో, వాటిని కూడబలుక్కుంటే ఒక వాక్యము నిర్మాణమవుతుంది. అందులో అడిగిన ప్రశ్నకు సమాధానముంటుంది.

ఆటో రైటింగు : ఈ పద్ధతిన సున్నగా ఒక కాగితం మీద చక్కగా వ్రాసే ఒక కలం పెట్టుకొని, వ్రాయడానికి సిద్ధంగా పెట్టుకోవలయును. అంటే కాగితం మీద పాళీ ఆనించి, మరీ గట్టిగా కలాన్ని నొక్కకుండా దానంతట అది కదలటానికి స్వేచ్ఛగా కదలటానికి చెయ్యి ఒక వుపకరణంగా మాత్రమే వుండాలి. ఇంతకు ముందు పద్ధతులవలే మనస్సులో ప్రార్థన చేసి మొదలు పెడితే కలం దానంతటదే వ్రాయటం మొదలు పెట్టును. చూచే వాళ్లకు కలంతో వాళ్లే వ్రాస్తున్నారేమో అనిపించును. కాని వ్రాసే వాళ్లకు మాత్రం తాము వ్రాయడం లేదనిపించును. ఏ అదృశ్య శక్తో తమ చేత వ్రాయిస్తుందని పించును. అపుడు మొదలవుతుంది మానవ నైజం. ప్రశ్నలు బయలు దేరుతవి. వాటన్నిటికి ఓపికగా సమాధానాలు చెప్పను. భవిష్యత్తును గూర్చి వాళ్లు అడిగిన ప్రశ్నలకు వ్రాయబడిన జవాబులు జరగని పరిస్థితి ఏర్పడును. అపుడు ఏర్పడును సందేహము. కాని కొంచెము జాగ్రత్తగా ఆలోచన చేసిన అర్థమగును. సంవత్సరాల తరబడి కఠోరమైన అహార నియమములతో, సిద్ధక్షేత్రాలు ఆశ్రయించి,

తపస్సు చేసిన కాని అనుగ్రహించని దేవతలు కలం చేత్తో పట్టుకో గానే, ఇట్టే వచ్చి, అడిగిన ప్రశ్నలకు అన్నింటికి సమాధానాలు చెబుతూ కూర్చుంటారా? వచ్చినవాళ్లు మానవుల కంటే అతీతులు కాకపోవచ్చును. కాని మహిమాన్వితులైన వ్యక్తులు, దేవతలు మాత్రం కాదు.

దివ్య దృష్టి : మంత్ర, తంత్ర, యోగ సాధనాలలో ఏ సాధన చేసినా సిద్ధిని పొందే దశలో సాధకునికి లభించేది దివ్య దృష్టి. భౌతికమైన చర్మ చక్షువులతో చూడలేని విషయాలు చూడగలగ టము, దీనిలో జరుగుతూ వుంటుంది. చరాచరా సృష్టి జగత్తు నందు జరిగే విషయములను క్షణమాత్రమున తెలుసుకోగల్గినది దివ్యదృష్టి వలన మాత్రమే. ఈ దివ్యదృష్టి విషయము మన పురాణముల యందు గాననగుచున్నది, రఘువంశంలో దిలీప చక్రవర్తికి చాల కాలము వరకు సంతానము లేదు. ఎంత కాలమో వేచి, అనేక వ్రతములు చేసి, సంతానము కలగ నందువలన, చివరకు కుల గురువు వశిష్టుల వారు ధ్యాన సమాధిలో దిలీపుని దోష గాథను, కామ ధేనువు చేత పొందిన శాపాన్ని ఆ దోషాన్ని పోగొట్టుకోవడానికి మార్గం తెలిసికోగలిగినారు.

ఇటీవల కాలమున సిద్ధ వ్యక్తులంతా దివ్యదృష్టిని సాధించిన వారే. రామకృష్ణ పరమహంస ఈ జన్మకు రాకముందు ఊర్ధ్వ లోకములనుండి ఒక దివ్య శిశువుగా క్రిందకి దిగివస్తుండగ, మధ్య త్రోవలో కనబడిన ఒక మహర్షిని తనతో పాటు మానవ జన్మ ఎత్తి, తనకు సహకరించడానికి రమ్మని కోరినట్లుగా, ఒకచోట తన గ్రంథమున తెలిపెను. ఆ ఋషియే వివేకానందుడు. అంతేగాదు, ఆయన్ని సేవించుటకు విచ్చేసిన శిష్యులు గూడ వారి పూర్వ జన్మ సంస్కార మును దివ్యదృష్టిలో పరిశీలించిన వారే.

అరుణాచల వాసియైన శ్రీ రమణ మహర్షి అంతటి మహాత్యము కలిగిన వ్యక్తి, మంత్రసిద్ధుడు, మహాకవి అయిన కావ్యకంఠ వాసిష్ఠ గణపతి ముని తన పూర్వ జన్మ విషయములను తెలుసుకోవటము మాత్రమే గాక, ఎందరి విశేషాలనో చూడగనే చెప్పగలిగే వారు. ఇంత దివ్యదృష్టి, మనోనేత్రము, జ్ఞానలోచనము తెరుచుకొనే మార్గము ఏమిటి అని పరిశీలిస్తే

"ఆకుంచ్య వాయు మవిజిత్యచ వైరిష్కటం
ఆలోక్య నిశ్చల ధియానిజ నాసికాగ్రం"

గాలిని కుంభించి, అరిషడ్వర్గాన్ని జయించి, నిశ్చల బుద్ధితో, నాసాగ్రమును చూస్తూ ఉండాలి, అని యోగ శాస్త్రములు చెబుతున్నవి.

సిద్ధుడైన మంత్రవిభుని చేత ఉపదేశమును పొంది భ్రూ మధ్యమునందు దేవతను నిలుపుకొని, కనులు మూసి, జపసాధన ఏకాగ్రంగా చేసిన తప్పక మూడవ కన్ను అంతర లోచనం విచ్చుకొంటుంది.

<u>అంజన విద్య</u> : అంజన విద్యయును కూడ ప్రసిద్ధమైనది. కొన్ని మూలికలతో కాటుక తయారు చేసి, తమలపాకుపైన లేక బొటన వ్రేలి గోరుపైననో దానిని రాసి, చూడటమో లేక ఇతరుల చేత చూచేలా చేయుటమో, ఇందులో జరుగుతుంది. ఇందులో కావలసిన దృశ్యములు ఆంజనములో కనిపించును. ఇదే విద్యను పిల్లల చేత అంజనం వేయించే సందర్భాలలో మాంత్రికులు వాళ్ల మనసులను అదుపులోనికి తెచ్చుకొని చూడవలసిన వాటిని ప్రేరేపించి, తాము చెప్పినవి చూచేటట్లుగా చేయడం వలన భవిష్యత్తు ఫలితమును చెప్ప గలుగుచున్నారు. కొన్ని సందర్భముల యందు అవి తప్పుగా జరుగు చున్నది. దీనికి ఏకాగ్రత, మనో నిశ్చలత, మంత్రసిద్ధి పొందడం ముఖ్యము.

ఉచ్ఛిష్ట గణపతి : తంత్ర శాస్త్రముల యందు అనేక మయినటువంటి క్షుద్ర విద్యలు పేర్కొనబడినవి. అందులో ఒకటి ఉచ్ఛిష్ట గణపతి. విఘ్న నివారకునిగా, సర్వార్థ, ప్రధాతగా, ప్రసిద్ధుడయిన గణపతికి సంబంధించిన విద్యలలో చాలా ప్రసిద్ధమైనది. మంత్ర మహోధధి కర్త.

"ద్యూతే వివాదే జప్తోయం జయమావహేత్,
కుబేరోస్య మనోజ్ఞాపాత్ నిధీనామ్ స్వామితా మయాత్
లేభాతే రాజ్య మనరిం వానరేశ విభీషణౌ"

జూదములో, వివాదములో, యుద్ధములో ఉచ్ఛిష్ట గణపతి మంత్రం జపిస్తే జయం తప్పక సిద్ధిస్తుంది. ఈ మంత్ర జపించే, కుబేరుడు నిధులకు అధినాధుడైనాడు. వానరేశ్వరుడైన సుగ్రీవుడు రాక్షసుడైన విభీషణుడు శతృరహితముగా రాజ్యాన్ని పొందాడు. దీనిని సాధించ డానికి అనేక ప్రక్రియలు గలవు. రక్త చందనంతో కాని, తెల్ల జిల్లే డుతో కాని, వేపతో గాని, సాధకుని బొటన వేలి పరిమాణము గల గణపతి విగ్రహమును తయారు చేసుకోవలయును. దానికి ప్రాణ ప్రతిష్ట చేసి, షోడశోపచారములతో పూజ చేసి రోజూ జపం చేయ వలయును. ఇటువంటి వాటన్నింటికి కృష్ణ పక్షంలో అష్టమి నుండి చతుర్దశి వరకు చెయ్యడం ఒక పద్ధతి.

రక్త వస్త్రములు ధరించి, రక్తాంగ రాగములు పూసుకొని. దేవనివేదితమువైన భక్ష్యములను కాని లేక తాంబూలమును కాని తింటూ, రాత్రిపూట జపం చెయ్యటం అవసరం. ఘృత తైలాదులతో గూడిన దోష ప్రక్రియ కూడ చెప్పబడినది. దిగంబరుడై జపించడం మరొక పద్ధతి.

ఈ గణపతి విగ్రహమును అనేక రకములైన వస్తువులతో తయారు చేయవచ్చును. అవి ఉపయోగించే వస్తువులను బట్టి, అవి

యిచ్చే ఫలితములు ఉంటవి, కుమ్మరి మట్టితో చేసిన బొమ్మలు రాజ్యదాయిని, పుట్టమట్టితో చేసిన కోరికలన్నింటిని ఇయ్యగలదు. బెల్లముతో చేసినది సౌభాగ్యాన్ని ఇస్తుంది. ఉప్పుతో చేసినది శత్రువులను క్షోభింప చేస్తుంది. ఇవిగాక నీచాతినీచమైన మరొక పద్ధతి కూడ ఉన్నది. సాధకుడు తన మలమూత్రములతో చితాభస్మాన్ని కలిపి, బొమ్మను తయారుచేసి, శ్మశానంలో రాత్రివేళ పూజచేసి, రక్తాన్నమును నైవేద్యం పెడుతూ జపం చేసిన చాలా వేగముగా హస్తిముఖుడైన పిశాచ వల్లభుడు ప్రత్యక్షమై అనుగ్రహిస్తాడు.

శ్వేతార్కంతో చేసిన గణపతి విగ్రహం మీద నిరంతరం నీళ్లు పుక్కిలించి, ఉమ్మేస్తూ జపం చేయవలెను. మన ప్రాంతముల యందు ఎవరైనా ఎక్కువగా ఉమ్మేస్తూంటే ఏమిరా ఏమన్నా ఉచ్ఛిష్ట గణపతి చేస్తున్నావా? అనేవాళ్లు ఉన్నారు.

ఘోరములైన ఉపద్రవాలు వచ్చినపుడు తెల్ల జిల్లేడుతో కాని; వేపచెక్కతో కాని బొమ్మను తయారు చేసి. రక్తచందన పుష్పాదులతో పూజించి, మధ్య భాండములో దానిని ముంచి, మోచేయి లోతు త్రవ్విన నేలలో పూడ్చి, దానిపై కూర్చుని, జపం చేసిన 10 రోజులలో ఉపద్రవాలు తొలుగుతవి.

"విషమే సమను ప్రాప్తే సితార్కారిష్ట దారుజం
గణపం పూజతం సమ్యక్ కుసుమైః రక్తచందనైః
మధ్యభాండ స్థితం హస్త మాత్రేతం నిఖనేత్ స్థలే
తత్రోప విశ్యప్రజపేత్ మంత్రి నక్తంది వామనుం
సప్తాహ మధ్యే నిశ్యంతి సర్వే ఘోరా ఉపద్రవాః"

దుష్ట స్త్రీలను, సామాన్య సాధనల చేత వశం కాని వాళ్లను వశం చేసుకోవడానికి చేయవల్సిన పద్ధతి చూడండి.

"దుష్టస్త్రీ వామపాదశ్య రాజసానిజ దేహజైః
మత్రైర్మూత్రి పురీషాద్యైః కుంభకారక మృదాపిచ
ఏతైః కృత్వాగణేశస్య ప్రతిమా మద్య భాండగాం
సంపూజ్యనిఖనే ద్భూవశా హస్తార్ధే పూరితేపునః

దుష్ట స్త్రీ ఎడమ కాలి ధూళిని సంపాదించి, సాధకుడు తన మల మూత్రములతో కుమ్మరి ఆవములోని మట్టితో కలిపి, గణేశ ప్రతిమను చేసి, మధ్య భాండములో పెట్టి పూజను చేసి, నేలలో పూడ్చి దానిపైన గన్నేరు పూలతో హోమం చేయవలెను. వెయ్యి ఆహుతులు వేసి, పూర్ణాహుతి చేసిన ఆ స్త్రీ తనంత తాను మనో ధనములతో సాధకుడికి దాసురాలగును.

"నదీజలం సమాదాయసప్త వింశతి సంఖ్యయా
మంత్రయిత్వా ముఖం తేన ప్రక్షాళ్యేశ సభాంవ్రజేత్
పశ్యేద్యం దృవ్యతేయేన సవశ్యో జాయ తేక్షణాత్"

నదిలోని నీరు తెచ్చి, ఇరవై ఏడు సార్లు మంత్రించి, ముఖం కడుక్కొని, రాజ సభకు వెళితే, ఇతరెవరిని చూచినా ఎదుటి వాడు క్షణంలో వశమవుతారు.

విద్యాప్రదాతగా భూత భవిష్యద్వర్తమానాలను తెలిపే దేవునిగా ఎక్కువ ప్రసిద్ధి చెందిన ఉచ్ఛిష్ట గణపతి క్షుద్ర విద్య గురించి ఇంకా ఎక్కువగా తంత్ర శాస్త్రమునందు చెప్పబడినది.

<u>కర్ణ పిశాచి :</u> ఇది విచిత్రమైన విద్య. దీనిని ఉపాసించిన వాళ్లకు ఇది చెవులో అన్ని విధములైన విషయములను, పిలిచినప్పుడెల్ల, వచ్చి చెబుతూ ఉండును. క్షుద్ర విద్య కావటం వల్ల బ్రహ్మనిష్ఠులైన వ్యక్తులు దీని జోలికి రారు. తంత్ర గ్రంథములందు దీని సాధనలో

అనేక రీతులు చెప్పబడియున్నవి. మంత్ర రత్నాకరమునందు పిప్పలాద ఋషి దర్శించిన కర్ణపిశాచి దేవతా రూపం.

"చితా సనస్థాం నరముండ మాలాం
విభూషితం అస్థిమణీం కరాబ్జైః
పోత్రితాం నరాంత్రైః దధతీం కువస్త్రాం
భజమహేః కర్ణ పిశాచినీం తాం"

ఎముకలు, పేగులు, నరముండ మాల ధరించి, చితాసనము నందుండే కర్ణపిశాచి దేవతను స్మశానమునందు గాని, శవముపై కూర్చుండి గాని, లక్ష జపం చేసి, అందులో దశాంశ విభీతక సమిధలతో హోమం చేయవలెను. ఆ తరువాత అనుష్ణమై బదరీ తరువు క్రింద కూర్చుని, మరో లక్ష చేయవలెను. అపుడా పిశాచము ప్రసన్నురాలై చెవులో సర్వ విషయములు చెబుతుంది. ఇదే విద్యను మరొక చోట అంటే మంత్రరత్నాకరం నందు చెబుతూ, విభీతక వృక్షం క్రింద ఒక లక్ష జపించి, 21 రోజుల పాటు శయ్యాతలము నందు నగ్నుడై అష్టోత్తర శతము జపించిన అపుడు పిశాచము సంతోషించి, అనుగ్రహించునని శాస్త్రము నందు తెలియచేసినారు. డీటాకారిణీ తంత్రలో మరొక సాధన చెప్పబడింది. ఆ మూర్తి వర్ణన.

"ధ్యాయేత్ తశాచీంచల శూల హస్తాం
శ్యామాం సుదీర్ఘాం యువతీం త్రినేత్రాం
క్రిద్ధాం వివర్ణాం తను వృత్తమధ్యాం
సంజాఫలైః కల్పితహారయష్టీం"

గురివింద గింజల దండ మెడలో ధరించి, చేతిలో శూలం పట్టుకొన్న ఒక దీర్ఘశ్యామలమైన త్రిలోచనను మంత్ర పూర్వకముగా ధ్యానించ వలయును. ఇరవై ఒక్క రోజులు సూర్యోదయం నుండి సూర్యా

స్త్రమ్లయం దాకా జపించి తాను తినే ఆహారమును మేడ మీద ఉంచిన, ఉపాసన కాలము పూర్తి అయిన తరువాత కర్ణపిశాచి వచ్చి, మనకు కావలసిన విషయములన్నియు క్షుణ్ణముగా చెబుతుంది.

ఇటువంటివే కర్ణయక్షిణి, కర్ణమాతంగి మొదలైన విద్యలు. అయితే పిశాచి విద్యలు సిద్ధించినంత త్వరగా ఇవి సిద్ధించవు.

గుంటూరు నందలి శృంగేరి పీఠాధిపతులు జగద్గురు (శ్రీ) కళ్యాణ నంద భారతీ స్వామి నిలయంలో ఒకవింత జరిగినది. ఒక రోజు ఒక వ్యక్తి వచ్చి, పీఠంలో ఉన్న కొంత మందికి జాతకము, చెయ్యి ఏదీ చూడకుండానే చెవి దగ్గర చేయిపెట్టుకొని, భూత భవిష్యత్ వర్తమానాలను చెప్పేస్తున్నాడు. అంతా ఆశ్చర్యపోతు వింటున్నారు. ఈ కలకలం విని మేడ మీదనుండి క్రిందకు వచ్చారు గురువుగారు. ఆ జ్యోతిష్కుడాయనకు సాష్టాంగ నమస్కారము చేస్తాడు. ఆయన విషమేమిటని అడిగారు. శిష్యులు అంతా వివరించారు.

ఆయన నవ్వుతూ, వాళ్లందరికీ చెప్పావు కదా, నాకు కూడ చెప్పవయ్యా అన్నారు. అలాగే స్వామి అంటూ వాడు ఒక క్షణం కళ్లు మూసుకొని, చెవి దగ్గర పెట్టుకొని, ఏదో విని చెప్పలేకపోయినాడు. ఖిన్నుడై నా దేవత పలుకడంలేదండి అని నమస్కరించి వెళ్లిపోయినాడు. శిష్యులకు సందేహం కలిగింది. మాం అందరికీ అంత అద్భుతంగా చెప్పిన జ్యోతిష్కుడు, స్వామీ మీకెందులకు చెప్ప లేక పోయినాడు? అని అడుగగా, విశేషమేమియును లేదు. వాడు కర్ణపిశాచిని విద్య సాధించినాడు. అది అడిగిన సంగతులన్నీ చెవుల్లో చెబుతూ ఉండును. దానికి ఇంక జాతక చక్రము అక్కర్లేదు. చెయ్యి చూడడం అవసరం లేదు. మనిషిని చూచిన చాలు. నా ఎదురుగ వున్నపుడు వాడు పిలిచినా ఆ క్షుద్ర పిశాచం రాలేకపోయినది. అందు

వల్లన వాడు వెళ్లిపోయినాడు. మహాపురుషుల ముందు క్షుద్ర పిశాచాలు వచ్చి నిలువ లేవు. ఇటువంటి సంఘటనలు మన దేశంలో ఎన్నో ఉన్నాయి.

శవ చింతామణి : చింతామణి విద్య శవసాధనలలో ప్రథమమైనది. సంస్కృతంలో నైషధీయ చరిత్రమనే మహాగ్రంథాన్ని రచించిన శ్రీ హర్షుడు శవ చింతామణి మంత్ర ప్రసిద్ధుడని ఒక ప్రసిద్ధమైన కథ ప్రచారంలో ఉన్నది.

"శ్మశానే శూన్యసదనే దేవాగారే ధనిర్జనే
పర్వతే నవ మధ్యేవా శవమారుహ్య మంత్రదుత్
సమరే శత్రునిహతం యద్వాషాణ్మాసికం శిశుం
విద్యాం సంసాధయేత్ శ్రీఘ్రం సాధితైవం ప్రసిద్ధ్యతి"

శ్మశానములో ఎవరూ నివశించని యింట్లో, దేవాగారమున, నిర్జనమైన పర్వతమున అడవిలో శవముపై ఎక్కి జపము చేయవలయును. యుద్ధములో శత్రువుల చేత మరణించిన వాని శవమైన, ఆరు నెలల శిశువైనా సరే, అలాగే శాస్త్రీయమైన పద్ధతిలో చేస్తే త్వరగా సిద్ధిస్తుంది.

శ్రీహర్షుడి తండ్రి పేరు శ్రీహీరుడు. తల్లి మామల్లదేవి. శ్రీహీరుడు ఒక విద్వాంసుని చేతిలో వాదమునందు ఓడిపోయినాడు. శపథ ఫలితంగా ప్రత్యర్థి పండితుని పాదుకలను జీవితాంతం పూజింపవలసి వచ్చినదట. ఆ అవమానమును భరించలేక అనతి కాలంలోనే శారీరకంగా, మానసికంగా కృశించి అతడు మరణించినాడు. అప్పటికి శ్రీహర్షుడు పసివాడు. అతనికి ఇవేమియు తెలుసుకొనే వయస్సు కాదు. అతడు కాస్త పెరిగి, ఉపనయనమై, విద్యాభ్యాసం మొదలుపెట్టిన వెంటనే అతని తల్లికి తన బిడ్డను మహాపండితుని చేసి, తన

భర్తకు అవమానం కలిగించి, అకాల మృత్యువుకు కారకుడైన శత్రు విద్వాంసుడ్ని పరాజితుడిని చేయించాలని పట్టుదల ఏర్పడినది. ఆ దీక్ష తోనే ఆమె ఇంతకాలం ప్రాణాలుగ్గబట్టుకొని వుంది. కాని బిడ్డ శ్రీహర్షుడెప్పటికి విద్య పూర్తి చేసుకొని, ఆ విద్వాంసుడిని పరాభవం చేయగలడు ? ఒకవేళ ఉన్నా తన కుమారుడే గెలిచి తీరతాడని నమ్మక మేమిటి ? జయాప జయములు దైవాధీనాలు గనుక మామల్లదేవి ఆలోచించి దైవాన్ని వశం చేసుకొంటే తప్ప చిన్న వయస్సులోనే తన కుమారునికి పగ తీర్చుకొనే శక్తి రాదని నిశ్చయం చేసుకొన్నది. తపస్సువల్ల మాత్రమే దేవతలు అనుగ్రహిస్తారు. కాని శరీరాన్ని కృశింప చేసుకొని ఎంతో కాలము కఠోరనియమాలతో జపిస్తేగాని దేవతలు ప్రసన్నము కారు. కనుక సామాన్యమైన వైదిక మార్గంలోనే కాక, తీవ్ర వామాచార మార్గంలో ఆత్మ బలిదానం ద్వారా సిద్ధి సాధించాలని ఆమె నిర్ణయించుకొన్నది.

ఇంకా శ్రీహర్షుడు తానెత్తుకొనే వయస్సులోనే వున్నాడు. ఆమెకు చింతామణి విద్య తెలుసు. సరస్వతి అధిదేవతగా గల చింతామణి మంత్రమును శవముపై కూర్చుండి జపించిన వెంటనే దేవతా సాక్షాత్కారాన్ని కలుగుతుందని ఆమె ఎరుగును. శ్రీహర్షునికి మంత్రోపదేశం చేసి, తాను క్రింద పడుకొని, అతనిని మీద కూర్చుండబెట్టుకొని, కండ్లు మూసుకొని, తాను పిలిచిన దాకా జపం చేయమని చెప్పింది. కుర్రవాడు జపం చేయుచున్నాడు. ఆమె తన కుమారునికి మంత్రసిద్ధి కలగాలని సంకల్పించి, నిశ్శబ్దంగా ప్రాణాలు వదిలింది. తల్లి పిలిచిన వరకు జపం చేయాలి గనుక శ్రీహర్షుడు జపిస్తూనే వున్నాడు. ఆ తల్లి సంకల్ప శక్తివల్ల, శవము మీద కూర్చుండి జపం చేసినందువల్ల, చింతామణి మహామంత్ర దేవతయైన సరస్వతి అతనికి సాక్షాత్కరించి, అజేయమైన కవితా పాండిత్యమును ప్రసాదించింది. ఆ సిద్ధ శక్తితో ఆతడు ప్రత్యర్థులను జయించి, తండ్రి

అవమానానికి ప్రతి క్రియ చేసి, తల్లి ఆత్మకు శాంతి కలిగించాడు, నైషధం నందు చింతామణి మంత్రము అద్భుతంగా వర్ణింపబడియున్నది.

"అవామావా మార్ద్రే సకల ముభయాకార ఘటనా
ద్ద్వేధా భూతం రూపం భగవదభి ధేయం భవితియత్
తదం తర్మంత్రియే స్మర హరమయం సేందు మమలం
నిరాకారం శశ్వజ్జ పనకపతే సిధ్యతు సత్"

(చింతామణి శ్లోకము)

ఇది ప్రణవ సంపుటితమైన మాయా బీజ మంత్రము. రోజు తెల్లవారు ఝామున నే లేచి, తూర్పువైపుకు తిరిగి చింతామణి మహా మంత్రాన్ని శ్రద్ధతో జపించే వారికి సర్వశుభములు కలుగునని సరస్వతీ దేవి నలునకు ఉపదేశించినట్లుగా హర్షుడు తెలియజేసినాడు.

"ఎంత జడుడైన గానీ
చింతామణి మంత్రరాజ సేవాపరుడ
ద్భ్రాంతంబున కవితా సి
ద్ధాంత రహస్యోపనిష దుపాధ్యాయుడగున్"

ఎంత మొద్దయినా సరే, ఒక సంవత్సరము ఈ చింతామణి మంత్రమును నిష్ఠతో జపించిన, మహాపండితుడై, కవితాచార్యుడై వర్ధిల్లుతాడు. అట్లే తార మంత్రము, దశ మహావిద్యలలో కాళీ మొదలగునవి గూడ ఈ తరహా విద్యలే. శాస్త్ర దృష్టితో, పరిశోధన దృష్టితో ఈ శవసాధనలు ఇవ్వబడుతున్నవే గాని, ప్రయోగసాధన వైఖరితో ఆలోచించే వారు ప్రస్తుత చట్టములను దృష్టిలో ఉంచు కోవడం ఎంతయినా ఉత్తమము.




ఉపయుక్త గ్రంథ సూచిక :

1. డాక్టరు ప్రసాదరాయ కులపతికృతులు పై పరిశీలన అముద్రిత సిద్ధాంత వ్యాసము - డా॥ కోటి సూర్యనారాయణమూర్తి

2. తాంత్రిక ప్రపంచము - డాక్టరు ప్రసాదరాయ కులపతి.